# ఆంధ్రప్రదేశ్



ఖేలద్వధూనాం వదనాంబుజాని

జనవరి, 1965

# ఆంధ్రప్రదేశ్

ప్రధాన సంపాదకుడు టి. రాజేంద్రరాజు

సంపుటి : 9 పుష్యం - మాఘం 1886 శకం

సంచిక : 3 సంపాదకుడు : కప్పగంతుల లక్ష్మణశాస్త్రి జనవరి, 1965

## విషయసూచిక



---

మొదటి అట్ట ఖేలద్వధూనాం వదనాంబుజాని
విభాంతి పుష్పస్తబకైః సమం క్షితౌ —భారవి

ఆడుచున్న స్త్రీల యొక్క ముఖకమలములు, భూమియందున్న పుష్పగుచ్ఛములతో సమానముగా ప్రకాశించుచున్నవి.

రెండవ అట్ట తతస్తైశ్చోదితా సా నౌః
కర్ణధార సమాహితా
గుహస్య వేగాభిహతా
శీఘ్రం సలిలమత్యగాత్ —వాల్మీకి

సీతారామలక్ష్మణులు ప్రోత్సహింపగా నావికులు నడుపుచున్న పడవ గుహుడు తొందరపెట్టగా నీటిని దాటెను.

మూడవ అట్ట నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమోనమస్తే —భగవద్గీత

ఓ దేవా! నీకు అనేక నమస్కారములు వేలకొలదిసార్లు మాటిమాటికిని చేసెదను.

నాలుగవ అట్ట: "కృషితో నాస్తి దుర్భిక్షం"
వ్యవసాయముచే జీవించువారికి కరువు ఉండదు.





ప్రియమైన చదువరీ,

కొత్త సంవత్సరంలోకి మనం అడుగు పెట్టాం. కాలం నిరంతరమూ ప్రవహించే అనంతమైన స్రవంతి లాంటిది. తనకు వీలుగా వుండడానికని మనిషే కాలాన్ని రోజులు, నెలలు, సంవత్సరాలుగా విభాగించుకున్నాడు. కొత్త సంవత్సరానికి ముందటి దినాలు సాధారణంగా సమీక్షించుకునేదినాలు; ఆత్మసంశోధన చేసుకునేదినాలు. అలా చేసుకుంటున్నప్పుడు గతంకన్న భవిష్యత్తును ఉజ్జ్వలంగా ఊహిస్తూ ఆశ నింపుకున్న కళ్ళతో రానున్న దినాల వైపు చూస్తుంటాం.

పందొమ్మిది వందల అరవైనాలుగు దురదృష్ట వశాత్తూ మనకు దుఃఖభాజన మయ్యింది. అయితే అక్కడక్కడ మిణుగురుల్లా వెలుగు లున్నమాట నిజమే. అది వేరే విషయం. ఆ ఏడాది మన ప్రియతమనాయకుడు మనల్ని వీడి పోయాడు. ఆ తాకిడికి మనం తట్టుకోలేకపోయాం. ఆ దెబ్బనుండి తేరుకోవడానికి యావత్తు దేశానికి కొంతకాలం పట్టింది. గత పదిహేడేళ్ళుగా నెహ్రూజీ దేశానికి చేసిన సేవ ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ఆయన నవభారత నిర్మాత. ఆయన మరణం మనచరిత్రలో ఒక శకానికి ముగింపు. మన కొత్త ప్రధాని శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి నెహ్రూజీకి సరియైన అనుయాయుడని నిరూపించుకున్నారు. మన భవిష్యత్తుకు సుందర సురూప కల్పనలు చేయటానికి నెహ్రూ అవలంబించిన పద్ధతుల మార్గంలో దేశ ప్రగతి యాత్రను నడిపించడానికి ఆయన అధిక ఆసక్తిని చూపిస్తున్నారు.

ఈ జీవితరంగస్థలం నుంచి ప్రముఖనాయకులు నిష్క్రమిస్తుంటే వారి స్థానంలో వారిలాగే విశ్వశ్రేయస్సుకు అంకితమైన అనుయాయులు వచ్చినప్పుడు కొంత మనశ్శాంతి వుంటుంది. అట్లాంటిక్ ఆవల, ఈర్ష్యాసూయల తుపాకిగుళ్ళతో హత్య కావించబడిన జాన్ ఫిట్జ్‌రాల్డ్ కెన్నెడీ రూపొందించి వెలుగులోకి తెచ్చిన శాంతి విధానాలను అనుసరించేందుకు కొత్త అధ్యక్షుడు లిండన్ జాన్సన్ నిశ్చయించారు. క్లిష్ట పరిస్థితుల్లో యుద్ధ కారుమేఘాలు అలముకున్న గాఢాంధకార తిమిరంలో చీకట్లను పారద్రోలిన కెన్నెడీ వహించిన స్వేఛ్ఛా ప్రపంచాధినేతృత్వము నిజంగా భారతదేశం వంటి అనేక ప్రజాస్వామిక దేశాలకు ఎంతో బలాన్నిచ్చింది. ఉక్కు తెరవెనుక భారత మిత్రుడు కృశ్చేవ్ నిష్క్రమణ నిజంగా విచిత్రమైన ఘటన. రష్యా-భారత దేశాల మధ్య స్నేహబంధాలను మరింతగా బలపరచడానికి చర్యలు తీసుకోగలమని రష్యా కొత్త నాయకులు వాగ్దానం చేశారు. పన్నెండేళ్ళ తర్వాత లేబర్ ప్రభుత్వం ఇంగ్లండ్ తిరిగి అధికారంలోకి వచ్చింది. ఇది భారతదేశానికి శుభావహం.

గత ఏడాది అంతర్జాతీయరంగంలో కొన్ని కొన్ని ప్రమాదకరమైన మార్పులు జరిగాయి. ఇప్పుడు చైనా తూర్పురాజ్యాలలో భయంకరమైన శక్తిగా పరిణమించింది. ఎంతసేపూ యుద్ధాలను

గురించి కలలు గనే చైనా యిప్పుడు తన తొలి అణుబాంబును పేల్చింది. దీనితో చైనా నగ్నస్వరూపం బైటపడిపోయింది. దానితో యీ పరీక్ష కేవలం ప్రపంచ శాంతి పరిరక్షణకే అన్న అభిప్రాయాన్ని ప్రపంచంపై రుద్దడానికి ప్రయత్నాలు సాగిస్తోంది. నిశితమైన పరిశీలకులు చెప్పుతున్నదాన్ని బట్టి చైనాలో అంత రంగిక పరిస్థితులు చాలా భయంకరంగా వున్నాయి. పరులకోసం జీవించనివాడు తన కొరకు కూడా జీవించలేడు — అన్న భావం ఆ ప్రజల్లో అలముకుంది. ఇలాంటప్పుడు అలీన రాజ్యాల కైరో సమావేశం మానవత్వానికే ఒక హామీ అనవచ్చు. అణచివేయ బడిన యీ ప్రజల్లో ఐకమత్యాన్ని, సహృదయతను విస్తరింపజేయ డానికి అలీన రాజ్యాలు శక్తివంచన లేకుండా నిరంతరం శ్రమిస్తున్నాయి.

పందొమ్మిది వందల అరవైనాలుగు మన రక్షణ సమస్యపై ఒక నమ్మకాన్ని ఏర్పరచింది. వివిధ స్నేహ రాజ్యాలకు మన రక్షణ మంత్రి చేసిన పర్యటన వల్ల ఆయాదేశాలు మన సమస్యను సరిగా అర్థంచేసుకున్నట్లు ధృవపడింది. ఇప్పటికే ఎంతో సహాయం లభించింది. ఇంకా లభిస్తుంది. మన రక్షణశాఖ సర్వసమృద్ధమైంది. రక్షణ సామగ్రి పటిష్టవంతమైంది.

స్వీయ రక్షణకు ఒకే ఒక మార్గం రక్షణ బలాన్ని పటిష్ఠ వంతంగా, సర్వసమృద్ధంగా చేసుకోవడమే. శతాబ్దాల నాటినుండి కూడా భారతదేశం శాంతియుత సహజీవన విధానాన్నే అనుసరిస్తు న్నది. వివిధ మతాలతో నిండికూడా సహజీవనానికి అలవాటు పడిన ఏకైక పురాతన రాజ్యం భారతదేశం. ఈ విషయాన్నే యిటీవల బొంబాయిలో జరిగిన ప్రపంచ క్రైస్తవమహాసభలో పునరుద్ఘాటించడం జరిగింది. పోప్‌కు మనదేశంలో అఖండస్వాగతం లభించింది. అనేకమైన మధుర స్మృతులతో ఆయన యీ దేశాన్ని వదిలి వెళ్ళారు.

సెప్టెంబరు నెలలో ఆంధ్రప్రదేశ్‌కు వరదల తాకిడి తీవ్రంగా తగిలింది. సారవంతమైన మన జిల్లాలోని గ్రామాలన్నింటికీ పొరుగు ప్రాంతాలనుంచి సంబంధాలు తెగిపోయాయి. అదొక పీడకలవంటి అనుభవం. ఆ విషమ పరిస్థితిని ప్రజలు ధైర్యంగా ఎదుర్కొన్నారు. పైరుకు భారీ ఎత్తున నష్టం వాటిల్లింది. వరద దెబ్బకు గురైన జిల్లాలలో నిస్సహాయులైన బాధితులకు సహాయపడ డానికి రాష్ట్రప్రభుత్వం సాధ్యమైనదంతా చేసింది.

దేశంలో కూడా మొదట్లో ఆహార సమస్య తీవ్రరూపం దాల్చు తున్నట్లు కనిపించింది. కాని మన భయాందోళనలు నిర్హేతుకమైన వైనట్లు గోచరిస్తున్నది. గత రెండు మూడు సంవత్సరాలుగా ఋతుపరిస్థితులు బాగాలేవు. కనుక ఇప్పుడైనా ఇవి బాగుండ గలవని మనం ఎదురు చూడవచ్చు. దేశంలో దైవికమైన పరిస్థితుల వల్లనైతేనేమి, ప్రభుత్వం శ్రద్ధగా గైకొంటున్న వివిధ చర్యలవల్ల నైతేనేమి లేదా ఈ రెండింటివల్లనైతేనేమి వచ్చే సంవత్సరం వ్యవసాయోత్పత్తి సంతృప్తికరంగా వుండాలి.

మన రాష్ట్రానికి గర్వ కారణమైన బృహత్తర నాగార్జునసాగర్ ప్రాజెక్టు తొలిదశ 1966 వ సంవత్సరారంభంనాటికి ముగిసి ఆరులక్షల ఎకరాలకు నీటి పారుదల జరగడంతో ఆహారోత్పత్తి, వినియోగాల మధ్య వున్న అంతరం చాలావరకు సమసిపోవడం తథ్యం. ఈలక్ష్య సాధనకై కేంద్రప్రభుత్వం కూడా రాష్ట్రప్రభుత్వానికి, ఈ సంవత్స రం రూ. 4 కోట్లు యివ్వడం ద్వారా, వచ్చే సంవత్సరం అవసర మైన రూ. 10 కోట్లు కేటాయించడం ద్వారా సహాయపడుతున్నది. కేంద్రం తుంగభద్ర ఎగువ కాలువ పథకానికి కూడా రు 1,1 కోట్లు లభింప జేసి సహాయపడింది. తుంగభద్ర ఎగువ కాలువ పూర్తయి నప్పుడు వెనుకబడిన రాయలసీమ ప్రాంతం సస్యశ్యామల మవుతుంది.

మన రాష్ట్రంకొరకు సికింద్రాబాదు కేంద్ర కార్యస్థానంగా దక్షిణ-కేంద్ర మండలం పేరుతో కొత్తరైలు మండలం నెలకొల్పబడు తున్నందుకు నేను సంతోషపూర్వకంగా మీ ఆనందంలో పాలుపంచు కుంటున్నాను. ఈ నూత్న మండలం ఏర్పాటువల్ల మన ప్రజలకు ఉత్తమ ప్రయాణ సౌకర్యాలు ఏర్పడటమేగాకుండా రాష్ట్రంలో వర్తక, వాణిజ్యాలు కూడా అవశ్యం తీవ్రంగా అభివృద్ధిజెందుతాయి.

బర్మా, పాకిస్తాన్‌లనుంచి వచ్చిన దురదృష్టవంతులైన నిర్వాసు లకు పునరావాసం కల్పించడంలో, ఇతరరాష్ట్రాల వారితో పాటుగా మనంకూడ గర్వదాయకమైన కృషి జరుపుతున్నాం.

మన రాష్ట్ర నాలుగవ పంచవర్ష ప్రణాళికకు తుది మెరుగులు పెట్టాము. ప్రజాభిప్రాయాన్ని అన్ని దృక్పధాలనుంచి తెలుసుకోవ డానికి పరిపాలనా నిర్వాహకులకు అవకాశం కలిగే నిమిత్తం రాష్ట్ర నాలుగవ ప్రణాళిక ముసాయిదాను ఇటీవల శాసనసభలో చర్చించడం జరిగింది. వర్కింగ్ గ్రూపుల సిఫార్సుల ననుసరించి చతుర్థ ప్రణాళిక వ్యయం మొత్తం రూ. 824.55 కోట్లు. అందు బాటులో వున్న ఆర్థిక వనరుల దృష్ట్యా రాష్ట్ర పభుత్వం ఈ సిఫార్సులను జాగ్రత్తగా పరిశీలించిన మీదట, వివిధ అభివృద్ధి రంగాల మధ్య రూ. 700 కోట్లను పంపిణీచేయడానికి తాత్కాలికంగా నిశ్చయించింది. మన రాష్ట్రం అనేక రంగాలలో వెనుకబడివున్న పరిస్థితిని పురస్కరించుకొని ప్రణాళికా సంఘంవారు ఈ కేటా యింపును అంగీకరించగలరని ఆశిస్తున్నాము. అభివృద్ధిజెందిన ఇతర రాష్ట్రాల కంటే మనం చాలా వెనుకబడిపోకుండా వుండ డానికి. చతుర్థ ప్రణాళికాంతం నాటికైనా కేంద్రరంగం ప్రాజెక్టులను మన రాష్ట్రంలో ఇతోధికంగా నెలకొల్పవలసిన ఆవశ్యకతను గురించి ఈ సందర్భంలో నొక్కి చెబుతున్నాను. ఆంధ్రప్రదేశ్‌లో తమ ధనాన్ని పెట్టుబడిపెట్టి ఈ రాష్ట్రంలో సత్వర పారిశ్రామికీ కరణకు తోడ్పడవలసిందిగా చిన్న, పెద్ద పారిశ్రామికవేత్త లందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.

గతంలో మనం ఎన్నో కఠిన పరీక్షలను అధిగమించాం. పొరపాట్లనుంచి గుణపాఠాలు నేర్చుకుంటూ, అనుభవంతో వికాసం జెందుతూ భవిష్యత్తులోకి సాగిపోవాలి.

''ఆంధ్రప్రదేశ్'' పత్రిక యొక్క అసంఖ్యాకులైన పాఠకులకు ఈ నూతన సంవత్సరారంభం సందర్భంగా నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

జై హింద్

మ॥ పితృయానమ్ముఁ బోయి యెంత కిటురా
వే, శింశుమారప్రజా
పతియున్ కొంకరవోవు నీ చలికి, త
త్ప్రాంశూత్థపుచ్ఛాగ్రసం
స్థితబాలధ్రువు డంగముల్ ముడుగ నా
ర్తిన్ తత్తరించున్, దయా
మతి నా యేడుగుఱ్ఱాలతేరు మరలిం
పన్ రాదొ, ప్రద్యోతనా!

మ॥ చురకత్తుల్ దిగనాటు శీతకఁపు క
చ్చుల్ రెచ్చి వీతెంచు ను
త్తరవాతోపహతమ్ము విష్ణుపదమం
తా మంచుమాగాణమై,
పరమబ్రహ్మవిదుల్ మహామహులు స
త్వస్సైర్యలీలాగతుల్
చరియింపన్ వసమేది చిక్కువడి రీ
జాగేల, భాస్వత్కరా!

మ॥ అమలోదాత్తజలమ్ము విష్ణుపదజ
మ్మాకాశగంగాప్రవా
హము నీహారశిలాతికర్కశదశా
ప్రారబ్ధమై, మూడు లో
కములున్ డిల్లపడున్ మహాదురితపఙ్క
కఱాళనల్లేమి, న
న్విమలాత్మన్ కరగింప నుష్ణకిరణా
న్వితుండవై రాగదే!

తే॥ నిన్ను నటు బంపి పాలమున్నీటిసెజ్జ
బవ్వళించిన బ్రహ్మాండభాండభరిత
కుక్షి యుత్థానుడై చలికుట్లుకుడుచు
రెన్నెలలనుండియు పురాణవృద్ధమూర్తి.

మ॥ సుత మోహమ్మది నైజమేరికిని త
త్సూనుండు కాలుండ యేన్,
పితృయానమ్మను పేర సంయమనిలో
పీఠమ్ము పెట్టన్ తలం
చితివో లోకముకెల్ల వ్యాకులత వ
చ్చెన్, లోకబంధూ! శ్రియః
పతియాజ్ఞన్ తలమోచి వేమరులు దే
వా! దేవయానుండవై.

మ॥ అసమానత్వరితుండవై వసునగా
గ్రాధిష్ఠితమ్మైన బ్ర
హ్మసభన్నిత్యము చుట్టిపోవు నయన
వ్యాపార సర్వజ్ఞ! య
క్కసుమాలమ్ముల నిమ్నవృత్తిపయి నీ
కై పింక చాలించి, యి
వ్విసుమానమ్ముల యుచ్ఛవృత్తికయి రా
వే సూర్యనారాయణా!

సీ॥ తిరిగి రావే సర్వదేవాత్మకా! రశ్మిభా
వనా! పితృయానపథము వీడి
మా మనః ప్రాణసంపద లూర్జితములుగా
దేవయానమ్ము గైకోవె కరుణ
ఋగ్యజుస్సామపారీణ! త్రిమూర్త్యాత్మ
కా! విశ్వలోచనా! కదలిరావె
మరలిరావే హిమహరణ జ్యోతిర్గణా
భరణ! తమోభి సంహరణ కిరణ!
వేయిపాదముల్ మకరప్రవిష్టములుగ
తడబడుటలేక చక్కగా నడువుమయ్య
అవ్యయమ్మైన యుత్తరాయణము వెలయ
నవ్యమార్తాండ కేళీసనాథ మగుచు.

## సూచన

"ఆంధ్రప్రదేశ్" పత్రికలో గ్రంథ సమీక్షలు, అనువాద రచనలు ప్రకటించుట నిలిపివేయబడినది. కనుక గ్రంథకర్తలు ప్రచురణకర్తలు తమ పుస్తకాలను సమీక్షార్థమూ, రచయితలు తమ అనువాదాలను ప్రచురణార్థమూ మాకు పంపవలదని మనవి. సంపాదకుడు.

# దేశ విదేశ వార్తలు

## భారత్‌కు ప్రశంస

బొంబాయిలో జరిగిన క్రైస్తవ మహా సభలో పాల్గొని రోమ్ నగరానికి తిరిగి వెళ్లే ముందు పోప్ పాల్ VI భారతదేశాన్ని ప్రశంసిస్తూ "ప్రాచ్య, పాశ్చాత్య ప్రాంతాల ప్రజలతో, విజ్ఞాన ఖనులకు, శాంత స్వభావులకు ఆలవాలమై విరాజిల్లుచూ, ప్రాచీన నాగరికతాదీధితులను వెదజల్లుచూ, ప్రాచీన నాగరికతా దీధితులను వెదజల్లుతూ, ప్రగతి పథంపైపు, క్రమబద్ధమైన సాంఘిక వ్యవస్థ వైపు ప్రయాణిస్తున్న దేశం" అన్నారు. అంతేకాదు, ఇంకా వారిలా చెప్పారు: "బొంబాయిలో వున్న యీ కొద్ది రోజుల్లో జరిపిన సమావేశాల్లో వివిధ రాష్ట్రాల అసంఖ్యాక ప్రజలు, ముఖ్యంగా కేథలిక్ మతావలంబులను కలవడం వల్ల మేము యీ దేశాన్ని అతి సన్నిహితంగా తెలుసుకోవడానికి, యీ దేశపు కళావైదగ్ధ్యాన్ని, సాంస్కృతిక సంపదను, గాఢ మత విశ్వాసాలను, స్వరూప స్వభావాలను, నిక్షిప్తమైయున్న అపార జ్ఞాన సంపదను, ఘనతను, నైతిక విలువల్ని బాగా అర్థం చేసుకోవడానికి అవకాశం ఏర్పడింది."

భారతదేశపు అలీన విధానానికి అగ్రరాజ్యాలను యీ విధానికి కట్టుబడేటట్టు చేయడానికై కొనసాగిస్తున్న కృషికి బ్రిటిష్ ప్రధాని హెరాల్డ్ విల్సన్ భారతదేశాన్ని అభినందించారు. భారత ప్రధాని గౌరవార్థం ఏర్పాటు చేసిన విందులో బ్రిటిష్ ప్రధాని మాట్లాడుతూ అలీన విధానానికి నాయకమణిగా నిలుస్తున్నందుకు భారతదేశాన్నీ, నెహ్రూను అనేక దేశాలు విమర్శించాయనీ, యీనాడు ప్రపంచ పరిస్థితులను చక్కబరచడానికి అలీన విధానమే ఒక చక్కటి ఉపకరణమని అందరూ గుర్తించారనీ అన్నారు.

## 11 అంశాల సోవియట్ మెమొరాండం

ప్రపంచంలో నేడు నెలకొన్న ప్రతిష్ఠంభనను తొలగించడానికి, అణ్వస్త్ర నిరోధాన్ని శీఘ్రతరం చేయడానికి రష్యా విదేశాంగ మంత్రి ఐక్యరాజ్య సమితి సాధారణ సభకు 11 అంశాల మెమొరాండంను సమర్పించారు.

* మిలటరీ బడ్జెటును తగ్గించడం.
* ఇతర దేశాల సరిహద్దుల్లోని విదేశీయ సైన్యాన్ని తొలగించడం లేదా తగ్గించడం.
* ఇటుపై అణ్వాయుధాల తయారీ వ్యాప్తిని అరికట్టడం.
* ఇతర దేశాలలో విదేశ మిలటరీ బలాన్ని తొలగించడం.
* అణ్వాయుధాల వినియోగాన్ని నిషేధించడం.
* అణ్వస్త్ర రహిత మండలాలను ఏర్పాటు చేయడం.
* బాంబర్ ఎయిర్‌క్రాఫ్ట్‌నుతొలగించడం.
* భూగర్భంలో అణ్వస్త్ర పరీక్షలను నిషేధించడం.
* నాటో, వార్సా సంధి రాజ్యాల మధ్య శాంతి సంధి ఒడంబడికకు రావడం.
* ఆకస్మిక యుద్ధాన్ని నివారించడం.
* మొత్తం ట్రూపుల సంఖ్యను తగ్గించడం.

## ప్రపంచ జనాభా

అమెరికన్ బ్యూరో ఆఫ్ పాపులేషన్ స్టడీస్ ప్రచురించిన వార్షిక నివేదిక ప్రకారం ప్రస్తుతం 33,000 లక్షలుగావున్న ప్రపంచ జనాభా 1980 నాటికి 10,000 లక్షలకు మించి పోతుందని అంచనా. ఏటా 650 లక్షలచొప్పున ప్రపంచ జనాభా పెరిగిపోతున్నదనీ, అంటే యీ పెరిగే సంఖ్య ఇంగ్లండు జనాభాను మించి వుంటుందనీ, ప్రస్తుతం 7,000 లక్షలు గల చైనా జనాభా 1980 నాటికి అధనంగా మరో 1,500 లక్షలకు పెరుగుతుందనీ యీ నివేదిక వెల్లడించింది.

చైనా తరువాత అధిక జనసంఖ్య గల దేశాలు: భారతదేశం 4,700 లక్షలు (ఏడాదికి 100 లక్షల చొప్పున పెరుగుతున్నది); రష్యా 2300 లక్ష-; అమెరికా 1,930 లక్షలు, ఇండోనేసియా 1,020 లక్షలు; పాకిస్తాను 1,010 లక్షలు; జపాను 970 లక్షలు, బ్రెజిల్: 800 లక్షలు.

ప్రపంచ జనాభాలో సగానికి పైగా (56 శాతం) ప్రజలు ఆసియాలో నివసిస్తున్నారు అయితే అటు చైనాలోగాని, యిటు భారతదేశంలోగాని జననాల రేటు ఎక్కువగా లేదు. లాటిన్ అమెరికాలో జననాల రేటు ఎక్కువ. ఉదాహరణకు బ్రెజిలులో ప్రతి 23 సంవత్సరాలకు దాని జనాభా రెట్టింపవుతూ వుంటుంది. సెంట్రల్ అమెరికా రాష్ట్రాలన్నిటిలో ఏటా మూడుశాతం చొప్పున జనాభా పెరుగుతూ వుంటుంది.

## భారతదేశంలో అధిక జనసంఖ్య గల పట్టణం

ఐక్యరాజ్యసమితి డిమొగ్రాఫిక్ యియర్ బుక్ ప్రకారం ఈనాడు భారతదేశంలో అధిక జనసంఖ్యగల పట్టణం బొంబాయి. ఆతరువాత చెప్పదగ్గది కలకత్తా.

ప్రపంచంలో అధిక జన సమ్మర్దమైన పట్టణం టోక్యో. దాని జనసంఖ్య 86.13

లక్షలు. ఐక్యరాజ్య సమితి ప్రచురించిన పుస్తకం ప్రకారం ప్రపంచ జనసంఖ్య 325 కోట్లు కాగా దానిలో అయిదో వంతుకు పైగా-అంటే 70 కోట్లు-చైనాలో వున్నారు.

### భారతీయ డాక్యుమెంటరీలకు బహుమతులు :

1964 కాలంలో విదేశాలలో జరిగిన అంతర్జాతీయ ఫిలిం ఉత్సవాల్లో మూడు భారతీయ డాక్యుమెంటరీ ఫిల్ములకు ప్రధమ బహుమతులు వచ్చాయి.

ఫిల్ము డివిజన్ వారు తయారుచేసిన 'నర్తన పాదములు'కు జానపద నృత్యాలకు సంబంధించిన ఉత్తమ చలన చిత్రంగా జూలై నెలలో గెనో(ఇటలీ)నగర కప్పు లభించింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమంపై ఫిల్ము్స డివిజన్ వారు తీసిన 'ప్రధాన సమస్య' అనే డాక్యుమెంటరీ 1964 సం.పు ఉత్తమ కామన్వెల్తు ఫిల్ము అవార్డును గెలుచుకున్నది. నవంబరులో శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో మన ఫిల్ము యినిస్టిట్యూట్ వారు రూపొందించిన 'ఒక రోజు' అనేదానికి గోల్డన్ గేట్ బహుమతి లభించింది.

### చలన చిత్రాల బహుమతులకు నియమాలు :

ప్రభుత్వం సవరించిన నియమాలను బట్టి ప్రభుత్వ బహుమతులకు అర్హమైన ప్రాంతీయ భాషా చిత్రాలు ఒక్కొక్క భాషలో మూడు కన్న ఎక్కువ ఎంట్రీలు వున్నట్టయితే భాషాకమిటీ లేదా, ప్రాథమికకమిటీ అనే కమిటీ ఒకటి యిటుపై పరిశీలిస్తుంది.

ప్రభుత్వం బొంబాయి, కలకత్తా, మద్రాసులలో ఏర్పాటు చేసిన ప్రాంతీయ సంఘాలు పై కమిటీ సిఫారసులను పరిశీలిస్తాయి. ఎంట్రీలు మూడుకన్న తక్కువ వున్నట్టయితే ప్రాంతీయ సంఘాలే నేరుగా వాటిని పరిశీలిస్తాయి.

1964 కాలంలో నిర్మించబడిన చిత్రాలకు యీ కొత్త నిబంధనలు వర్తిస్తాయి.

ప్రాంతీయ సంఘాలలో ఒక అధ్యక్షుడు; కళా, సాహిత్య రంగాలలో నిష్ణాతులైన ఆరుగురు సభ్యులు; సినిమా పరిశ్రమలో నుండి ముగ్గురు ప్రతినిధులు వుంటారు.

బొంబాయిలోని ప్రాంతీయ సంఘం హిందీ, మరాఠీ, పంజాబీ, గుజరాతీ, సింధీ, ఇంగ్లీషు భాషా చిత్రాలను పరిశీలిస్తుంది.

కలకత్తాలోని ప్రాంతీయ సంఘం బెంగాలీ, అస్సామీ, ఒరియా భాషా చిత్రాలను; మద్రాసులోని ప్రాంతీయ సంఘం అరవం, తెలుగు, కన్నడం, మళయాళ చిత్రాలను పరిశీలిస్తాయి.

### నెహ్రూ కృషిపై పరిశోధన:

ప్రపంచశాంతికి స్వర్గీయ నెహ్రూ చేసిన కృషి మీదా, ఆయన జీవితం మీదా పరిశోధన కొనసాగించ డానికి అఖిల భారత యువజన కాంగ్రెసు ఢిల్లీలో జవహర్లాలు నెహ్రూ పేరిట అంతర్జాతీయ యువజన కేంద్రాన్ని ఒకదానిని ఏర్పాటు చేసింది. ప్రారంభంలో దీనికి రూ 20 లక్షలు ఖర్చవుతుంది. పరిశోధన పనులకు విదేశ యువజన సంస్థలు తమ ప్రతినిధులను యిక్కడకు పంపవచ్చు.

### పొడుగుజుత్తుపై నిషేధం :

పొడుగుజుత్తును పాఠశాల అధికార్లు నిషేధించిన కారణంగా పశ్చిమ జపానులోని ఒసాకా ఉన్నత బాలుర పాఠశాలలో సుమారు 1,500 మంది విద్యార్థులు తరగతులకు హాజరు కాకుండా ఊరేగింపు జరిపారు.

పెద్దలకు నియోగించిన బార్లకు, యితర రిజర్వు చేయబడిన స్థలములకు వెళ్ళకుండా వుండడానికి గాను చూసిన వెంటనే విద్యార్థులు బాలురుగా గుర్తింప బడడానికిగాను, పాఠశాల అధికార్లు విద్యార్థులకు తమ జుత్తును క్రాపు చేయించుకోవా లని ఉత్తర్వు చేశారు. పశ్చిమ ఒసాకాకిబిలోని ఉన్నత పాఠశాలలో కూడా యీలాటి సంఘటనే ఒకటి జరిగింది.

### జలుబుకు కొత్తమందు :

న్యూ ఆర్లియన్స్‌లోని తులని విశ్వవిద్యాలయంలో జలుబు, ఫ్లూను నివారించే విరెక్టిన్ అనే కొత్తమందు నొకదానిని అమెరిక దేశపు వైద్య పరిశోధకులు కనిపెట్టారు. బ్రిటన్స్ కామన్‌కోల్డు పరిశోధన కేంద్రంలోని శాస్త్రజ్ఞులు యీ మందును పరిశీలిస్తున్నారు.

### ఎయిర్ కుషన్ విమానం :

తనంత తానుగా గాలిబుడగలను సృష్టించి నీటిపై గాని, భూమిమీదగానీ, బురదనేలలో గాని ప్రయాణం చేయగల 15 మందిప్రయాణీకులు పట్టేశకటం ఒకటివాషింగ్‌టన్‌లోని పొటొమక్ నదిలో ప్రదర్శించ బడింది.

ఇంగ్లండులో నిర్మింపబడిన యీ వెస్ట్ లేండ్ ఎస్. ఆర్. ఎన్ 5 - ఎయిర్ కుషన్ విమానాన్ని రిటైర్డ్ నేవీ ఏవియేటర్ డేనియల్ హెల్మ్స్ నడిపారు.

ఈ ఎస్. ఆర్. ఎన్ - 5 లో 900 ఆశ్విక శక్తి గల టర్బైన్ ఇంజను వుంటుంది. ఇదే ఏ డడుగుల ఎత్తుకు ఎగిరేట్టు చేసే పంకాను, ముందుకు వెళ్ళడానికి రివర్స్ పిచ్ ప్రొఫెల్లరును పనిచేయిస్తుంది.

### వరంగల్లు కళాశాలకు అమెరికా సహాయం :

వరంగల్లు ప్రాంతీయ ఇంజనీరింగు కళాశాలలో పరికరాలను సమకూర్చుకోవడానికి, నిపుణులను ఏర్పాటు చేసుకోవడానికి, ఫెలోషిప్పులను మంజూరు చేయడానికి గాను 1.74 మిలియను డాలర్లను అమెరికా ప్రత్యేక నిధి మంజూరు చేసింది. అయిదేళ్ళకు కేంద్ర ప్రభుత్వం యీ కళాశాలకు యిచ్చే సహాయం 8.5 మిలియను డాలర్లు వుంటుంది. ఈ కళాశాలను పోస్టు గ్రాడ్యుయేటు, రిసర్చి పనులకు వీలుగా స్థాయిని పెంచేందుకై యీసహాయం వుపయోగించబడుతుంది. మంగళూరు, నాగపూరు, భోపాల్, జమ్‌షెడ్‌పూర్, అలహాబాద్, దుర్గాపూర్ ఇంజనీరింగ్ కళాశాలలకు అవసరమయ్యే ఉపాధ్యాయులను యీ కళాశాల తయారు చేస్తుంది. అమెరికా సహకారంతో అభివృద్ధి చెందుతున్న భారతదేశంలోని యీ తరహా కళాశాలల్లో ఇది మొట్టమొదటిది. ★

# హైదరాబాదు వార్తావాహిని

బి. నాగేశ్వరరావు

ఈ నెలలో (డిశంబరు) జరిగిన సంఘటనల్లో ప్రత్యేకించి చెప్పదగినది రాష్ట్ర శాసనసభ శీతాకాల సమావేశంలో జరిగిన చర్చలు.

సెప్టెంబరు నెలలో రాష్ట్రంలో వరదల వల్లా, భారీ వర్షాలవల్లా సంభవించిన అపార నష్టాన్నిగురించీ, ప్రభుత్వం తీసుకున్న వరదనిరోధక, సహాయక కార్యకలాపాల గురించీ విధానసభ చర్చించింది. పబ్లిక్ రంగంక్రింద నెలకొల్పదలచిన అయిదవ ఉక్కు కర్మాగారాన్ని గురించి కూడా చర్చించింది. రాష్ట్రంలో చతుర్థ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాప్రతిపై నాలుగు రోజులపాటు చర్చ కొనసాగించింది.

ఈ చర్చ లన్నిటిలోనూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆహారసమస్య తలఎత్తిందనే చెప్పవచ్చు. రాష్ట్రంలో ఆహారపంపిణీ ఏర్పాట్లకు సంబంధించిన విధానాన్ని ముఖ్యమంత్రి ప్రకటించారు. బియ్యాన్ని ఒకచోటినుండి మరోచోటికి కదలించడానికి గాను రాష్ట్రం మూడు మండలాలుగా విభజింపబడుతుం దన్నారు. మొదటి మండలంలో కృష్ణ, తూర్పు గోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలు వుంటాయని; రెండవ మండలంలో నెల్లూరు, గుంటూరు వుంటాయని; రాష్ట్రంలోని మిగిలిన జిల్లాలన్నీ మూడవ మండలంగా వస్తాయని చెప్పారు. ప్రతి మండలంలోనూ బియ్యాన్ని ఎట్టి అడ్డంకులూ లేకుండా కదలించవచ్చు.

ప్రస్తుతానికి రాష్ట్ర రాజధానిలో చట్టబద్ధమైన రేషనింగు వుండదనీ, యిప్పుడువున్న చట్టబద్ధంకాని రేషనింగే కొనసాగుతుందని ముఖ్యమంత్రి వ్యక్తం చేశారు. రాష్ట్రంనుండి దొంగతనంగా బియ్యంరవాణాను అరికట్టేందుకు రాష్ట్రసరిహద్దులలో గట్టి చర్యలే తీసుకోబడతాయని, అందుకుగాను 25 చెక్ పోస్టులు నెలకొల్పబడ్డాయని, దానికితోడు ఒక్కొకగజెటెడ్ అధికారి ఆధిపత్యం క్రింద ఎనిమిది ఫ్లయింగ్ స్క్వాడ్ లు ఏర్పాటు చేయబడ్డాయని తెలియజేశారు.

వినియోగదారులకు ఉత్పత్తిదారులకు స్థిరీకరించిన టోకు, చిల్లరధరలు అందరికీ సంతృప్తిని కలిగించాయని, యీ ధరలవిధానాన్ని విధిగా అమలుపరచడానికి ప్రభుత్వం నిశ్చయించిందనిముఖ్యమంత్రిఅన్నారు. ధరల విధానాన్ని ఆచరణలో ప్రతిభావంతంగా పెట్టడానికిగాను సమితిస్థాయిల్లోను, జిల్లాస్థాయిల్లోనుఅప్రమత్తతాసంఘాలు ఏర్పాటు చేయబడతాయని కూడా వ్యక్తపరిచారు.

ఇతర రాష్ట్రాలకు సరఫరా చేయడానికీ, రాష్ట్రంలో వినియోగించే నిమిత్తం నిలువలనుఏర్పాటుచేయడానికీరైతులనుండిబియ్యం నిలువలను సేకరించేందుకై సహకార మార్కెటింగ్ సంఘాలవద్ద రూ. 2 కోట్లను ఉంచుతూన్నట్టు ప్రభుత్వం ప్రకటించింది.

**వరద దెబ్బతిన్న చెఱువుల మరమ్మత్తు**

వరద దెబ్బతిన్న ప్రాంతాలలోని చెఱువుల మరమ్మత్తు నిమిత్తం కేంద్ర ప్రభుత్వం, ఆంధ్ర ప్రదేశ్ కు 1.5 కోట్ల రూపాయలను యివ్వడానికి అంగీకరించిందని వరద పరిస్థితిపై జరిగే చర్చకు సమాధాన మిస్తూ రెవెన్యూమంత్రి తెలియజేశారు. వచ్చే ఏడాది కూడా యీ మాదిరి సహాయమే రావచ్చునని మంత్రిగారు ప్రకటించారు. నిజానికి, దెబ్బతిన్న నీటి పారుదల సౌకర్యం కలిగించే వాటన్నిటినీ బాగు చేసేందుకై మొత్తం రూ 5 కోట్ల మేరకు సహాయపడవలసిందిగా రాష్ట్రప్రభుత్వం కోరివున్నది.

రాష్ట్రంలోని వరద నిరోధానికి తీసుకోవలసిన శాశ్వత చర్యలను సిఫారసు చేసే నిమిత్తం భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన మిత్రా కమిటీ తమ సిఫారసులను అందజేసిన అనంతరం ఉప్పుటేరుకు, ఇతర వరద నిరోధక చర్యలకు సంబంధించిన పథకాన్ని చేపట్టడం జరుగుతుందని మంత్రి శెల విచ్చారు. పబ్లిక్ రంగంక్రింద నెలకొల్పదలచిన అయిదవ ఉక్కు కర్మాగారాన్ని విశాఖపట్టణంలో స్థాపించాలన్న ఆంధ్ర ప్రదేశ్ వాదనను బలపరచే సమాచారాన్నంతా సేకరించే నిమిత్తం ఒకప్రత్యేక అధికారి నియమింపబడినట్టు ముఖ్యమంత్రి విధానసభలో తెలియపరచారు. యీ ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పడంలో దేశంలో ఉద్దేశింపబడిన యితర స్థలాలతో బాటు విశాఖపట్టణంలోగల సౌకర్యాలను, అవకాశాలను కూడా పరిశీలించే నిమిత్తం ఆంగ్లో-అమెరికన్ సాంకేతిక బృందంవారు బహుశా యీ రాష్ట్రానికి డిశంబరులో రావచ్చు. ఈ బృందం వారు తమ నివేదికను సమర్పించిన అనంతరం ఉక్కు కర్మా

గారానికి సంబంధించిన అంతిమ నిర్ణయం జరుగుతుంది. విశాఖపట్టణంలో యీ కర్మాగారాన్ని ఏర్పాటు చేసే విషయమై కేంద్రాన్ని సాధ్యమైనంతవరకు వత్తిడిచేయడానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రయత్నిస్తుందని ముఖ్యమంత్రి అన్నారు. చర్చా సమయంలో సభలోని అన్ని వర్గాలవారూ విశాఖపట్టణంలో యీ కర్మాగారాన్ని స్థాపించాలన్న అభిప్రాయాన్నే బలపరిచారు.

పబ్లిక్ రంగంక్రింద స్థాపించే పరిశ్రమల విషయంలో ఆంధ్ర ప్రదేశ్ నిర్లక్ష్యం చేయబడిందన్న భావాన్ని ముఖ్యమంత్రి వ్యక్తం చేశారు. కేంద్రం చేపట్టే పరిశ్రమల నిమిత్తంతృతీయప్రణాళికలో ఆంధ్రప్రదేశ్‌కు యిచ్చిన కేటాయింపు మొత్తం కేటాయింపులో పదోవంతు కూడాలేదు. ఇటీవలి జాతీయ అభివృద్ధి మండలి సమావేశంలో యీ విషయాన్నే వీరు ప్రస్తావించి, పారిశ్రామికీకరణ విషయంలో ప్రాంతీయ అసమానతను తొలగించాలని చెప్పి ఒక చక్కటి పారిశ్రామిక కార్యక్రమాన్ని రూపొందించుకోవల్సిన అవసరాన్ని నొక్కివక్కాణించారు.

### ఉక్కు కర్మాగారం

పబ్లిక్ రంగం క్రింద నెలకొల్పదలచిన అయిదవ ఉక్కు కర్మాగారాన్ని విశాఖపట్టణంలో ఏర్పాటు చేయాలన్న ఆంధ్రప్రదేశ్ అభ్యర్థనలో అసమంజస మేమీలేదు. విశాఖపట్టణంలో లభించే ముడిసరుకు మాట అటుంచి, ప్రధానంగా వ్యవసాయ రాబడిమీదనే ఆధారపడి, తలసరి పెట్టుబడి మరీ తక్కువగా వున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పారిశ్రామిక విషయకంగా అభివృద్ధి చెందాలని కోరడం న్యాయసమ్మతమని ముఖ్యమంత్రి అన్నారు.

విశాఖ పట్టణంలో నెలకొల్పడంలో గల అవకాశాలను, లాభాలను గురించి సాంకేతిక నిపుణులు రూపొందించిన నివేదికలను చదువుతూ ముఖ్యమంత్రి, ఉన్నత ప్రమాణాలకు చెందిన ఇనుపఖనిజం నిధులు రాష్ట్రంలో పున్నాయన్నారు. దీనికి అవసరమైన నీరు, విద్యుచ్ఛక్తిని సరఫరా చేసేందుకు తగిన ఏర్పాట్లు వున్నాయి.

భారీ ఉక్కు కర్మాగారం అవసరాలకు సరిపడగల సున్నపురాయి, బొగ్గు నిక్షేపాలు రాష్ట్రంలో వున్నాయి. విశాఖపట్టణం వద్ద ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పడం వల్ల ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేకూరుతుంది. ఇంతే గాక దండకారణ్య ప్రాంతం అభివృద్ధికి కూడా ఇది దోహదకారి అవుతుంది.

రాష్ట్ర నాలుగవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాపై ఉభయ సభలలో జరిగిన చర్చలను ముగింపజేస్తూ రాష్ట్ర ఆర్థికమంత్రి, తృతీయ ప్రణాళికలో పెట్టుకున్న 90 లక్షల టన్నుల ఆహారోత్పత్తి లక్ష్యం సాధించబడగలదని స్పష్టం చేశారు. వర్తమాన సంవత్సరంలోనే ఉత్పత్తి ప్రమాణం 81 లక్షల టన్నులకు చేరుకుంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయాన్ని పరిశ్రమవలె అభివృద్ధి పరచాలని కూడా ఆయన ఉద్ఘాటించారు. వ్యవసాయ రంగం యాంత్రీకీకరణను ఆయన సమర్థించారు. వ్యవసాయ–పారిశ్రామికరంగాల సమిష్టి అభివృద్ధికిగాను భారత ప్రభుత్వం ఎన్నిక చేసిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటని ఆయన తెలియజేశారు. చతుర్థప్రణాళికాకాలంలో వ్యవసాయ పరపతినిమిత్తం రూ. 60కోట్లు కేటాయించారు. తృతీయ ప్రణాళికలో ఇందుకు రూ. 28 కోట్లు కేటాయించడం జరిగింది. అయితే రాష్ట్రంలోని వ్యవసాయ పరపతి అవసరాలను పూర్తిగా ఆదుకోవాలంటే కనీసం రూ. 200 కోట్లు అవసరమవుతాయని ఆయన తెలిపారు. రాష్ట్ర వ్యవసాయ రంగంలో అభివృద్ధి సాధించబడినదనీ, పారిశ్రామిక రంగంలో కూడా పురోగతి తీవ్రతరం కావడం తథ్యమనీ ఆయన అన్నారు.

నాలుగవ ప్రణాళికా కాలంలో, ఒక్కొక్కటి 1,000 మె. వా. ల శక్తిగల రెండు భారీ థర్మల్ విద్యుత్కేంద్రాలను రాష్ట్రంలో స్థాపించడానికై కేంద్రాన్ని రాష్ట్ర ప్రభుత్వం అభ్యర్థించిందని కూడా ఆర్థిక మంత్రి వెల్లడించారు. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకు ఇవి – ఐదవ ఉక్కుకర్మాగారం మినహా – కేంద్ర విద్యుచ్ఛక్తి పథకాలలో భాగంగా వుండాలి. ఆంధ్రప్రదేశ్‌లో బొగ్గు విస్తారంగా లభిస్తుంది కాబట్టి ఇటువంటి భారీ విద్యుచ్ఛక్తి కేంద్రాలను నెలకొల్పడానికి ఈ రాష్ట్రం అనువైనది – విద్యుత్కేంద్రాలలో ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తిని ప్రతిపాదితదక్షిణ లేదా జాతీయవిద్యుత్ గ్రిడ్‌తో చేర్చి తద్వారా దేశంలో అవసరమైన ప్రదేశాలలో విద్యుత్ సరఫరాకు తోడ్పడవచ్చు.

### విద్యుచ్ఛక్తి పథకాలకు ఇతోధిక కేటాయింపులు

విద్యుచ్ఛక్తి అభివృద్ధికి సంబంధించిన ప్రణాళికా కేటాయింపులను ప్రభుత్వం క్రమేపీ హెచ్చిస్తున్నదని మంత్రి తెలియజేశారు. మొదటి ప్రణాళికలో పూర్తి ప్రణాళిక కేటాయింపులో 20.4 శాతం మొత్తాన్ని విద్యుచ్ఛక్తి అభివృద్ధి పథకాలకు ప్రత్యేకించగా ఈ కేటాయింపు రెండవ ప్రణాళికలో 25.2 శాతానికి, మూడవ ప్రణాళికలో 28.5 శాతానికి హెచ్చించారు. నాలుగవ ప్రణాళికలో 34.5 శాతం మొత్తం లభింపజేయడానికి ప్రతిపాదించారు. శ్రీశైలం,

(మిగతా 73 వ పేజీలో)

సీరియల్ నవల

## (మూడవ అధ్యాయం)

వసుకులుఁడు చనిపోయెను. పది దినములు నిరాహారదీక్ష నవలంబించెను. రాణులు, మంత్రులు, పురోహితులు, హితులు, సామంతులు వారించుటకు వెళ్ళిరి. వెళ్ళినవారే కాని చెప్పుటకు వీలుకలిగినవారు లేరు. పది దినము లన్నము లేనిచో మరణింతురా? జలముకూడఁ ద్రావనిచో మరణింతురు. నాల్గు దినములు కడచినతరువాత రాజునకు స్మృతి పోవుచుండెను. దప్పిక యగుచుండెను. ఒకసారి స్మృతి వచ్చినతరువాత రాజు లేచి చూచెను. తన గదినిండ వైద్యు లున్నారు. అందఱను బంపించెను. నిష్కంటకుఁ డను నొకభటుఁడు కలఁడు. రాజు వానిని బిలిపించెను. వానిని ద్వారమునందు నిలుచుండఁ బెట్టెను. అదిమొద లెవ్వరును లోనికిరాలేదు. ఆ నిష్కంటకుడు ఖడ్గపాణియై ద్వారమునందు నిలుచుండెను. వాఁడు పదిఏన్గుల బలము కలవాఁడు. కత్తిదూసి వానియెదుట నిలిచెడివాఁడుండఁడు. అయిదవనాటి రాత్రి మిహిరకులుడు వచ్చెను. వాఁడు లోనికిఁ బోనియ్యలేదు. మిహిరకులుఁడు వానివంకఁ దీక్ష్ణముగాఁ జూచెను. నిష్కంటకుని నేత్రములలోఁ దీక్ష్ణతలేదు. రాజాజ్ఞా పరిపాలనగుణమును కరగించిపోసిన యొక శిలావిగ్రహమువలె నిలుచుండెను. ఈ విగ్రహము సజీవము. ఆ విగ్రహమును పడద్రోసి రాతిని ముక్కలు ముక్కలుగాఁ గొట్టవలయును గాని యామూర్తిలో నున్న రాజాజ్ఞా పరిపాలనా లక్షణములను జెఱచుటకు వీలులేదు. తత్పూర్వము మిహిరకులుఁడు నిష్కంటకు నెఱుఁగును. వాఁడొక సేవకుఁడుగా నెఱుఁగును. వాని బలము నెఱుఁగఁడు. కాని యీ తీవ్రత్వము నెఱుఁగడు. ఒక్కొక్క రాజున కొకొక్క రహస్య సేవకుఁ డుండును. రాజు తన స్వరక్ష వానిచేతఁ జేయించుకొనుచుండును. వసుకులునకు వీఁడు వాడు. మిహిరకులుఁడు వానిని బెదరించెను. కత్తి దూసెను. వాఁడు కదలలేదు. వానిని దన కత్తితో నఱకుటకుఁ బది ప్రయత్నములు చేసెను. పదియును విఫలము లయ్యెను. మిహిరకులుని కత్తి చివరకుఁ బదిముక్కలయ్యెను. మిహిరకులుఁడు మండిపోవుచుండెను. రాజుయొక్క శయనాగారము ముందు నిది జరుగరాని వ్యతిక్రమము. రాత్రి రెండుజాములవేళఁ బలుమంది సేవకులు వచ్చిరి. ఎవరికిని బ్రాణములలోఁ బ్రాణములు లేవు. పోయి మంత్రి, పురోహితులను బిలుచుకొనివచ్చిరి. వారు యువరాజుతో నిట్లనిరి. 'యువరాజా! వాఁడు సేవకుఁడు, నీ తండ్రికి నమ్మినబంటు. వాఁడు మహాగజబలుఁడు. వాఁడు నీతండ్రి నిప్పుడెట్లు సేవించుచున్నాడో రేపు నిన్నట్లు సేవించును. ఇది మహారాజుగారి యాజ్ఞ. వారి యాజ్ఞను మేము పాలించుచున్నాము; నీవును బాలింపవలయును."

**విశ్వనాథ సత్యనారాయణ**

మిహిరకులునకు నింతకంటె నెక్కువకోపము వచ్చుటకు వీలులే దన్నంతకోపము వచ్చెను. అతఁడు తిరిగిపోయెను. అతఁ డిట్లనుకొనుచుండెను: 'నా చేతిలోనిది ఖడ్గమయ్యెను. విల్లయినచో నెంత బాగుగా నుండును. ఖడ్గము విఱిగిపోవును. దానిని సమీపమునం దుండిగాని ప్రయోగింపరాదు. వీఁడు సేవకుఁడు, న న్నెదిరించునా? నా తండ్రి యొద్దకు నేను పోవుటకు వీలులేదా? "అనుకొనుచు నింటికిఁ బోయెను. యువరాజువెంటఁ బదిమంది వెళ్ళిరి. ఆయనతోఁ బదిమందియుఁ బదివిధములఁ జెప్పిరి. వాని తాత్పర్యము రాజుయొక్క ప్రాయోపవేశమునకు యువరాజే కారణమని. పూర్వము యువరాజు చేసిన కొన్నిపనులు, రాజుతో వారును వీరును జెప్పిరని. ప్రధానముగాఁ జెప్పినవాడు పురోహితుఁడని- వీరందఱు యువరాజు యొక్క ప్రసాదమును సంపాదింపవలయు ననుకొనిన వారు. రాజు బలహీనుఁడైనచో, రా జవివేకి యయినచో, రాజు స్తోత్రప్రియుఁ డైనచో రాజును దమవలలో వేసికొనవలయునని పలుమంది ప్రయత్నింతురు. ఈ పది మందియు నాప్రయత్నము చేసిరి. ఈ పది మందిని మిహిరకులుఁడు గుర్తుపెట్టికొనెను. ము న్నితనిని స్త్రీ లోలునిగాఁ జేయుటకుఁ బలుమంది ప్రయత్నించిరి. వా రందఱను మిహిరకులుఁడు గుర్తుపెట్టికొనెను. అందులో నొక్కఁడుహీరమణి యనువాడు తన చెల్లెలిని మిహిరకులునకు సంధాన పఱచవలయునని చాల ప్రయత్నము చేసెను. మిహిరకులుఁడు చెల్లెలి నన్న నిద్దఱ దనసౌధమునకు రప్పించి యిద్దఱను వివస్త్రలను జేసి యన్న చేతఁ జెల్లెలితో సంసారము చేయించెను. తరువాత నిద్దఱను వధించెను. ఇది చాలరహస్యముగ జరిగినపని; కాని బయటకుఁబొక్కెను. మిహిరకులునిమీఁద రాజుతోఁ జేయఁబడిన యభియోగములలో నిదియొకటి. వసుకులుఁడు కొడుకుయొక్క సచ్ఛీలమునకు మెచ్చుకొనెను. దురాచారమునకు నొచ్చుకొనెను. క్రౌర్యమునకు గుండెలో విచ్చుకొనెను. ఓహో! ఈతని లక్షణము. తేనెపట్టువలె నుండెను. సుంత మేర మధువు, తక్కిన యధికమైనమేర మక్షికామలమూత్ర దూషితము. అల్పము సేవ్యము, అధికము తిరస్కార్యము. ఈ మక్షికములను సంహరించి యాబాధను దట్టుకొని యీ మధువును సేవించెడివాఁడెవ్వఁడు? వసుకులుఁడు వినిన పదిపదేను కథలవలన నిన్ని తేనెపట్టులుగల యా గుహలోనికిఁ బోయి యా తేనెను స్వీకరింపఁగలవాఁ డెవ్వఁడు? వింధ్యపర్వతములలో మహాగుహలలో భ్రమరవాసిని యన్న దేవి గలదఁట. ఆమె యున్నచోటికిఁ బోవుటకు నాల్గు యోజనములమేర గుహలలో నుంచి పోవలయును. గుహ లన్నియుఁ దేనెతుట్టెలచేత నిండియుండును. అవి కొండ

యీగలు. ఒకయోజనము వెళ్ళెడివాఁడేలేడు. చివరదాక నెవఁడు పోఁగలఁడు? మిహిరకులుని గుఱించి చెప్పిన మాటలన్నియు నిట్టివే; అన్నిటి వెనుకనొక ధర్మమున్నది. ధర్మము స్వల్పమైనది. రక్షణ పరమ క్రూరముగా నున్నది. ముంటితోదీయు దానిని గొడ్డలితో దీయునట్లున్నది. వెనుక ధర్మము లేనిచో వసుకులుఁడు కుమారుని శిక్షించెడివాఁడు. అంతకుమున్ను సేనలును సేనాపతులునువానివెనుక లేనిచో రాజు కొడుకును శిక్షించెడివాఁడు. మఱియును మిహిరకులుఁడు తనయందు భక్తికలవాఁడు. వాఁడు తలఁచినచోఁ దండ్రియయిన తన్ను పదివిధములుగా సంహరించి యుండవచ్చును. రాజ్యముకై వసము చేసుకొని యుండవచ్చును ఒక్కపురోహితుఁడు చెప్పిన విషయముననే మిహిరకులుని దుష్కార్యమువెనుక నున్న ధర్మము సంశయగ్రస్తముగా నున్నది. ధరాపతియైన వసుకులుఁడు పదినెలలు పరితపించెను. చివరకుఁ బ్రాయోపవేశము చేసెను. అభియోగములు చేసిన యెవ్వరికిని రాజుయొక్క పరితాపము తెలియదు. మిహిరకులునికి సర్వసేనలపైగల ప్రభుత్వము తెలియదు. సేనాపతులకు సైనికులకే తప్ప వాని బలపరాక్రమములు తెలియవు. వానిధనుర్విద్యా పాండిత్యము తెలియదు. రాజు కొడుకును శిక్షింపలేఁడనియు, పుత్రవాత్సల్యము తెగఁగోసికొనలేఁడనియు, రాజు ధృతరాష్ట్రునివంటివాఁడనియు మాత్రమే చెప్పికొనఁ జొచ్చిరి. వసుకులుఁడు సర్వంకషముగాఁ బదినెలలు విచారించి తానీ ప్రాయోపవేశమును జేసెను.

మిహిరకులుఁడు జన్మలో నిద్రలేకపోవుట యెఱుఁగఁడు. ఈనాఁడతనికి నిద్ర పట్టలేదు. అతఁడు ప్రతిదినము సుఖముగా నిద్రించును. అతనికిఁ బలుమాఱులు స్వప్నములు వచ్చును. ఆ స్వప్నములన్నియు నతని గాఢమైన మొదటినిద్ర యయిన తర్వాత నిశయొక్క మూడవ జాముననో నాల్గవ జాముననో వచ్చుచుండును. అతని స్వప్నములు వట్టి స్వప్నములు కావు. యముఁడు కనిపించును; బేతాళుఁడు కనిపించును; మఱియెవ్వఁడో కనిపించును. ఇతఁడు యమునిని బేతాళుని నెఱుఁగును. ఆ మూఁడవవాని నెఱుఁగఁడు. కాని యతని స్వప్నములలో నెక్కువ మాటాడెడువాఁ డితఁడు. అతఁడును మిహిరకులుఁడును గాశ్మీరమునందలి యెత్తైన యొక పర్వతప్రదేశమున నెదురెదురుగా రెండు శిలావేదికల మీఁదఁ గూర్చుందురు. అతఁడు గురువు. మిహిరకులుఁడు శిష్యుఁడు. వాఁడేవేవో చెప్పుచుండును. ఇతఁడు వినుచుండును. మిహిరకులునకు మెలఁకువ వచ్చిన తరువాత వాఁడు చెప్పిన వానిలో సగానికి సగము జ్ఞాపకముండవు. కొన్ని జ్ఞాపకముండును. జ్ఞాపకమున్న వెందుకుండునో లేని వెందుకుండవో తెలియదు. మేలుకొన్న తరువాత నేవో ప్రధాన విషయములు మిహిరకులునకు మరచిపోయినట్లుండును. వానిని జ్ఞాపకము తెచ్చికొనుటకు మిహిరకులుఁడెంతో ప్రయత్నించును. నిష్కంటకుని వలన నీ యవమానము పొందిన తరువాత తాను నిష్క్రియుఁడుగాఁ దిరిగి రావలసి వచ్చిన తరువాత నతనికేమియుఁ దోఁచలేదు. గుఱ్ఱముల కొట్టములోనికిఁ బోయెను. పట్టపుగుఱ్ఱము తన్ను జూచి సకిలింపలేదు. దాని పార్శ్వతలమునఁ దన హస్తముంచఁబోఁగా నది వెనుగాళ్లెత్తి తన యనిష్టమును జూపించెను. నిత్యము మిహిరకులుఁడు తాను మేలుకొనియున్నంతవఱకుఁ దన ప్రక్క వ్రేలాడు ఖడ్గము లేకుండ నుండఁడు. ఖడ్గమును దన ప్రక్క నుంచికొని నిద్రపోవును. ఖడ్గమును మఱచి నిముస ముండఁడు. ఇప్పుడు ఖడ్గములేదు. అతనికి మిక్కిలియుఁ గోపము వచ్చెను. గుఱ్ఱము యొక్క హృదయ ముండుచోట నతఁడు పిడికిలితోఁ బొడిచెను. ఆ దెబ్బకు గుఱ్ఱము తట్టుకొనలేక నేలపైఁ బడిపోయెను. పడిపోవుచు నితనిని నోటితోఁ గఱువ వచ్చెను. ఇతఁడు దాని మెడమీఁద గూర్చుండి దాని దంతములు రెండు చేతులతోఁ బట్టికొని దాని దౌడలు చీల్చెను. దాని గొంతులోనుండి పరమవికారమైన బాధారోదనము వినవచ్చెను. గుఱ్ఱము చనిపోయెను. ఆ బాధారోదనధ్వని విన్న తరువాత వాని ప్రాణమునకు శాంతి సమకూడెను. అచ్చోట నింకొక గుఱ్ఱములేదు. ఉన్నచో దానినిగూడ నిట్లే చంపెడివాఁడు. అతని హృదయమునకు సంపూర్ణముగా శాంతి ఘటిల్లెడిది. అతఁడు బయలుదేరి తన శయనాగారమునకుఁ జేరి గుఱ్ఱముతోఁ గ్రిందమీఁదఁ బడిన సమయమునందు తన దుస్తులకుఁ గలిగిన మచ్చలును జినుగులును జూచి తన యంగీ మార్చుకొనవలయునని యనుకొని కాదని దానితోడనే శయనము నందుఁ బరుండెను. నిద్ర రాలేదు. గుఱ్ఱము తోడి పెనకువలో దాని నోటి నురుసు దాని మేని చెమటయు నొక వికారపు వాసన కలిగించి యావాసన వానిని వదలలేదు. వెగటుగా నుండెను. స్నానము చేయవలయును. చేయుట కిష్టములేదు. అట్లే పండుకొనెను. నిద్రరాలేదు. నిద్రరాకుండా స్వప్నములు వచ్చుచుండెను. స్వప్నావస్థ నిద్రావస్థకంటె భిన్నమయ్యు నిద్రావస్థలోని యొకభాగమగును. స్వప్నావస్థకు స్వాతంత్ర్యములేదు. ఇప్పుడది స్వతంత్రమువలె వానియందుఁ బ్రవర్తింప నారంభించెను. పూర్వలిప్త జాగ్రదవస్థ, మఱులిప్త స్వప్నావస్థ. ఇట్టిది సంభవమా? సంభవముగాఁ గనిపించుచుండెను. పూర్వలిప్త స్వప్నావస్థ, మఱులిప్త జాగ్రదవస్థగా నుండవచ్చును. స్వప్నమునుండి సుషుప్త్యవస్థ లేకుండగనే మనుజులు జాగ్రదవస్థలో

నికి వత్తురు. జాగ్రత్స్వప్నావస్థలు ప్రారంభ దశయందు సుషుప్త్యవస్థాంతరితములు కాకుండుట లోకములో నుండదు. అప్పు డప్పుడు మేల్కొనియేయున్నాను. ఇంతలో నొక కల వచ్చినది. కల యనుటకు వీలులేదు. అదికూడ జాగ్రదవస్థాంతర్భూతమైన విష యమే అని పెద్దలు చెప్పుట కలదు. ఇట్టి దెప్పుడో నూటికిఁ గోటికి జరుగును. ఆ జరి గినది వీలుగానుండును. పరమస్వల్పమైన కాలముతో జరుగును. ఇప్పుడు మిహిరకు లున కట్లు జరుగలేదు. తానును తన గురువైన వాఁడును పర్వతాగ్రభాగమున స్వస్వనియ మిత శిలాతలములయందు గూర్చుండిరి. అతఁ డిట్లనెను. "నీ వింక నాఱుదినములకు రాజు వగుదువు. ఈ లోపుగా నిన్ను నీవు నియమించుకొనవలయును. ఆఱు రోజులు కాదు, ఏడు రోజులు. ఒక్కదినమునకుఁ బదియేండ్లుగా నీ రాజ్యపాలనము సాగగలదు. నీవు డెబ్బదియేండ్లు రాజ్యము చేయుదువు. నీ వీ యేడుదినములు నియమము నవలం బింపలేనిచో నీ రాజ్యకాలము తరిగిపోవును. నీ వందరు రాజులవంటివాఁడవు కావు. కొన్ని మహాకార్యములు చేయుటకు జన్మిం చినవాఁడవు!" అనఁగా మిహిరకులుఁడు ఆ కార్యము "లెట్టివి అని ప్రశ్నించెను." అతఁ డిట్లనెను. "రాముఁడు లంకను జయించెను. రావణుని సంహరించెను. ఇది మహాకార్య మేనా? అర్జునుఁడు పదునొకండక్షౌహిణుల కురుసైన్యమును విదలించెను. ఇది మహా కార్యమేనా? పలుమంది రాజులు వేల కొలఁది యేండ్లు పరిపాలించిరి. ధర్మమును నిలబెట్టిరి. వారి తరువాత నా ధర్మ మేమై నది? నది ప్రవహించినంత మేర పండించి నది. ప్రవహింపనిమేర నేమైనది? అగ్ని ప్రజ్వలించినంత మేర మండించినది. తక్కిన మేర యేమైనది? మహాకార్య మనఁగా విస్తృతమైన కార్యము. క్రిందనొక చిన్న రాయియున్నది. దాని నెవఁడైన యెత్తఁ గలఁడు. ఇరువదిమంది కలిసి యెత్తలేని యొకదానిని బలవంతుఁడొకఁ డెత్తును. అది మహాకార్యము. సామాన్యమైన బలవం తుఁడు తన్నెదిరించిన యొకరిద్దరను దూర ముగాఁ దోలును. ఒకనిని వేయిమంది యెది రింతురు. వేయిమందిని కత్తి బూని సంహ రించినచో నది మహాకార్యము. దిక్కాలవస్తు పరిణామ పరిణాహములమీఁద వ్యాపించిన కార్యము మహాకార్యము. ఒకరాజు పదివందల సైన్యముతో శత్రువుయొక్క లక్ష సైన్యమును నిర్మూలించును. ఇది మహాకార్యము."

మి. కు:- ఈ కార్యములు చేసిన నేమి, చేయకపోయిన నేమి?

పురుషుఁడు: ఒక కార్యము జరిగిన నేమి, జరుగకపోయిన నేమి? రాముఁడు రావ ణుని సంహరింపలేదు. రామాయణము లేదు. అర్జునుఁడు కౌరవసైన్యము నురు మాడ లేదు. భారతము లేదు. రామా యణ భారతములు లేనిచో వచ్చిన నష్ట మేమి! ఇవి లేని జాతు లున్నవి. వారియందిట్టి కథలు కొన్ని యుండ వచ్చును. ఈ కథ లెందుకున్నవి! వాని వలనఁ దరువాతి జనులకు నుత్సాహా దికములు కలుగవలయు ననియా! ఈ కథలు పుట్టకపూర్వము ప్రజల నుత్సా హాదికము లెట్లుకలిగెను? అప్పుడు నేవియో యున్న వందువా! ఒక్కొ కపు డొకొక్క ధర్మ ముండును. ఆ ధర్మ పరిరక్ష చేసినవాఁడు మహాపురుషుఁ డని పించికొనును. సర్వదేశముల యందు సర్వకాలములయందు ధర్మ మొక్క రీతిగా నుండదు. ఒక ధర్మము కొంత కాలపరిమితిమీదఁ సాగును. ఆ పరిమిత కాలఘున పరఖండమునకుఁ బూర్వ ఖండము లక్ష్య భూతము. దేశము ముక్కలు ముక్కలైనట్లే కాలమును ముక్కలు ముక్కలుగా నుండును. నీవు బలవంతుఁడవు. ఒక్క గ్రుద్దుతో గుఱ్ఱమును జంపగలవాఁడవు. నిష్కంట కుఁడు నీవంటి బలము కలవాడు. ఒక్క గ్రుద్దుతో వాఁ డేనుఁగును జంపఁ గలఁడు. నీవు రాజవు. వాఁడు బంటు. వాఁడు చేసెడిపని యొకవ్యక్తి తన బలమును ప్రదర్శించిన ట్లగును. అంత కంటెఁ దక్కువపని యైనను రాజు చేసినది మహాకార్య మగును. ఇందాఁక చెప్పిన మహాకార్య మన్న నిర్వచన మునకు వ్యక్తియొక్క గొప్పతనమును గూడ గలిపికొనవలయును. నిష్కంట కుఁడు మహాకార్య మెప్పుడును జేయ లేఁడు. వాఁడు సేవకుఁడు. నీవు చేయగలవు. ఏడు దినములు నీవు నియ మము నవలంబింపవలయును. కత్తితో నీవు నిష్కంటకుని మీఁదికిఁ బోయితివి. వాఁడు నీ కత్తిని ముక్కలు ముక్కలుగా నఱికెను. శ్రమలేకుండ నఱికెను. నీ చేతిలోని కత్తి ముక్కలైనంతనే నీవు వానిని మల్ల యుద్ధమునకు దొరకొని యెదిరించినచో వాఁడు నీతో మల్ల యుద్ధ మాడడు. వాఁడు తన చేతిలోని కత్తిని పారవేసి నీవేది చేసినను దాని కంగీకరించెడి వాఁడు. వాఁడునిన్ను పిండి పిండిగా జేయఁగలడు. కాని చేసెడివాఁడు కాఁడు. ఇచట నొక సూక్ష్మమైన భేదము కలదు. నీకత్తిని ముక్కలు ముక్కలుగా నఱికిన వాఁడు నిన్నెందుకు నేలఁబెట్టి కాలరాయఁడు. ఇచ్చట ధర్మసూక్ష్మ మున్నది. నీవు మహాకార్యములు చేయఁగల వాఁడవు. వాఁడు చేయలేని వాఁడు. మహా

కార్యములు చేయుటకు వాఁడు జన్మింపలేదు. నీవు జన్మించితివి. ఇది భేదము. అప్పుడు నీవు నియమము నవలంబించితివి. మంత్రి పురోహితుల మాట వింటివి. ఎందుకు వింటివి ! నీ తండ్రి ప్రాయోపవిష్టుఁ డై యుండెను. అతని రాజ్యమును నీవు కోరెదవు. అతని యధికారమును నీవు కోరెదవు. అతని మృతిని నీవు కోరవు. ఒక విధముగా మృతిని గూడ కోరుదువు. కాని యా మృతి నీవలన సంఘటిల్లుట నీవు వాంఛింపవు. ఇది సూక్ష్మతరమైన యంశము. నిష్కుంటకుఁడు నిన్నెదిరించినచో నిన్ను రక్షించుటకు వందమంది వత్తురు. వాఁడు వందమందిని సంహరింపఁగల్గినచో నిన్ను రక్షించుటకు వేయి మంది వత్తురు. చివరకు వానిని వధింతురు. ఓయి ! యువరాజా ! అది నీ తండ్రి శయనాగారము. సౌధాంతర్భాగము. ఒక్క వరుసగా సచట నేఁబదిమంది కంటె నెక్కువ పట్టరు. వాఁ డొకఁడు సురక్షితమైన యెడ నిలుచున్నచో వేయిమందిని సంహరింపవచ్చును. ఎంత సేపు సంహరించును ! వంద యేండ్లట్టే నిలుచుండి యుద్ధము చేయునా? వానికిని బలము తరిగిపోవును. శ్రీకృష్ణుడు నిర్యాణము పొందిన తరువాత నర్జునుఁడు కృష్ణుని యంతఃపుర స్త్రీలను వేలమందిని దనవెంటఁ దీసికొని వచ్చుచుండఁగా బోయలు వాని నెదిరించిరి. అతఁడు నిస్సహాయుఁ డయ్యెను. గాండివము ధనుస్సు కాలేదు. వట్టి కాష్ఠ మయ్యెను. అంతటివాని శౌర్యమునకు ధనుర్విద్యకు నవసానము కలిగెను, అతని ధనుర్విద్యా శక్తి యుడిగిపోయెను. ఒక ప్రవాహము కొంత మేర తీవ్రముగాఁ బ్రవహించును తరువాత వేగము తగ్గును. ఒక చోట చెరువున కంటెఁ గనాకష్ట మగును. ఒక్కటే వేగముతో దేశకాలములను దాటి యేది యుండును. ఏదియు నుండదు ఉండుటకు వీలున్నచో శ్రీరామచంద్రుఁడెందుకు చనిపోవలయును? మానవసృష్టి యున్నంతకాల మాయనయే రాజుగా నెందుకుండగూడదు. అప్పు డధర్మ ముండదు కదా! ఇట్లెంతయైనఁ జెప్పవచ్చును. నీవు వారము దినములు నియమవంతుండవు కమ్ము. నీ డెబ్బది యేండ్ల రాజ్యకాలములోఁ దరుగురానీయకుము.

మఱులిప్తలో మిహిరకులునకు జాగ్రదవస్థ వచ్చి నట్లుండెను. ఇది జాగ్రదవస్థ కాదు అది స్వప్నావస్థకాదు. కాని పూర్వలిప్తయందుఁ దాను గిరిశిఖర శిలావితర్దిక మీఁద నుండెను. ఎదురుగా గురువుండెను. ఈ లిప్తయం దితఁడు తన మంచము మీఁద నుండెను. తాను పరున్న సౌధభాగపు పైకప్పునందు వర్ణములలోకి చిత్రములు లతలు పుష్పములు నుండెను. రాత్రులందు జీవులు నిదురపట్టక మేల్కొని యున్నప్పుడు కన్నులు మూసికొని లిప్తలు, విఘడియలు, ఘడియలు, జాములు వెళ్ళబుత్తురు. నిద్రకోసము ప్రయత్నింతురు. అదిరాదు. ఇంటిలో సందఱు నిద్రపోవుచుందురు. తాము మంచము మీఁది నుండి లేచి పోవరు. ఎక్కడికి పోవలయును? పెరడు, వీథి, పురము నిర్జనములుగానుండును. పవలు సంచరింతు రన్నచోఁ దమ పనుల మీఁదఁ దాము సంచరింతురు కాని వీథులయందు సంచరించు జనములను జూచుటకుఁ బోవరుగదా. తమ పనుల మీఁదఁ దమరు పోదురు. కాని వీథులనిండ జనము కనిపింపవలయును. లేనిచో వారికిఁ దోఁచదు. నిర్జన ప్రదేశ మున మనుష్యునియొక్క సంచారములో నేదియో లోపించినట్లుండును. ఒక యడవిలోఁ దిరిగి నట్లుండును. మనుష్యుఁడు మనుష్యుల నడుమ దిరుగుట కలవాటు పడినాఁడు. వాని సర్వ వ్యవహారములు మనుష్యులతోడనే జరుగును. వీఁ డొక ప్రాణము. ఇతర ప్రాణములతోడి కలయిక లేనిచో నీ ప్రాణం జీవించియున్న ట్లనిపించదు. నిష్కుంటకుని వధించినచోఁ దక్కిన ప్రాణులు చాలమంది యున్నారు గనుక సరిపోవును. తాను, నిష్కుంటకుఁడు నిద్దరే యున్నారు. నిష్కుంటకుని దాను వధించును. తాను బ్రదికియుండియుఁ జచ్చినట్లే. ఒకనిని వధించుటలో నున్న సుఖం వధింపఁబడని వేయిమంది యున్నప్పుడున్నది.– మిహిరకులుని యూహ తెల్లవారలును సాగినది. తెల్లవారినది. కాల్యకృత్యములను దీర్చి కొనెను. స్నానము చేసెను. అతనికి మనసులో నొకక్రొత్తయూహ యేర్పడెను. స్వప్నగతపురుషుని గురువని యతఁడు పూర్వ మనుకొనలేదు. ఇప్పుడా యూహ కలిగెను. గురువు లిద్ద ఱయినారు. స్వప్న గురువు, జాగ్రద్గురువు. ఇద్దఱి నామధేయములును దనకుఁ దెలియవు. జాగ్రద్గురువు మీఁదఁ బగ మాత్రము మిగిలినది. అతఁడు రాలేదు. రాజధాని వదలిపెట్టి పోయెను. ఎచ్చటికిఁ బోయెను? రెండవసారి పంపించిన వేయి దీనారము లేమయినవి ? ఆ యధికారిని బిలిపించెను. ఇతఁడు వెళ్ళినపుడు గురువుయొక్క పెద్దకొడుకు వాకిటిలో నుండెను. ఈ ధనము వాని చేతి కిచ్చెను. మిహిరకులుఁ డిట్లు భావించెను. గురు వా వెనుకటి దినమునఁ బాఱిపోయెను. అతని కుటుంబము మరునాటి వఱకు రాజధానియందే యుండెను. గురుభార్యయు, ముగ్వురు కొడుకులు, నొక కుమార్తెయు. వీరు పాఱిపోవుట గురువొంటరిగాఁ బోయినంత తేలిక కాదు. వీరిని బట్టు కొనవచ్చును. మిహిరకులుని యాజ్ఞ వలన రాజభటులు జాగ్రద్గురు కుటుంబమును

వెదుకఁజొచ్చిరి. తల్లియు ముప్వురుకొడుకులును గూతురును గలసిపోయిన జాడ సులభముగాఁ దీయవచ్చును కాని సాధ్యము కాలేదు. ఏడుదినములు గడచెను. గురుకుటుంబము కనిపింపలేదు. నిష్కంటకుఁడు బ్రదికియే యుండెను. మొదటి దాశ్చర్యమా ? రెండవది యాశ్చర్యమా ? పదియవనాఁడు తండ్రి చనిపోయిననాఁడు, తండ్రియొక్క కర్మ మిహిరకులుఁడే చేయవలయును. కర్మ కూడ పూర్తి యయ్యెను. అధికారు లందఱును మిహిరకులునకుఁ బట్టాభిషేకము చేసిరి. మిహిరకులుఁ డవివాహితుడు, వివాహమైన తరువాతగాని రాజ్యస్వీకారయోగ్యత లేదని కొందఱు బ్రాహ్మణు లనిరి. కాశ్మీర రాజ్యమున బ్రాహ్మణుల బల మెక్కువ. వారి బల మెక్కువని తెలియుట కిది మొదటిసారి. తరువాతఁ దరువాత బ్రాహ్మణుల బలము మిక్కిలి విజృంభించినది. అదివరకు లేనిది మిహిరకులుఁని యీపట్టాభిషేక సమయమున ప్రారంభించినది. మిహిరకులుడు లౌకికాబ్దమున నిరువదిమూఁడు వందల డెబ్బది రెండవ సంవత్సరము వాఁడు. లౌకికాబ్దమున మూఁడు వేల యయిదువందల సంవత్సరములు గడచు నాటికిఁ గాశ్మీర రాజ్యములో బ్రాహ్మణుల బల మెక్కువైనది. బల మెక్కువగుట యనఁగాఁ గొన్నిపట్టణములయందలి బ్రాహ్మణులుకలసి రాజసౌధము ముందునకు వచ్చి నిరాహారదీక్ష నవలంబించెడివారు. వేలమంది బ్రాహ్మణుల మృత్యువువలన భీతిచేత రాజులు వారికి లొంగెడివారు. రాజశత్రువులు బ్రాహ్మణులకు లంచములు పెట్టి యీ పని చేయించుటయుఁ దరువాతి కాశ్మీరరాజ చరిత్రమునఁ గలదు. పది పదేను వందలయేండ్ల తరువాత విజృంభింపఁబోవు నీ భయము మిహిరకులుని పట్టాభిషేక సమయమునఁ బొడసూపెను. రాజధానిలోని వందమంది బ్రాహ్మణులు రాజు మొగసాలయందు నిరహారదీక్ష నవలంబించిరి. బట్టాభిషేకము కాకముందు రాజు పెండ్లియాడి తీరవలయునని వారి పట్టుదల. పూర్వ మెందఱో రాజులు పట్టాభిషిక్తు లయినతరువాతనే వివాహితులయిరి. ఆ బ్రాహ్మణు లీ వార్తను విశ్వసింపరు. నిష్కంటకుఁడు తన్నెదిరించి యిరువది మూఁడు దినములైనది. వాఁడు రాజధానిలో నుండి పరారు కాకుండ యువరాజు కట్టుదిట్టములు చేసెను. తత్కార్యమునందు నియమితులైనవారు ప్రతిదినమున సాయంకాలమున వచ్చి నిష్కంటకుఁడు పారిపోవు లక్షణము లేవియు లేవని చెప్పుదురు. జాగ్రద్గురువు పాఱిపోలేదా ? వీఁడును రహస్యముగాఁ బాఱిపోవును. వాని యిల్లు పరీక్షింపవలయును. ఇంటిలోనుండి సొరంగ మేమైన త్రవ్వికొనెనేమో ! ఎచ్చటికిఁ బోవునో, యెట్లుపోవునో ? నిరాహారదీక్ష నవలంబించిన బ్రాహ్మణులతో మంత్రులు సంబంధము తెండని చెప్పిరి. మఱునాఁడే సంబంధము తేవలయును. మఱునాఁడే వివాహము కావలయును. రెన్నాళ్లు నిరాహారదీక్ష సాగెను. రాజ్యమునకు రాజు లేకుండఁ బదునెనిమిది దినములు గడిచెను. మిహిరకులునకు రెండు దయ్యములు పట్టెను. ఒకటి తాను రాజయినంతనే నిష్కంటకుని వధింపవలయును. రెండు పరరాజ్యములను గెలువవలయును. ఒకదాని కొకటి పోలిక లేదు. మానవుని యొక్క చిత్తవ్యామోహము విచిత్రముగా నుండును. నిష్కంటకుని వధించుట గడ్డిపోచను గిల్లుట వంటిది. పరరాజ్యములను సాధించుట కాంతారములను ఛేదించి వ్యవసాయము చేయుటవంటిది. ఈ రెంటికి సంబంధ మేమి ? తన వివాహమునకుఁ దన పట్టాభిషేకమునకు సంబంధ మేమి ? ఇంతవరకు మిహిరకులునకుఁ దాను పెండ్లియాడవలయునన్న యూహ కలుగలేదు. పూర్వము తన చెల్లెలిని సమకూర్చుటకు నెంచిన రాజాధికారిని నాశనము చేసెను. నిర్లజ్జముగా వాఁడు చచ్చునట్లు చేసెను. అప్పుడు స్త్రీపురుష సంబంధ మేమో మిహిరకులునకుఁ దెలిసెను. అతనికి మనసులో దానియందు విరోధభావము కలిగెను. ఆ విరోధభావ మొక కటికచీకటి యైనచో నడుమ నేదో సన్నని దీపముగా వెలుఁగుచుండెను. ఆ వెలుఁ గేమి ? దానిని బరిశీలింపవలయును. ఈ భావము కలదు. వివాహ మాడినచో నీ సందేహము తొలఁగిపోవును. ఇది చాల నిగూఢ రహస్యమైన విషయము. జంతువు లందు రక్తనిష్ఠమై మనోనిష్ఠమై యనుపదిష్టమై యీ వాంఛ యుండును. ఋశ్యశృంగుని వంటి వానియందు సులభముగా నీ వెలుఁగు ప్రబుద్ధ మగును. మిహిరకులుని వంటి వానియందుఁ బ్రబుద్ధము కాదు. ఇంకను నిగూఢముగా నుండును. లోకము నం దందఱు పెండ్లియాడుచున్నారు. స్త్రీపురుష విభేదము కలదు. తత్సంగమము చేతనే జంతువు లుద్భవించుచున్నవి. ఈ సంగతి మిహిరకులునకు దెలియును. తెలియుననఁగాఁ దెలిసియుఁ దెలియనట్లు తెలియును, ఆనాటి యుదయమున నిరాహారదీక్ష నవలంబించిన బ్రాహ్మణులను గజములచేత త్రొక్కింపవలయునని మిహిరకులుఁ డూహించెను. గజములు రెండు వచ్చినవి. బ్రాహ్మణులు పారిపోకుండ సైనికులు వారి చుట్టు నిలఁబడిరి. రాజాధికారు లందఱును వచ్చిరి. మిహిరకులుఁ డచట నిలుచుండెను. సర్వజనులు భయపడుచుండిరి. రెన్నాళ్లు తిండి లేని బ్రాహ్మణుల నేనుఁగులచేత మట్టింతురా ? అపుడు మిహిరకులుఁ డిట్లనెను. "నాకు వివాహ మక్కఱలేదు. మీరందఱును లేచిపొండు. లేనిచో మిమ్మి యేనుగలచేతఁ ద్రొక్కింతును. మిమ్మి బట్టి తక్కిన

బ్రాహ్మణు లెదిరించినచోఁ గాశ్మీరదేశమున బ్రాహ్మణుఁడు లేకుండఁ జేసెదను. నాకుఁ బట్టాభిషేక మక్కఱలేదు. నే నిపుడు భూపతినే." అనఁగా వారిలోనొక బ్రాహ్మణుఁడు మిహిరకులునకు సవయస్కుఁడు, వేద వేదాంగవేత్త, కాలజ్ఞుఁడు లేచి నిలుచుండి యిట్లనెను. 'రాజా! నీవు రాజువే! ఎందుకు రాజ వైనావు? మహారాజైన వసుకులుని గర్భమున నుత్పన్నుఁడ వగుటచేత రాజ వైనావు. ఆయనకు నీవు పుత్రుఁడవు. ఆయన వివాహమాడినాఁడు. ఆ రాజుయందు నీవు జన్మించితివి. కనుక నీవు రాజువు. అట్లు నీవు జన్మింపనిచో నిప్పుడు రాజెవరో మంత్రులును బ్రాహణులును నిర్ణయింపవలయును. నీ తండ్రి వివాహమాడెను గనుక నీ రాజ్యమున కిప్పు డా యాపద కలుగలేదు. నీ తరువాత రాజ్యమున కిట్టి యాపద కలుగకుండ నిన్ను వివాహమాడు మనుచున్నాము. ఈ దేశమునందు బ్రాహ్మణుఁడన్న వాఁడు లేకుండ నీ కాలములో జరుగదు. కొన్ని వేల యేండ్లు పోవలయును," అని యా బ్రాహ్మణుఁడు తక్కిన వారిని లెండని వారిని వెంటఁగొని వెడలిపోయెను. అందఱును నివ్వెఱపోయిరి. ఏనుగులు వెడలిపోయెను. సైనికులు నిష్క్రమించిరి. మిహిరకులుఁ డట్లే నిలబడి యుండెను. అధికారు లతనిని వదలిపోవుటకు వీలులేదు. ఒకరిద్దఱు సాహసించి మిహిరకులునితో మఱునాఁడు పట్టాభిషేకము జరుగవచ్చు ననిరి. మిహిరకులుఁ డిట్లనెను. 'నేను వివాహము చేసికొనిగాని పట్టాభిషిక్తుఁడను గాను.'

అందఱు నెవరి దారిని వారు పోయిరి. ఆ సాయంకాలమున నల్వురు మంత్రులు తమ కూతుండ్ర నిత్తుమని వచ్చిరి. మిహిరకులుఁడు వారిని బంపించెను. 'నేను మీ కూతుండ్రను వివాహమాడను. ఎవని కూతురును నేను పెండ్లియాడుదునో వానికి రాజ్యమునం దధికమైన యధికారము వచ్చును. వాడు నన్నే కాదనవచ్చును. నాకుఁ గలిగిన సంతానమును గాదని తన కొడుకునకు రాజ్య మిచ్చుటకుఁ బ్రయత్నింపవచ్చును. నేను దండయాత్ర పోయి రాజులను గెలిచి వారి కూతుండ్రలో నెవతె సౌందర్యవతియోయామెను బెండ్లియాడెదను. అప్పుడుగాని నాకుఁ బట్టాభిషేకము జరుగదు. ఈ లోపుగా నేనే ధరాపతిని. పట్టాభిషిక్తుఁడను గాకపోయినను నేనే ధరాపతిని. రాజు కొడుకు నగుటచేత నేనే రాజును. ఆ పట్టాభిషేక మొకయాచారము. ఆయాచారము నిర్వర్తింపఁ బడనంత మాత్రమున నేను రాజును కాననుటకు వీలులేదు. రాజనఁగా సైన్యము కలవాఁడు. నాకు సైన్యము కలదు. నేను దిరిగివచ్చులోపల నీ రాజ్యమున నెవఁడైన స్వతంత్రించినచో వానిని గూకటివ్రేళ్ళతో పెల్లగించెదను."

మిహిరకులుని మాట లెంత ధర్మబద్ధములుగా నున్నవో వాని మాటలంత భయంకరములుగా నున్నవి. మంత్రులు మంత్రరుద్ధ భుజంగములవలె నైరి. మఱునాఁడు దండయాత్రకు సన్నాహములు జరిగెను. తాను లేనపుడు రాజ్యమును నడుపుటకుఁ దత్తదధికారులను మిహిరకులుఁడు నియమించెను. ఇదివఱకున్న నగరాధ్యక్షుని తొలఁగించి నిష్కంటకుని నగరాధ్యక్షునిగా నియమించెను. అతని ప్రయత్నము, నతని యేర్పాటులు, నతని బయలుదేరుట పూర్వము పది దండయాత్రలు చేసినవాఁడు చేసిన ట్లుండెను. ఈ మహా ప్రతిభావంతుఁడైన మిహిరకులుని జూచి యధికారు లందఱు నివ్వెఱపోయిరి. భయపడిరి. ఉక్కిరిబిక్కిరైరి. మిహిరకులుని సేనాసాగరము బయల్వెడలెను. ఉప్పెనవలె బయలుదేరెను. వాని ముందు ధాత్రి నిలుచుటలేదు. సైన్య పాదఘట్టనమువలన ధాత్రి కంపించుచుండెను. నదులు త్రోవ లిచ్చెను. అభిసారము, త్రిగర్తము, గాంధారము గజగజలాడిపోయెను. మిహిరకులుఁడు బయలుదేరుట యేమి? ధాత్రి క్రక్కదలుట యేమి? దుర్గాధ్యక్షులు దుర్గములను పరిత్యజించి పారిపోవుటయేమి. ప్రాకారములు పగిలిపోవుటయేమి? కందకములు పూడిపోవుటయేమి? కోటలను గొల్లగొట్టుట యేమి? పట్టుమని బదిరోజుల ముట్టడి యొక్కచోటగూడ లేదు. 'ఇది దండయాత్ర కాదు. ఇది వధువుయొక్క యన్వేషణము' అన్న వార్త రాజు లందఱకుఁ దెలిసిపోయెను. ఇట్టి మహా వీరునకుఁ దమ కూతు నిచ్చుటకన్న రాజులకుఁ గావలసిన దేమి? కాని రాచరికపు టీవి మఱియొక రీతిగాఁ బ్రదర్శింపఁబడును. అతఁడు రావలయును. ముట్టడి వేయవలయును. తమ కోటను నిర్జింపవలయును. అపుడు కూఁతు నిచ్చి సంధి చేసికోవలయును.

అందుచేత దండయాత్రయు తప్ప లేదు. యుద్ధములు తప్పలేదు. కోటల ముట్టడులు తప్పలేదు. నాల్గుదేశముల రాజులు నిర్జింపఁబడిరి. వారి కోటలు నిర్మూలింపఁబడెను. వారు బందిగాఁ గొనఁబడిరి. వారి కూతులు మిహిరకులునకు నచ్చలేదు. అతఁడు రాజులను వదలిపెట్టెను. కప్పములు స్వీకరించెను. గాంధార దేశమునఁ బది కోటలను బట్టుకొనెను. ప్రధానమైన దుర్గమునకు మఱునాడు బయలుదేరిపోవును. ఆ రాత్రి మిహిరకులుని గుడారమునందు దీపములు వెలుఁగుచుండగా సైనికులు ముప్వురు చేతులు విఱిచి కట్టిన యొక సైనికుని దీసికొని వచ్చిరి. అతని యొడల నినుప కవచము కలదు. అయశ్శిరస్త్రాణము కలదు. బొడ్డున చుఱకత్తి కలదు. వయసుచాలచిన్నది. పదునారేండ్లుండ వచ్చును. సైనికు లతనిని జూపించి యిట్లనిరి 'ఇతఁడు మనసైనికుఁడుకాఁడు. గాంధార

పతి హస్యచారుఁడు. ప్రభువులు రేపు గాంధార రాజ్య ప్రధాననగరమును ముట్టడింప నెంచు చున్నారు. అందుచేత నితనిని దమ సన్నిధానమునకుఁ దెచ్చితిమి.' మిహిరకులుఁడు బంధితునివంకఁ జూచెను. అతఁడు శ్యామల వర్ణుఁడు. వెడదలైన కనులు. లేఁతదనము వాని మొగమున నుట్టిపడుచుండెను. మిహిరకులుఁడు సైనికులతో వాని బంధములు వదిలించుఁడని చెప్పి వారిని వెళ్ళిపొమ్మనెను. వారు వెడలిపోయిరి.

మి : రాజకుమారా ! నీ కవచమును శిరస్త్రాణమును తొలగించి యిచట సుఖముగా నుండుము. వేడినీళ్లున్నవి. స్నానము చేయుము. నా యుడుపులు కలవు, ధరించుము. నీ యొడున నే నింతసాహసము చేయలేదు. నే నగ్నిహోత్రమను. నీవు సీతాకోకచిలుకవంటి రాచబిడ్డవు. నిన్ను నేను దహింపను. కాని నిన్నువదలిపెట్టను. నీ వేమి రహస్యములు గ్రహించితివో చెప్పుము. ఓయీ ! మిహిరకులుని నీ వెఱుఁగవు. నా రహస్యములు నీకు వంద తెలిసినను నా సైన్యముముందు మీ రాజుగాని మీ సైన్యములుగాని నిలువలేవు. నీ మొగము చూచినంత నా కొక్కటి బోధపడినది. ఎవని మొగమో చూసి వానియందు నాకుఁ బ్రేమకలుగుట యన్నది నే నిదివఱ కెఱుఁగను. అందఱు మనుష్యులు నాకు మనుష్యులవలెఁ గన్పింతురు. వానిని వధించుటకు నా కెప్పుడు నభ్యంతరములేదు. ఓయీ ! నిన్ను నేను వధింపను. నీవు పసివాఁడవు. నేను వృద్ధుఁడననికాదు. నిన్ను జూచినచో నా యెడఁదలో నొక మెత్తదన మేర్పడు చున్నది. మెత్తదనమునకు నా గుండియకు నేమియు సంబంధములేదు.

ఆ రాజకుమారుడట్లే నిలచియుండెను. మిహిరకులుఁడు తానే వాని కవచ శిరస్త్రాణములను తొలగించెను. తొలఁగించుచున్న కొలఁది మిహిరునకుఁ గనులందు మిహికము కప్ప నారంభించెను. చివరకు వాఁడు పురుషుఁడుకాఁడు. ఆమె స్త్రీ.

మి : ఎవరునీవు ?

ఆ : నేను గాంధారరాజ దుహితను.

మి : నీ పే రేమి ?

ఆ : కల్యాణవతి.

మి : ఎందు కిట్లు వచ్చితివి ?

ఆ : నీకు వధువు కావలయును. నాకు వరుఁడు కావలయును.

మి : వరుని నిట్లు వెదకుదురా ?

ఆ : వధువు నిట్లు వెదకుదురా !

మి : దీనివలన నీ తండ్రియొక్క రాజధానిని నేను ముట్టడించి నిర్మూలింపనని చెప్పుటకు వీలులేదు.

ఆ : మా తండ్రి దానికి సిద్ధముగానే యున్నాఁడు

మి : మీ తండ్రి ని న్నెందుకుఁ బంపినాఁడు.

ఆ : ఆయన పంపలేదు. నేనే వచ్చితిని.

మి : ఎందుకు వచ్చితివి ?

ఆమె :- నాకు మూన్నాళ్ళ క్రింద రాత్రియొక స్వప్నము వచ్చినది. ఒక కొండ కొమ్ము మీఁద మూఁడుశిలావితర్దికలుకలవు. ఒక రాతిమీఁద నేను కూర్చున్నాను. మరొక రాతిమీఁద నీవు కూర్చున్నావు. మూఁడవ రాతిమీఁద మరొకఁడు కూర్చున్నాఁడు.

మి. కు:- అతఁ డెట్లున్నాఁడు ?

ఆమె:-ఆజానుబాహువు. తెల్లనివాఁడు, నల్లని జుట్టు, గడ్డమును మీసములుకలవు. కాని యతఁడు కూర్చున్నట్లున్నదే కాని యతని శరీరము కనిపించుటలేదు. కనిపించు చున్నది కనిపించుటలేదు. మొగము మాత్రమే విస్పష్టముగా నున్నది. అతఁడు నీతోఁ జాలసేపుమాటాడెను. నీకు మెలకువ వచ్చెను. నాకు రాలేదు. అతఁడు నన్నిచ్చటికిఁ బొమ్మనెను. నా కప్పుడు మెలకువ వచ్చినది.

మిహిరకులుఁడు పోయి తన పీఠమునందు కూర్చుండి తల వంచికొని చాలా సేపుండి వెంటనే తా నామె యొదలినుండి తీసిన కవచ శిరస్త్రాణములను మరల తొడిగి విగించి సేవకులను బిలిచి 'ఇతఁడు గాంధారరాజు బిడ్డ. వీనిని దీసికొనిపోయి రేపు తెల్లవారకమున్న గాంధారరాజున కప్పజెప్పవలయును' అని యాజ్ఞాపించెను. ఆ మూఁడవ దినమున మిహిరకులుని సైన్యము గాంధార దేశపు ప్రధాననగరమును ముట్టడించెను. గాంధారరాజు వార్తను బంపెను. 'ఓయి మిహిరకులుఁడా ! మనవి యిరుగు పొరుగు రాజ్యములు. నాకుఁ గొడుకులులేరు. ఒక కూఁతురున్నది. ఆమెను నీ కిత్తును. నీ వామెను పెండ్లియాడి యుభయరాజ్యములకు నధికారివి కమ్ము.' కల్యాణవతీ మిహిరకులుల వివాహము జరిగెను. గాంధార దేశమునందు జరిగెను. కాశ్మీర రాజ్యాధికారులందరు వచ్చిరి. నెలనాళ్ళయిన తరువాత కాశ్మీర ప్రజలందరు తమ రాజుతోఁబాటుతిరిగి తమ దేశమునకుఁ బోయిరి. కాశ్మీర రాజ్యము రెట్టింపు ధనవంతమయ్యెను. గాంధార దేశంలోని పలుమంది యధికారులు, ప్రజలు కాశ్మీర రాజ్యమునందు విహరింపఁ జొచ్చిరి. రాజ్యము భద్రముగా నుండెను. ప్రజలు సుఖముగా నుండి సర్వము సంతోషభరితముగా నుండెను. మిహిరకులునకుఁ బట్టాభిషేకము జరిగెను. మిహిరకులుఁడు దండయాత్రలకు వెళ్ళినప్పుడు నిష్కంటకుని సామర్థ్యమువలన రాజధాని మహాభద్రముగా యుండెను. పట్టాభిషేక మయిన తర్వాత మిహిరకులుడు నిష్కంటకుని బిలిపించెను. అతఁడు వచ్చెను. మంత్రులందరు నిలుచుండిరి. అధికారులందరు చూచుచుండిరి. రాజు నిష్కంటకుని కేదో గొప్ప గౌరవము చేయునని ప్రతివారు నెదురుచూచుచుండిరి. రాజు నిష్కంటకుని చేతిలోని కత్తి పారవేయు మనెను. వాఁడు పారవేసెను. కొలువు దుస్తులు నిరాకరింపు మనెను. వాఁడు నిరాకరించెను. సైనికులతో వానిని బంధింపుఁడనెను. వారు బంధించిరి. అపుడు వానిని మిహిరకులుఁడు కత్తులతోఁ బొడిపించి చంపించెను. నిష్కంటకుని మొగమున నొక్క నరమైనను గదలలేదు.

(సశేషము)

# ఆంధ్ర దర్శనము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

సీ॥ దేశభక్తుడు దూరదృష్టితో శుభముహూ
ర్తమ్మున నంకురార్పణ మొనర్ప
నాంధ్రభీష్ముడు పవిత్రాంతరంగుండయి
అవసరమైన దోహద మొనర్ప
ఆంధ్రకేసరి అసహాయవిక్రమశాలి
ప్రతికూలతల నెల్ల పరిహరింప
అమరజీవి మహోన్నతాశయుండయి మేరు
నగధీరు డాత్మార్పణమ్ము సేయ
పదునొకండేండ్లక్రింద జహ్వారుమనీషి
దీవనలు పొంది ముక్కోటి తెలుగువారి
చిరతపఃఫల మవతరించిన దినమ్ము
తెలుగు వ్యక్తిత్వమునకు నాందీపదమ్ము.

క॥ పరదేశ పాలనమ్మున
చెరియొక ప్రాంతంబునందు జీవించెడు సో
దరు లెల్ల రేక మగుటను
స్థిరముగ నాంధ్రప్రదేశదీప్తులు వెలసెన్.

ఆ॥ ఒక్క బాసవారి కొక్క రాష్ట్రమ్ముగా
నెనిమిదేండ్లక్రితము జనన మందె
నాంధ్రదేశ మొకటియై హైదరాబాదు
భాగ్యవశత ముఖ్య పట్టణముగ.

సీ॥ తన అతిలోక సౌందర్యమ్ము వీక్షించి
అనిమిష స్థితి సురాంగనలు పొంద
తన ఎల నవ్వు జ్యోత్స్నల గాంచి సిగ్గుతో
వెలవెల బారి జాబిలి కృశింప
తన అసమాన నృత్యప్రౌఢి తిలకించి
అచ్చరలేమలు మెచ్చుకొనగ
తన మనోహరగానమున వీను లలరంగ
జనులెల్ల పారవశ్యమును పొంద
ప్రణుతి కెక్కిన నిత్య సౌభాగ్యవతికి
భాగ్యమతికి వినిర్మల ప్రణయవతికి
ప్రేమచిహ్నమ్ము గాగ నిర్మింపబడిన
భాగ్యనగరము హైదరాబాదు నేడు

సీ॥ అపర విరించులౌ నిపుణులచే జీవ
కళ లుట్టిపడు శిల్పఖండములకు
వివిధదేశములలో వెలసిన సంస్కృతుల్
ప్రకటించుచుండు నాభరణములకు
వాక్కులలో కంటె స్పష్టమ్ముగా భావ
ముల వ్యక్తపరచెడు బొమ్మలకును
నాజూకుదనము నాణ్యము గల్గి కనువిందు
గొలుపజాలు పసిండి వలువలకును.
ముందు యోధుడు వెనుకను ముద్దరాలు
గా కనంబడు రాతివిగ్రహమునకును
సదనమై యుండి "సాలారుజంగు" చిత్ర
వస్తుదర్శనశాల ప్రశస్తి గాంచు.

సీ॥ వికచారవిందశోభిత నిర్మలాంభఃప్ర
పూరమ్ములైన కాసారములను
సాయంవిహార సమాయాత జన మనో
హ్లాదప్రద శ్యామల స్థలములు
రాష్ట్రప్రభుత్వ నిర్వహణైక బాధ్యతా
ప్రథిత శాసన సభాభవనములను
అతికుతూహల సమాగత బాల బాలికా
సముచిత కేళికా సాధనముల

గలిగి భూలోకనందన ఖ్యాతి దాల్చి
నిరుపమాన శోభారమణీయ మగుచు
సకల యాత్రికబృందమ్ము సన్నుతింప
తనరు బహిరంగమైన యుద్యానవనము.

సీ॥ ఏ కోటలో తొల్లి యిందిరాదేవి ర
త్నాల రూపమ్మున తాండవించె
ఏ కోటలోన సీతాకాంతు దివ్యద
ర్శనము తానీషాకు మును లభించె
ఏ కోటలో పూర్వ మెలజవ్వనంపు తా
రా ప్రేమవతుల నర్తనము దనరె
ఏ కోట భేదింప నెనిమిదిమాసమ్ము
లౌరంగజేబు సైన్యములు పోరె
ఎచటి లలిత సంగీత సాహిత్య కళలు
తెలుగుసంస్కృతి నందించె దిశల నెల్ల
నట్టి గోల్కొండ శిథిలమై అట్టె నిలిచె
భాగ్యనగరంబునకు సమీపమ్మునందు.

సీ॥ తన తోయముల బవిత్రత గాంచి తెనిగించి
పంచమామ్నాయ పర్వత్రయమ్ము
తన తరంగానిలమ్మున దేలి సాగించి
సంఘసంస్కరణ ప్రశస్తకృషిని
తన ప్రవాహపు టందమును జూచి సాధించి
రమణీయ చిత్రకళావిభూతి
తన జలమ్ముల సారమును గాంచి నిర్మించి
అతి లాభదాయకం బానకట్ట
ఒక్క కవి ఒక్క సంస్కర్త ఒక్క చిత్ర
కారు డొక ''యింజినీరు'' జగత్ప్రసిద్ధి
గాంచ మురియుచు దక్కిణగంగ యనగ
వినుతి కెక్కెను గౌతమి తెనుగు నదిగ.

సీ॥ అంద చందాల యొయ్యారంపు నడలతో
చతురుత్సవముగా సాగు నొకట
గలగలలాడు నిర్మల జలమ్ములతోడ
శ్రవణసుఖమ్ముగా సాగు నొకట
చిరుగాలి వెదజల్లు శీకరాంబువులతో
తనుతాపమును బాపి తరలు నొకట
అత్యున్నత తరంగహస్తాల నభయమ్ము
పొలముల కొసగుచు పోవు నొకట
ఆ మహాబలేశ్వరమున నవతరించి
మెట్టిన పవిత్రమౌ తెల్గుమట్టి నెల్ల
రత్నగర్భ నొనర్చి స్వర్గమునుగూడ
కేలి సేయించు రాణి మా కృష్ణవేణి

ఉ॥ ఆయమ నిత్యనూతన ర
సాత్మక కావ్యలతాంగి భంగి నా
ప్యాయత పల్లవింప బహు
శార్ద్ర పరిస్ఫురణమ్ము శోభిలన్
హాయిగ కౌతుకమ్మున ప్రి
యాభిముఖమ్ముగ సాగుచుండి దీ
ర్ఘాయుతులైన ఆంధ్రులకు
సర్వవిధమ్ముల మేలు గూర్చెడిన్.

సీ॥ పదియు నెన్మిది శతాబ్దముల నా డెచ్చోట
బౌద్ధ విద్యాలయ ప్రతిభ విరిసె
నాగార్జునుని బోధనామృతం బెచ్చోట
శాంతిదాయక మౌచు జాలువారె
ఆ బుద్ధదేవు మహాచైత్య మెచ్చోట
తరతరాలుగ పవిత్ర మ్మొనర్చె
బౌద్ధ కళాఖండభాగ్యమ్ము లెచ్చోట
చిత్తనిశ్చలత భాసిల్లజేయు
నదియె నాగార్జునునికొండ; అచట నేడు
విజయపురి పట్టణం బభివృద్ధి గాంచె
రాత్రివేళల రాలు తారకలొ యనగ
దీపపంక్తులు వింతదీధితులు గురియ.

# సంక్రాంతి

నాయని కృష్ణకుమారి

సంక్రాంతి ప్రతిసంవత్సరమూ జనవరి 14 వ తేదీనే వస్తుంది. ఇది అన్ని పండుగ్గల్లా కాకుండా సూర్యసంచారాన్ననుసరించి వచ్చేపండుగ కావడంవల్ల యిలా ఒకే తేదీన రావడం జరుగుతున్నది. దీన్నే తెలుగు మాసాలలోకీ, తిథులలోకీ మార్చి చూస్తే మాత్రం, ఒకసారి పుష్యమాసంలో వచ్చే సంక్రాంతి, మరోసారి మాఘమాసంలో రావచ్చును. 'సంక్రాంతి' అన్న మాటకు సంక్రమించడం అనిగదా అర్థం! మేషాది రాసుల్ని చలనక్రమంలో ఒక్కో నెల ఒక్కో రాసిని సూర్యుడు సంక్రమిస్తాడు. ఆవిధంగా మనకు ప్రతినెలా ఒక సంక్రాంతి వస్తూనే ఉంటుంది. ఇలా వచ్చే పన్నెండు సంక్రమణాల్లోనూ, ముఖ్యమైనది మకరరాసిలో సూర్యుడు సంక్రమించిన సమయం. అదే ప్రతి సంవత్సరం జనవరి 14 న వచ్చే సంక్రాంతి.

సూర్యుని అయనక్రమాన్ని శాస్త్రజ్ఞులు రెండు రకాలుగా విభజించారు. కర్కాటకం నుండి ధనుస్సువరకూ ఉన్న సూర్యసంచారాన్ని దక్షిణాయనమనీ, మకరం మొదలుకొని మిథునంవరకూ ఉన్న సంచారాన్ని ఉత్తరాయణమనీ అన్నారు. ఉత్తరాయణం, హేమంతంలో మొదలై, శిశిర, వసంతాలను కలుపుకుంటుంది. దక్షిణాయనంలో, గ్రీష్మ, వర్ష శరదృతువులు మూడూ ఉంటవి. ఎండా, వానా, చలీ మూడూఉన్న దక్షిణాయన కాలంకంటే హేమంతం ఉన్నా తర్వాత వచ్చే ఆహ్లాదకరాలయిన శిశిర, వసంతాలు కలిగిన ఉత్తరాయణమే, ఆరోగ్యదృష్ట్యా మంచిది. ఎండా, వడా, యీదరగాలీ, చెమ్మా వంటి లక్షణాలులేక, పొడియారిన వాతావరణంలో, ఆహ్లాదకరమైన ఉష్ణమూ, చల్లనిగాలీ, కలిగిన యీ ఉత్తరాయణకాలం జనులకుఆరోగ్యప్రదమైనదే - ఈ అంశ మనస్సులో ఉంచుకొనే గాబోలు, పెద్దలు దక్షిణాయనాన్ని మనుష్యులకుశుభం కోరని పితృయానంగానూ, ఉత్తరాయణాన్ని, పుణ్యప్రదమైన దేవయానంగానూ పేర్కొన్నారు. భీష్ముడంతటివాడు అంపశయ్యపై దక్షిణాయనంలో పడినా, ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకూ ప్రాణాలను వదలలేదనే కథకూడా ఉన్నది. ఈ కథనుకూడా, ఒక ఆధారంగా ఆర్యులు మొదట ధృవ ప్రాంతంలో ఉండేవారనీ, అక్కడ దక్షిణాయనం ఆరునెలలూ ఒకరాత్రీ, ఉత్తరాయణం ఆరునెలలూ ఒకపగలూ, కావడం వలన, చీకటి దినాలయిన దక్షిణాయన దినాలను అపవిత్రంగా చూచేవారనీ శ్రీ తిలక్ గారు ప్రతిపాదించారు. వెలుగుకోసం అఱ్ఱులుచాస్తూ, ఉత్తరాయణ పుణ్యకాలంలో సూర్యకిరణాలు కంటబడగానే, పండుగచేసుకొనేవారనీ, ఆ పండుగయొక్క చిహ్నమే యీ నాటికీ మనకు, సంక్రాంతిగా మిగిలిపోయిందనీ, వారు అభిప్రాయపడ్డారు. ఆ విషయాలలోనికి, లోలోగా దిగి, చర్చించాలనుకుంటే, వారి వైదిక నిలయమూ, శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారి హిందువుల పండుగలూ వంటి గ్రంథాలను చూడవచ్చును -

కాని మనకు తెలిసిన సంక్రాంతి పండుగను పండుగగా, ఆనందోత్సాహాలతో గడుపుకోవడానికిము ఖ్యమైనకారణం నాకు ఒకటే కనిపిస్తున్నది - మకర సంక్రమణంనాటికి, దేశంలో వివిధ ప్రాంతాలలో పంట పండి యింటికివస్తుంది. వ్యవసాయదారుని యిల్లు, ధాన్య సమృద్ధితోటీ, తన్మూలంగా ధన సమృద్ధితోటీ కలకలలాడుతూ ఉంటుంది, నెల మొదటివారంలో వచ్చిన పండుగకీ, ఆఖరు రోజుల్లో వచ్చిన పండుగకీ నెలసరి జీతగాని దృష్టిలోఉన్న భేదమే ఈ పండుగకీ, మిగతాపండుగలకీమధ్య వ్యవసాయదారునికి కనిపిస్తుందనడంలో విప్రతిపత్తి యేమీలేదు.

తమ స్వార్జితమైన పంటను, అనుభవించటానికి ముందు. తమ ఆనందాన్ని నలుగురికీ వెల్లడిచేయడమూ, ఈ ఫలాన్ని పొందడానికి సహకరించిన పనివాళ్ళనూ, పాలెగాళ్లనూ సంతోషపెట్టడమూ, పశువుల్ని అలంకరించి, విశ్రాంతి యిచ్చి తమ కృతజ్ఞత చూపుకోవడమూ, యీ పండుగనాడు ఆచరించే విధి విధానాలవల్ల సూచింపబడుతున్నవి,—.

తమిళ, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్రాలలోనూ, ఉత్తరప్రదేశంలోనూ ఈ పండుగ వ్యావసాయికమైన పండుగే - దీని ప్రాముఖ్యాన్ని విస్మరించకుండా, అందరూ దీన్ని

ఆచరించడం జరుగుతున్నది. కానిపండుగ పద్ధతిలో కొన్నికొన్ని స్వల్పమైన భేదాలు ఉన్నమాట నిజమే.స్థలభేదంవల్లా, మనుష్యుల జీవన విధానంలోని భేదంవల్లా ఇటువంటి స్వల్పమైన మార్పులు కనపడడంలో అసమంజసత్వంఏమీలేదు–ఈ దృష్టిలో వేరు వేరు ప్రదేశాలలో ఈ పండుగ చేసే పద్ధతిని గమనించడం ఆహ్లాదకరంగా ఉంటుంది.

ఆంధ్ర కోస్తాజిల్లాలలో : ఈ ప్రదేశానికంతటికీ ఇది పెద్ద పండుగ. అందుకే దీన్ని 'పెద్ద పండుగ' అనికూడా విశేష నామంతో వ్యవహరిస్తారు. మకర సంక్రమణానికి నెలముందుగా ధనుస్సులో సూర్యుడు ప్రవేశించిననాటినుండీ సంక్రాంతి నెలను ఈ దేశపువాళ్ళు అరంభం చేస్తారు. దీన్నే "నెలపెట్టడం" అని అంటారు. ధనుర్మాసారంభం నుండీ హరిదాసులు; బంతిపువ్వులు చుట్టుకుని, నామాలు తీర్చిదిద్దుకొని తళతళా తోమిన రాగిచెంబులతో ఇంటింటికీ హరిని కీర్తిస్తూ తిరుగుతారు. కన్నె పిల్లలు కంచెల మీదా, పెరళ్ళలోనూ లభించే గుమ్మడి పువ్వుల్నీ ఆవుపేడనూ సంతరించుకొని గొబ్బిళ్లు తీరుస్తారు. సంక్రాంతి పర్వసమయానికి ముందురోజు 'భోగి'. 'భోగి' అన్న పేరు వెనుకనున్న చరిత్ర యేమిటో విచారించవలసినదే. తెల్లవారక ముందే వేసిన భోగిమంట చుట్టూ ఇంటిల్లపాదీ చలి కాచుకుంటుంటే, తల్లులు, పిల్లలకు తలంట్లు కానివ్వడం కొత్తబట్టలు కట్టబెట్టడం జరుగుతుంది. ఆ రోజు పిండివంటలతో భోజనం చేస్తారు. సాయంవేళ మూడేళ్ళలోపు పిల్లలు ఇంట్లో ఉంటే వారికి భోగిపళ్ళు పోస్తారు. రాగినాణేలూ, రేగుపళ్ళూ, నానబెట్టిన సెనగలూ కలిపి బిడ్డమీదనుండి దిగబార పొయ్యడమే పళ్ళు పొయ్యడం – ప్రతి ఆడపిల్లా, భోగినాడు బొమ్మలకొలువు విధిగా పెట్టుతుంటుంది. పెళ్ళయిన పిల్లలు, గొబ్బిని గౌరిగా పూజించి మూడవనాడు, జల ప్రదేశానికి తీసుకుపోయి నీళ్ళలో వాల్లాడించి వస్తారు.

సంక్రాంతినాడు తలంట్లులేవు. ఇంటి యజమానురాలు గొబ్బిపిడకలతో దాలి చేసి దానిమీద పాలు పొంగిస్తుంది. కొత్తబియ్యం కొత్తబెల్లం కలిపి పొంగలి వండుతుంది. ఆ రోజు 'భూకామందు' తనక్రింద పని చేసేవాళ్ళను, కానుకలచేతా, దానాలచేతా, విందుభోజనాలచేతా తృప్తి కలిగింప ప్రయత్నిస్తాడు.

మరునాడు కనుము. ఇది పశువుల పండుగ. దీన్నే తమిళంలో, "మాట్టు పొంగల్" అంటారు. పశువుల్ని రకరకాలుగా అలంకరించి రంగులు పూసి, బంతి పూలదండలు చుట్టి ఊరేగిస్తారు. ఆ రోజు రైతు పశువునుచేలో పని చేయించడు. "కనుమునాడు కాకైనా మునుగుతుంది" అనీ, "కనుమునాడు కాకైనా కాలు కదపదనీ" రెండు సామెతలు వ్యవహారంలో ఉన్నవి. ఈరోజు ప్రతివాళ్లూ తలారా ఎందుకు స్నానం చేయవలెనో, ఎందుకు ఎక్కడికీ వెళ్ళకూడదో, విచారించి తెలుసుకోవలసిన విషయాలు. మర్నాడు ముక్కనుము. ఇది మాంసాహారుల పండుగ. ఆరోజు కూలిజనం బాగా తాగి, తిని, పండుగవల్ల కలిగే ఆనందాన్ని అనుభవిస్తారు— ఈ ఆచారాల్లో ఎక్కడా సూర్యసంచారభేదాన్ని గురించీ, ఉత్తర దక్షిణాయనాల మంచిచెడ్డలనుగురించీ ఎటువంటి సూచనా లేదు. కాని, ధనుర్మాసం ఆరంభించినదగ్గరనుండీ ఇంటి యిల్లాండ్రు వాకిళ్ళలో పెద్దముగ్గులు వేస్తారు. ఆ ముగ్గులలో అన్నీ గీతలతో కూడిన ద్వారాలూ, గడులూ, నాగబంధాలూ, చక్రబంధాలూ వంటివేకాని, చుక్కలముగ్గులు ఎక్కువగా కనిపించవు. సంక్రాంతినాడు "వైకుంఠ వాకిలి" అనే ముగ్గూ, "రథమూ" వేస్తారు. 'వైకుంఠవాకిలి' కి అన్ని వైపులా ద్వారాలు ఉంటవి. బహుశా సప్తాశ్వరథారూఢు డైన సూర్యుడు, దక్షిణాయనం పూర్తిచేసుకొని ఉత్తరాయణాభిముఖు డవుతాడనీ, అందువల్ల జను లందరికీ, ఆ పుణ్యకాలంలో వైకుంఠ ద్వారాలు తెరుచుకుంటాయనీ చెప్పడం యీ ముగ్గుల ఉద్దేశ్యం కావచ్చును— ఉత్తరాయణాన్ని గురించి యీ మాత్రపు సూచన కూడా మిగిలిన ప్రజలలోని ఆచార వ్యవహారాలలో కన్పించదు. సంక్రాంతికీ, ముగ్గులు పరవడానికీ ఏమిటి సంబంధం అని ఆలోచిస్తే చిత్రంగానే ఉంటుంది. ఏ పండుగలోనూ లేని ప్రత్యేకత ఈ పండుగలోనే ముగ్గులకు కలిగింది. హేమంతంలో బాగా ముదిరిన సీతంవలన జలుబూ, దగ్గూవంటి అనారోగ్యాలు కలగడానికి వీలుంది. ఆరోగ్య కారకాలయిన సూక్ష్మజీవులను సున్నంపూటు నాశనం చేస్తుందిగదా అనే జ్ఞానమే, ముగ్గును అలా అందంగా వాకిటిముందు పరచడంలో అంతరార్థమేమో అని నా ఉద్దేశ్యం—.

రాయలసీమ ప్రాంతంలో ఈ భోగినాడు మంట వెయ్యరు, కాని పిల్లలకు భోగిపళ్ళు పోస్తారు. సంక్రాంతినాడు, పొంగలికి బదులుగా సజ్జలు తొక్కి బెల్లంతో కలిపి రొట్టెలు చేస్తారు. అందులోకి ఆ రోజుల్లో దొరికే అన్ని కాయగూరలూ కలగలిపి కూర చేసుకుంటారు — ధనుర్మాసారంభం నుండీ గొబ్బిళ్ళుపెట్టే ఆచారంలేదుగాని, పండుగ రెండురోజులూ, గోమయంతో ముద్దలు చేసి గుమ్మానికి అటూ ఇటూ ఉంచుతారు— కనుమునాడు పశువుల్ని అలంకరించే ఆచారం వీళ్లకు ఉన్నట్లు లేదు. అలగాజనంమాత్రం, ఆవేళ తిని, తాగి సంతోషపడడంకద్దు.

తెలంగాణా ఆచారాల్లో, కర్నాటక మహారాష్ట్రల ఆచారప్రభావం కనిపిస్తుంది. కోస్తా జిల్లాలలోని భోగిమంట కానీ, గొబ్బిళ్ళు పెట్టడంకానీ వీరికి అలవాటులేదు. కాని, భోగి, సంక్రాంతి దినాలలో, మూడుగానీ, ఐదుగానీ 'గొంతెమ్మ' లను (గొబ్బిళ్లు) చేసి, వాటిని, పసుపూ కుంకుమా, గరికలతో అలంకరించి వాకిట్లో ఉంచుతారు — సంవత్సరంలోపు పిల్లలకు భోగినాడు సాయంత్రం పళ్లుపోసే ఆచారాన్ని వీళ్ల 'బోతపొయ్యడం' అంటారు. కేవలం రేగుపళ్ళూ పైసలూ మాత్రమేకాక, జీడిపళ్ళూ నవధాన్యాలూ కూడా వాటిలో కలపడం యిక్కడి ఆచారం– కోస్తా జిల్లాలలో సంక్రాంతినాడు పొంగించే పాలను, ఇక్కడివాళ్ల భోగినాడే పొంగించడం కద్దు. ఆరుబయట సూర్యాభిముఖంగా పేర్చిన పాలదాలికి ఎదురుగా ఒక పీట వేసి పీటమీద రక్తచందనపు బొమ్మ (తిరుపతి చెక్కబొమ్మ) పెట్టి, దానికి సువర్ణాభరణాలతో అలంకారం చేసి దాన్ని పూజిస్తారు. ఇక్కడ రక్తచందనపు బొమ్మకు గల ప్రాముఖ్యం విచారించవలసినదే. కాని, రథసప్తమినాడు ప్రతివాళ్లూ చేసే సూర్య పూజలో, సూర్యప్రీతికి అర్పించే చందనం, రక్తచందనమే అయివుండాలని ఒక వాడుక వుంది—కాబట్టి సూర్యుడికీ, రక్తచందనానికీ ఉన్న సంబంధం విచార్యం—కోస్తాజిల్లాల 'పొంగలి'తో పాటు, ఈనాడు వీళ్ల, మహారాష్ట్ర కర్ణాటక దేశాచారాలవల్ల ప్రభావితులై, సజ్జలూ నువ్వులూ కలిపినరొట్టెలు చేస్తారు. అన్నిరకాల కాయగూరలూ కలగలిపివండిన కూర చేస్తారు. వాటిలో, వెన్నా, బెల్లమూ కలిపి భుజించాలనేది యిక్కడి ఆచారం. ఇక్కడి సంక్రాంతి మాంసాహారులకు, ఆ ఆహారం తప్పనిసరిగా భుజించే పండగ. కాని, ఆరోజు విధిగా వీళ్ల పప్పూ బియ్యం, కలిపి పులగం వండుకుంటారు. 'కనుము' అన్న దాన్ని యిక్కడ 'కరి' అని వ్యవహరించడం కద్దు. దక్షిణాయనంలో ప్రజలకు కలిగిన పీడా పరిహారార్థమై, ఆ రోజున ప్రతివాళ్ళూ పసుపుపచ్చని వస్త్రాలు ధరిస్తారు. అనగా పసుపులో ముంచిన వస్త్రాలు ధరించాలని ఆ ఆచారంయొక్క ముఖ్యోద్దేశం. బహుశా కోస్తా జిల్లాలలో, ఇంటిముందు సున్నపు ముగ్గు పరవడానికీ, తెలంగాణాలో, పసుపులో ముంచిన వస్త్రాలు ధరించడానికీ, కారణం ఒకటే కావచ్చునన్నది నా యూహ. పసుపూ, ముగ్గూ రెండూ, క్రిమి వినాశక వస్తువులే — పల్లెటూళ్ళల్లో, ఆ రోజున పశువుల్ని బండ్లకు కట్టి "బండ్లు తరమడం" అనే వేడుక చేస్తారు. ఇది యించుమించు కోస్తా జిల్లాలలోని, కోడి, పొట్టేలు పందెములవంటి సరదా—

తెలుగు దేశానికి పొరుగు రాష్ట్రమైన మహారాష్ట్రంలో ఈ పండుగ చేసే పద్ధతి, మరో విధంగా ఉంటుంది. అక్కడ సూర్యుని అయనభేదాన్ని తెలిపే సూచన ఆ ఆచారాల్లో కనిపించదు. కేవలం వ్యవసాయకమైన పండుగగానే యిది జరుపబడుతుంది. భోగినాడు మంట వేసే ఆచారం ఇక్కడగానీ, కర్ణాటక తమిళ దేశాల్లోగానీ కనిపించదు. ఈ పండుగ నాడు, స్త్రీలు, తమ సౌభాగ్యాన్ని అభివృద్ధి చేసుకోవడానికై చేసే పూజలూ, యిచ్చే దానాలూ గమనింపవలసినవే— ప్రొద్దుటే తలంట్లు అయిన వెనుక స్త్రీలు కొత్త బట్టలతోపాటు, భోగినాడు, విధిగా కొత్త గాజులు కూడా ధరిస్తారు. స్నానం చేసేటప్పుడు నువ్వులు నీళ్లల్లో వేసి కాచి, నువ్వుపిండీ, పసుపూ కలిపి నలుగు పెట్టుకుంటారు. సాయంత్రం, నువ్వులూ, బెల్లమూ, చెఱుకు ముక్కలూ, రేగుబండ్లూ, వేరుసెనగలూ, జాజర గడ్డ— ఇవన్నీ కొత్తకుండలో పోసి, మూత వేసి, తులసి కోట దగ్గర పూజ చేసి, ముత్తైదువులకి ఇచ్చుకుంటారు.

సంక్రాంతినాడు నువ్వులూ బెల్లంతో కలిపిన 'భక్ష్యాలు' చేసుకుంటారు. ఆ రోజు, సజ్జరొట్టె, కలగాయకూరా తప్పకతింటారు. ఈ కూరలో ఎన్ని కాయగూరలు ఆ రోజున కలుప గలిగితే, వారికి అంత సంతానాభివృద్ధి కలుగుతుందనే నమ్మకం కూడా ఒకటి ఉన్నది— సంక్రాంతినాడు 'లూటాయిచ్' అనే ఒక వేడుక వీళ్ల చేసుకుంటారు. నువ్వుల హల్వా, రేగుబండ్లూ, చెఱుకు ముక్కలూ, వేరుశనగలూ, కొబ్బరి ముక్కలూ అన్నీ చేర్చి, వాటితోపాటు, వారివారి శక్త్యానుసారం, వెండి, ఇత్తడి, స్టీలు, కంచు పాత్రలలో ఏదైనా ఒకటి పెట్టి తెలిసినవాళ్ళందరికీ పంచుతారు.

బండ్లలో ఈ సామానంతా సర్దుకుని బహు దూర ప్రదేశాలకు కూడా పోయి యిచ్చిరావడం వీళ్ళ కొక వేడుక. ఎవరెక్కువ పంచగలిగితే, వాళ్ళకంత గొప్ప. కొత్తగా పెళ్ళయిన పిల్లకు, వెండి గిన్నెలో నువ్వులూ బెల్లం పెట్టి యిస్తారు. పెళ్ళికొడుకు మెడలో, నువ్వుల నక్షత్రాలతో చేసిన హారాలు వేసి ఆనందిస్తారు. పిల్ల అత్తగారు, ఆ రోజున నల్లని చీర, లోపల నువ్వుల నక్షత్రాలవలె తెల్లగా మెరిసే చుక్కలు కలదాన్ని తప్పక పిల్లకు ఇవ్వవలసిఉంటుంది. ఈ రోజు ప్రతి ఒక్కరూ తమ స్నేహితులకు నువ్వులూ బెల్లం యిచ్చి "తిల్ గూడ్ గ్యా, ఆణ్ గోడ్ బోలా" అంటారు. అనగా, ఈ నువ్వులూ బెల్లం తీసుకొని, మధురమైనమాటలు చెప్పండి.–" అంటే స్నేహం మధురంగా ఎడతెగకుండా

ఉండాలని పరస్పరం జ్ఞాపకం చేసుకోవడానికి వీరు ఈ పండుగను ఎన్నుకున్నట్లు కనిపిస్తుంది. ఉత్తర హిందూదేశంలో ఇలా స్నేహాన్ని జ్ఞాపకం చేసుకునే రోజు, వాళ్ళకు, హోలీ నాడు వస్తుంది. మహారాష్ట్రిలో 'కరి' కి ప్రాముఖ్యం లేదు.

మైసూరు కన్నడిగుల ఆచారాలు కూడా ఇంచు మించు మహా రాష్ట్రాచారాలతో కలవడం జరుగుతున్నది. భోగినాడు వీరూ ముత్తైదువలకు వాయనా లిస్తారు. కాని, ఆ వాయనాలు కొత్తకుండలలో కాకుండా, చేటలలో పెట్టి యివ్వడం యిక్కడి ఆచారం. మహారాష్ట్రిలు చేసే 'టాటాయిచ్'కి ప్రతిగా వీళ్ళు 'ఎళ్‌బీరు' అన్న వేడుకను చేస్తారు. 'ఎళ్‌బీరు' అనగా 'నువ్వులు పంచడం. నువ్వులూ, బెల్లం, చక్కెర అచ్చులూ, వేరుసెనగ అన్నీ కలిపి భగవన్నివేదన ఐన వెనుక, వాటిని, ఎండుకొబ్బరి చిప్పలలో ఉంచి, ప్రతి వారికీ పంచువారు. ఈ చిప్పలపైని నల్లని పొర గీరివేసి, పై భాగంలో రకరకాల బొమ్మలూ, లతలూ చెక్కి చక్కగా తీర్చి మరీ పంచుతారు. వీటిలో శక్తి కలవాళ్ళు చిన్న పాత్రలను చేర్చడం కూడా కద్దు — వీళ్ళకుకూడా భోగినాడు సాయంత్రం పళ్ళు పొయ్యడం ఉంది. దీన్ని వీళ్ళు "హాళ్లిరె" అంటారు. మానికకు పసుపు ఎఱ్ఱమన్ను పూసి, లోపల మరమరాలు, రేగుబళ్ళు, చెఱుకుముక్కలు, హరిబూట్, సయాపైసలు కలిపి పోసి, ఆ మానికలో పిల్లల తలపై వాటిని గుమ్మరించడం వీరి ఆచారం.

తెలంగాణా ప్రాంతాలకు చెందిన కన్నడిగులకు, మైసూరియన్లకంటే విభిన్నంగా భోగినాడు, సజ్జరొట్టెలూ, కలగలుపు కూరా చెయ్యడం బహుశా మహారాష్ట్రాచారాన్ని బట్టివచ్చిఉండవచ్చు. వాళ్ళలాగే సంక్రాంతినాడు నువ్వులూ బెల్లం కలిపి భక్ష్యాలు చేస్తారు. 'కుసురెళ్ళు' (నువ్వుల నక్షత్రాలు) తో హారాలూ అవీ చేసి నవ దంపతుల్ని అలంకరిస్తారు.

తమిళదేశంలో, భోగి మంట లేదు. సంక్రాంతి రోజున, చెఱుకు మొక్కలనూ, అరటి పిలకల్నీ సూర్యకాంతిలో నిలబెట్టి పూజచేసి, పొంగలి వండుతారు. కనుమ నాడు మూడురకాల అన్నాలు చేసి ఆరుబయట పెట్టి, జంతువులకూ, పక్షులకూ ఆహారం పెడ్తారు. మున్యాశ్రమాలలో నీవారాన్నీ పిండతతుల్నీ భూతబలిగా వాకిటి ముందుపచరించే ఆచారపు ఛాయలు ఈనాడు వీళ్ళు అర్పించే యీ అన్నపు ముద్దలలో కనిపించగలవు — బ్రాహ్మణ కుటుంబాలలో, సంక్రాంతినాడు, పెద్దలకు తర్పణా లిచ్చేఆచారం కనిపిస్తుంది. ఆరోజు కందిపప్పు వండరు. బ్రాహ్మణులకు కూష్మాండ దానం విధిగా ఇస్తారు. చక్కెర పొంగలి తప్పక చేస్తారు. బ్రాహ్మణ కుటుంబాలలో స్త్రీలు భోగినాడు కలశస్థాపన చేసి గౌరీపూజ చెయ్యడం కద్దు. మూడు రోజులు పూజించిన మీదట, గౌరిని, కనుమనాడు, ఉదక ప్రదేశానికి కొనిపోయి, నీళ్ళల్లో వాల్లాడించడం వీళ్ళ ఆచారం. పైన సర్వ సామాన్యంగా, కనుమునాడు, జంతు ప్రీత్యర్థం పచరించే బలిక్రియను, బ్రాహ్మణ కుటుంబాలలోని స్త్రీలు కొంత పెద్ద యెత్తున జరుపుతారు. సంక్రాంతినాటి రాత్రి అన్నం అందులో పాలు పోసి తోడు పెడ్తారు. కనుమునాడు సూర్యోదయానంతరం, ఇంటిముందు శుభ్రం చేసి గుమ్మడి ఆకులు పరుస్తారు. ఆ ఆకుల చుట్టూ ఇంటి ఆడపడుచులైన పుణ్యస్త్రీలు చేరి, ఒక్కొక్కరూ మూడేసిముద్దలు చేసి ఆకుల మీద పెడ్తారు. అలా పెట్టేముందు, అందరికంటే పెద్దముత్తైదువ తన మంగళసూత్రానికి పసుపు రుద్దుకుంటూ పుట్టింటికీ మెట్టినింటికీ శుభం జరగాలి అంటూ ఆమాట అందరి చేతా అనిపిస్తూ ఈ ముద్దలు పెట్టిస్తుంది— వాళ్లు పెట్టినముద్దలు కాకులు ముట్టుకున్నాక అందరూ వెళ్ళి తలారా స్నానంచేసి నిత్య కృత్యాల్లో ప్రవేశిస్తారు. ఈ తంతు సాధారణంగా, ఆడపిల్లలు, తమ పుట్టింటిలో జరుపుతారు. తలిదండ్రులు, వాళ్ళకు తప్పక బట్టలు పెట్టితీరాలి— ఈ వేళ అన్నీ రకరకాలైన అన్నాలు, అనగా, చిత్రాన్నం, పెరుగన్నం, పరమాన్నం, పొంగలి, పులగం వంటివి వండుతారు. చారు కాయరు. ఆడపిల్లలు, ఆనాడు చారూ అన్నం తింటే, అన్నదమ్ములకు మంచిది కాదనే వాడుక ఒకటుంది. దీనివెనుక నున్న సబబేమిటో విచారించవలసిన అంశం— ఈ రకరకాల అన్నాలను, ఆవేళ సాయంత్రం పెద్దపెద్ద గిన్నెలలో సర్దుకుని, ఏటిగట్టుకో, చెఱువు గట్టుకో వెళ్ళి, అక్కడ అందరూ భుజించి, చీకటిపడ్డవెనుక ఇళ్ళు చేరుకుంటారు. రోజూ అన్నాలు ఇంట్లో తినే అలవాటు కంటే ఆహ్లాదం కలిగించే యీ మార్పులో, నవీనకాలపు 'పిక్‌నిక్'ల ఛాయ లున్నవని చెప్పవచ్చు— మళయాళదేశంలో ఈ సంక్రమణం చేస్తారో చెయ్యరో తెలియరాలేదు. మనకుసంక్రాంతెలావ్యవసాయికపుపండుగో, వాళ్ళకు ఓణమ్ అటువంటిది— క్రిష్టియానిటీ ప్రభావం ఎక్కువగా పడ్డ ఆ దేశస్థులలో, హిందువుల పండుగల స్వరూప స్వభావాలు మరొకరకంగా ఉండడానికి అవకాశంఉంది.

ఉత్తర హిందుస్థానములోకూడా ఈ పండుగ చెయ్యడంకద్దు. కాని సూర్యదేవుడి అయనక్రమాన్ని తెలియజేసే, సూచనలు అక్కడలేవు. హోమాగ్నిని రగిల్చి, ఇంట్లో ఉన్న మగపిల్లల్ని ఆ అగ్నిచుట్టూ కూర్చుండ

పెట్టడం వాళ్ళ ఆచారం. ఆడపిల్లలు సంతోష సూచకంగా, అప్పుడు పాటలు పాడి నృత్యం చేస్తారట. చూడవచ్చినవారి కందరికీ, చెఱకుపానకం ఇచ్చి, నువ్వులతో చేసిన మిఠాయి పంచుతారట. అయితే, అక్కడఉన్న వివిధప్రాంతాల జనులలో ఈ ఆచార వ్యవహారాలు ఎటువంటివో, గమనించినమీదట గాని, వాళ్లు ఈ పండుగను ఏవిధంగా భావించి, జరుపుకుంటున్నారో చెప్పడం కష్టం. హోమాగ్ని వెలిగించడం, మగపిల్లలను "పెద్దచెయ్యడం," అనే యీ ఆచారాలలో, మన భోగిమంటలూ, భోగిపళ్లు పోయడం వంటి ఆచారాల ఛాయలు తొంగిచూస్తున్నా యనక తప్పదు—ఇవన్నీ బహు పరిశీలన మీద చర్చించి నిర్ణయించవలసిన విషయాలు.

ఇన్నిరకాల ఆచారాలు పరిశీలించిన మీదట 'సంక్రాంతి' పండుగను గూర్చిన అంశాల నిలా సమీకరించుకోవడానికి వీలు పడుతున్నది. అవి,

(1) ఇది, దేశం మొత్తంమీద వ్యవసాయదారులకు ప్రధానమైన పండుగగా జరుపబడుతున్నది.

(2) ఆయా ప్రాంతాలలో కొత్తగా పంట దిగి యింటికివచ్చిన వస్తువుల్నే, సంక్రాంతి వేళ వినియోగించడమూ, నలుగురికీ, పంచుకోవడమూ జరుగుతున్నది—ఆంధ్ర ప్రాంతాలలో, కొత్తబియ్యమూ, బెల్లమూ, కన్నడ మహారాష్ట్రిలలో, సజ్జలూ, బెల్లమూ, నువ్వులూ. ఇందువల్లనే యీ పండుగ నేడు ప్రాముఖ్యాన్ని వహిస్తున్నది. ఇవేకాక, ఈ కాలంలో దొరికే, చెఱకూ, రేగుబళ్లూ, హరిబూట్, వేరుసెనగలూ, జీడిపళ్ళూ వంటి వస్తువులుకూడా యీనాడు ప్రాముఖ్యాన్ని పొందుతున్నవి—నువ్వులు బాగాపండే మహారాష్ట్రాది దేశాలలో, ఈ రోజున వాటినే ప్రధానంగా స్వీకరించి, 'సంక్రాంతి'ని 'తిల్ సంక్రాంతి' అని వ్యవహరించడం కూడా జరిగింది — 'నువ్వులు' ఉష్ణాన్ని కలిగించే ద్రవ్యవిశేష మవడంవల్ల, చలికాలంలో వచ్చే యీ పండుగనాడు వాటి ప్రాధాన్యాన్ని గుర్తించడం ఎంతైనా సమంజసం. కాని కోస్తాజిల్లాలలో, 'నువ్వులు' ఒకవిధంగా నిషిద్ధద్రవ్యం. నువ్వులు దానం పట్టేవాడు దొరకడం అరుదు. శ్రాద్ధదినాలలో తర్పణం విడవడానికి పనికివచ్చేనువ్వులను పండుగల్లో వాడడానికి వాళ్ళు సాహసించరు. అందుకే వాళ్ళసంక్రాంతిలో నువ్వులకు ప్రాధాన్యంఇవ్వడం జరగలేదు — మహారాష్ట్రిలు అతిఆప్యాయంగా, "తిల్ గూజ్ గ్యా" అని యిచ్చే నువ్వులహల్వాను, అతి చాదస్తులైన, ఆంధ్రప్రజలు, ప్రీతితో స్వీకరించడానికి సంకోచిస్తారేమో అనుకొనడంలో విప్రతిపత్తి యేమీలేదు.

(3) చలికాలంలో వచ్చే యీ పండుగనాడు, చలిని పారద్రోలే 'మంటలు' వేసుకునే ఆచార ప్రాముఖ్యం గుర్తించదగిందే. కాని, చలి ఎక్కువగా ఉండే ఉత్తర హిందూస్థానంనుండే, యిది దక్షిణానికి దిగుమతి అయివుండవచ్చు ననుకోవడానికి దక్షిణంలో ఈ ఆచారానికి నున్న వైరళ్యం ఒక కారణంగా చూపించవచ్చు.

(4) ధన ధాన్య సమృద్ధితో యజమానితులతూగే రోజుల్లో వస్తున్న యీ పండుగనాడు, ఇంటి పిల్లలు పళ్ళు పోసుకొని ఆనందించడమూ, ఇంటి యిల్లాండ్రు సుమంగళ ద్రవ్యాలను తమ శక్తి కొద్దీ నలుగురికీ పంచుకోవడమూ విడ్డూరం కాదు.

(5) పంట బండించి, యజమానికొరకై శ్రమించిన పశుజాతిని మర్చిపోకుండా రైతు వాటి యెడల తన కృతజ్ఞతను చూపుకోవడమే, కనుము నాటి ఆచారంగా మారిన దనవచ్చు. కేవలం వ్యావసాయికావసరాలకు పనికివచ్చే పశువులయెడనే గాక, ప్రజాసామాన్యం, జంతుసామాన్యం మీద తమకుగల దయావిశేషాన్ని చూపించడం, తమిళనాడు "కనుము" నాటి ఆచారాలలో గుర్తించవచ్చు—

ఈ రకంగా ఈఆచారాలన్నీ 'సంక్రాంతి'ని వ్యావసాయికమైన పండుగగానే రూఢి చేయగలుగుతున్నవి. శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేసినట్లుగా, అయనభేదాన్నీ, దేవయాన ప్రాశస్త్యాన్నీ, గుర్తించుకొని యీ నాటి ప్రజ లీ పండుగను చేస్తున్నారనడానికి వారి పండుగనాటి ఆచారాలలో అటువంటి సూచనలు లేవు— ఒకప్పుడున్నా అవి యేనాడో మఱుగున పడిపోతున్నా యనడానికి, ఇంత చర్చించినమీదట నేను సాహసిస్తున్నాను.






మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే

## టీ

సాటిలేని టీ!

### తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ

అతి మన్నికమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

## టాటా-ఫిన్లే టీ త్రాగండి; ఆనందము అందుకోండి!




ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా - ఫిన్లే టీ దొరుకుతుంది :-

ప్రెస్టిజ్ డార్జిలింగ్
లలిత్ లీఫ్ టీ
మిలాప్ లీఫ్ టీ
బహదూర్ డస్ట్ టీ
షాన్ డస్ట్ టీ




BI-TFN-9-TEL

1964 డిసెంబరు 7 వ తేదీన జరిగిన పతాక దినోత్సవం ఊరేగింపు దృశ్యం






1964 డిసెంబరు 7వ తేదీన జరిగిన పతాక దినోత్సవం సందర్భంలో ముఖ్యమంత్రికి, సైనికులు పతాకాలను ధరింపజేశారు.......

......మరియు కార్మిక, రవాణా శాఖమంత్రికీ సైనికులు పతాకాలను ధరింపజేశారు.





పతాక దినోత్సవం నిధికి గవర్నరు విరాళం ఇస్తున్న దృశ్యం.



రాష్ట్ర గవర్నరు డిశంబరు 4 వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర రెండవ కుటుంబనియంత్రణ మహా సభకు ప్రారంభోత్సవం జరిపారు.



గవర్నరు నవంబరు 12 వ తేదీన కడెం ప్రాజెక్టును సందర్శించారు.

నిర్మల్‌లో పారిశ్రామిక ప్రదర్శనకు గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.





1964 నవంబరు 10 వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు పోచారం జలపాతాన్ని సందర్శించారు.



ముఖ్యమంత్రి నవంబరు 22 వ తేదీన విజయవాడలో అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనాన్ని ప్రారంభించారు.



ముఖ్యమంత్రి డిశంబరు 3 వ తేదీన సిరాపున్నబీ సమా
వేశాన్ని ప్రారంభించారు.

1964 నవంబరు 22 వ తేదీన మచిలీపట్నంలోని ఒక
రోడ్డుకు ఆరోగ్యశాఖ మంత్రి, కెన్నెడీ పేర నామకరణం
చేశారు.



పంజాబులో జరిగిన ప్రమాదానికి గురిఅయిన కారణంగా చాలా కాలం తర్వాత విద్యాశాఖ మంత్రి శ్రీ పి.వి.జి. రాజు, 1964 నవంబరు 25 వ తేదీన శాసన సభ సమావేశానికి హాజరు అయ్యారు.





రష్యన్ వైస్ కాన్సల్ శ్రీ నికొలాయ్స్ నెచేవ్ '64 నవంబరు 23 వ తేదీన సాలార్‌జంగ్ మ్యూజియమును సందర్శించారు.

యు. ఎస్. ఎస్. ఆర్. వైస్ కాన్సల్ శ్రీ నికొలాయ్స్ నవంబరు 23 వ తేదీన ఉస్మానియా విశ్వ విద్యాలయ ఉపాధ్యాయునితో ముచ్చటిస్తున్న దృశ్యం.





1964 డిశంబరు 2 వ తేదీన జరిగిన క్రిషి నాగళ్ల ప్రదర్శనను వ్యవసాయ, ఆహార శాఖల మంత్రి తిలకిస్తున్న దృశ్యం.



శాసన సభ అధ్యక్షుడు డిశంబరు 2 వ తేదీన ఎగ్జిబిషన్ మైదానంలో ఉపన్యసించారు.



నియోజక వర్గాల పునర్విభజన సంఘం వారు నవంబరు 25 వ తేదీన జూబిలీ హాలులో సమావేశమయ్యారు.



1964 నవంబరు 24 తేదీన హైదరాబాదు, ముల్లేపల్లిలో ఉన్న పారిశ్రామిక శిక్షణ సంస్థల్లో ప్రథమ అఖిల భారత పరికరాల పెట్టె బహూకృతి ప్రదాన ఉత్సవం జరిగింది.



ఇరాన్ ప్రభుత్వ సమాజాభివృద్ధి శాఖ డైరెక్టర్ జనరల్ శ్రీ బహిరం ఫార్మ్యాన్, 1964 డిసెంబరు 2వ తేదీన పటం చెర్వును సందర్శించారు.




పటంచెర్వులోని సమాచార కేంద్రాన్ని శ్రీ ఫార్మ్యాన్ సందర్శించినప్పటి దృశ్యం.



# జర్మనీలో క్రిస్మస్ వేడుకలు

క్రిస్మస్ పండుగ సందర్భంలో ఆబెరామ్మర్గో యువకులు ప్రకాశిస్తున్న నక్షత్రమును పట్టుకొని సంగీత పరికరములతో ఉత్సాహకరంగా పాటలు పాడుతూ బయలుదేరారు. ఈ పాటలు ఆలకించిన ప్రేక్షకులు వారిని మిఠాయీలతో బహూకరించారు.



ఆల్పైన్ గ్రామ ప్రాంతాల ప్రజలు సాంప్రదాయ పద్ధతి దుస్తులతో పర్వత శ్రేణులను అధిరోహించి అక్కడి చర్చిలలో క్రిస్మస్ వేడుకలు జరుపుకొంటారు.



క్రిస్మస్ నాటి ఉదయం బెర్క్టెస్ గార్డెన్ ప్రాంతాల నిపుణులైనవారు ప్రాతకాలపు పిస్టల్లను పేల్చి వందన సమర్పణ జరిపిన దృశ్యం.

# శబరి

అరిపిరాల విశ్వం

శా॥ పౌళిందోర్విఁ జరింపవచ్చిన యువ
ప్రాణేశుఁడా? - కాదులే
మౌళీబద్ధజటాకలాపుఁడు - లస
న్మానోజ్ఞశారీరుఁడున్
కేళీకార్ముకధారియై విపినసం
కీర్ణప్రదేశమ్ము లీ
వేళన్ జొచ్చుట కేమి హేతువు? వనీ
వృత్తంబు వీక్షింపనా?

తే॥ ఒక్కఁడే కాదు ప్రక్క నింకొక్కఁ డుండె.
చిక్కని తమాలవృంతంపుఁ జిక్కుదారి
నెక్కడికొ? యీ ప్రయాణంబు?- రక్కసిపొదఁ
జిక్కుకున్నది - చేలంబు - ఒక్కమాటు.

శా॥ పంపాస్నిగ్ధసరోవరాంచలనట
త్ప్రాభాతశోభాతతుల్
వంపుల్ వంపులుగా ధరిత్రిపయిఁ బ
ర్వన్ వచ్చు వా రేమి? నై
లింపుల్ కారుగదా? వనాధ్వములఁ బ్రా
లేయాంశు రోచిస్సులన్
నింపన్ జాలినవార లెవ్వరొకొ? కా
నీ వేచి చూడన్ వలెన్.

మ॥ ఎవరో హో? రఘురామమూర్తి యితఁడే
నేమో? అదెల్లోను - తా
నెవరో? మైథిలి లేక యొంటి సనఁగా
నేలాగు శక్యంబు? - లే
జవరాలిన్ విపినాంతవీథుల విలా
పార్థమ్ముగా వడ — నీ
పవలే యింత భయంపడంగఁ బసిపా
పన్ గానులెమ్మన్నదా?

ఉ॥ మూపున విల్లు నూని తన
ముందట నేగుచు దారిఁ జూపుచున్
కాపున నున్నవాఁ డతఁడు
కాఁడుకదా? ఒక చిన్నతమ్ముఁడున్?
పాపము కా లొకింత పొర
పాటుగ వేసిన - ముండ్లతుప్పలన్
మోపినగాని నెత్తురులు
మూగును — చీరుకపోయి గాయమై.

ఉ॥ శ్రావణనీలనీరదము
శంపను గూడిన భంగి నిద్దఱీ
త్రోవనె వచ్చుచుండి రసి
తోజ్జ్వలరూపములన్ వెలుంగుచున్
రావలె పాదదాసి అను
రాగభరైక మహార్చనావిధుల్
పావనమూర్తి గైకొని కృ
పన్ గన నే నిక ధన్యనయ్యెదన్.

చ॥ ఒక యెదియో విచిత్ర మగు
నూహ తళుక్కున నామె చెంగటన్
వికచనవాబ్జవాసనల
వీచెను - మెల్లఁగ లేచి - సామి - ఊ
రక యిదె రమ్మటన్న యెటు
లన్ జనుదెంచును?- నేనె పోయి వ్రా
లక తన మ్రోల నొక్కతెను
లజ్జితనై యిటు వేచిచూడఁగన్.

తే॥ శబరి యేగెడునంతలో చారురామ
మూర్తి - ముంగిట నిల్చెను - ముద్దుతమ్ముఁ
డైన సౌమిత్రిఁ గూడి - ప్రయాస నించు
నిడుదయూర్పులఁ బుచ్చుచు - నిశ్చలముగ.

ఉ॥ చెంతను నిల్చినాఁడు వన
సీమలె వాకిలి లేని యిల్లుగా
కాంతను గూడి నేటి కిట
కాపుర ముండఁగ వచ్చినట్టి ఆ
శాంతవిశాలకీర్తిగుణ
సాంద్రుఁడు - రాముఁడు - ప్రేమ మీరగా
నింత మరింతఁగా గఁదపి
యించెడి భిల్లపురంధ్రి కోసమై!

తే॥ 'అనద శబరిని - బ్రతుకు రామాంఘ్రులందు
నంకితము సేసి - ఒంటిగా నడవిచారి
సామి యేతెంచు నవ్వడికై మిగిలితి
నెవ్వరో బాబు? మీరు నా యెదుటివారు'?

ఉ॥ వెచ్చని బాష్పబిందువులు
విచ్చిన కన్నులనుండి జారఁగా
'వచ్చినవాఁడు రాముఁడు శు
భం బొనఁగూడుత నీ'కటంచుఁ దా
నచ్చపు జాలి నిండుహృద
యంబునఁ బల్కఁగఁ - భక్తురాలికిన్
దచ్చరణారవిందములఁ
దాల్చె శిరంబున బాష్పవారితో.

తే॥ 'ఎన్నినాళ్ళ నోములపంట నిన్ను గంట
అమ్మ సీతమ్మ రాలేద? నెమ్మనంపుఁ
గమ్మపూఁదావివెంట - రాకానిశాంత
శారదజ్యోత్స్న యగు నవ్వుచాయ వోలె.'

ఉ॥ రాముని కన్నుగల్వ పయి
రానిది - లోపల దాగలేనిదౌ
'ప్రేమవిషాదభావ మగు
పించఁగ! సీతను గోలుపోయితిన్
నా మదినిండ దుఃఖము ల
నంతము గాగఁ జరించుచుంటి - నే
నే - మగువన్ దిగన్ విడిచి
నిల్చితి దిక్కుల దృక్కు లుంచుచున్.

**శబరి -**

తే॥ 'అడవిగుండియపైన నీ యడుగుజాడ
పడినయంతనె - లోన సందడులు రేగి
గడిపినానోయి - కాలమ్ము - కడకు నేడు
జడలు కట్టిన కోర్కె - తా విడిలిపోయె
నడుగు లొత్తెద 'తే' విడివడక మున్నె'

శా॥ ప్రాంచద్భూమిసుతారవాః ప్రణయ శు
భ్రజ్యోత్స్నికా - స్నాతకో
దంచన్మూర్తి పదాంబుజాతములు - కాం
తారోగ్ర వాసమ్మునన్
వించెన్ ఘోర పథాంతరశ్రమను - క
న్నీ రద్ది పైయంటతో
చంచత్ బామ రసౌరభాంకిత మరుత్
సౌఖ్యమ్ము జేకూర్చుచున్.

తే॥ అన్న ప్రక్కన గూర్చున్న చిన్నబాబు
మాటలే రానియట్లు - మో మెటులొ త్రిప్పె
నన్న శబరిని - చిఱునవ్వు లందగింప
లక్ష్మణుఁడు గాంచినాఁడు విలాస మొప్ప.

తే॥ 'నల్లనేరేడుఁ బోలిన నాదు సామి!
నల్లనేరెడు పండ్లివే — నాల్కపైనఁ
బెట్టి - రుచి చూచి, తినుటకై పెట్టుచుంటి
చెట్టు కొక పూవు గాయగాఁ జేర్చితెచ్చి

ఉ॥ ఇచ్చితి నింతకంటె మఱి
యేమియు నీయఁగలేనిదాన - నా
బిచ్చపు టోగిరంబుఁ దిని
పించితి — బంగరు పళ్ళెరాలలో
నచ్చిన వంటకమ్మొకటి
నంజెడి సామికి — నేటి కిట్టులె
పిచ్చివియైన యీ యడవి
పిందెలు కాయలు పెట్టుచుంటిరా.

తే॥ తప్పు గావుము దేవ! నీ దాసురాలి
నెప్పటికిఁ గూడ దయఁ జూచి - యింతచోటు
నీదు పాదాలకడ నిమ్ము - నీకు నాకు
నెన్నిజన్మాల బంధమో? యెఱుఁగనైతి.

తే॥ అడుగు గేహమ్ము విడి సను నాసలేదు
బడుగు దేహమ్ము - లోకముఁ బాసిపోవు
చివరిరోజులు దాపురించినవి నాకు
పవలు రే యొక్కటాయె — ప్రపంచమందు.

తే॥ పట్టలేని మహామోదవార్ధిలోనఁ
గ్రుంకు లిడి 'రామ' దేవునివంకఁ జూడ
శాశ్వతానంద పూర్ణనిశ్వాస మొకటి
సూన్య లోకాంచలాలలోఁ జొచ్చె నపుడు.

# అలంపుర శిల్పవైభవము

గడియారం రామకృష్ణశర్మ

ప్రసిద్ధి బొందిన ప్రాచీనాంధ్ర మహానగరములలో అలంపుర మొకటి. ఈ పట్టణము ప్రస్తుతము మహబూబ్ నగరము మండలములో ద్రోణాచలం - సికింద్రాబాదు రైలుమార్గమున కలదు.

ఈ క్షేత్రము 3 వ శతాబ్దమున హలంపురమని, తరువాతి శాసనములో అలంపుర - హలంపురములని, స్థలపురాణమున హేమలాపురమని పేర్కొనబడినది. సుప్రసిద్ధ శైవ క్షేత్రమగు శ్రీశైలమునకు తూర్పున త్రిపురాంతకము, దక్షిణమున సిద్ధవటము, పశ్చిమమున అలంపురము, ఉత్తరమున ఉమామహేశ్వరము మహాద్వారములుగా ప్రఖ్యాతి నందినవి. ఇవన్నియు ప్రాచీనస్థలములు. అలంపూరును బ్రహ్మేశ్వరక్షేత్రమని, పరశురామక్షేత్ర మని, దక్షిణకాశి అని వ్యవహరించుచున్నారు. కాశీ క్షేత్రముతో దీనికి చాల పోలికలున్నవి.

క్షేత్రమహిమ : చరిత్రకందని ప్రాచీనతమకాలమున వరాహమూర్తి భూమినుద్ధరించిన తరువాత సకల సృష్టిని గావింపగోరి బ్రహ్మదేవు డీ క్షేత్రములో మహేశ్వరుని గూర్చి తపము చేసి ఇచట శివలింగమును ప్రతిష్ఠించెను. అందువలన స్వామికి బ్రహ్మేశ్వరు డను పేరు కలిగెను. మరొకచోట సాధారణముగ కానరాని బ్రహ్మవిగ్రహములు ఈ క్షేత్రమున చాల ఉన్నవి.

పూర్వ మిచట జమదగ్ని తపము చేయునపుడు చిత్తవికారమునకు లోనైన రేణుకాదేవిని చంపునట్లు పరశురామున కాజ్ఞ ఇచ్చెను. అతడు నరికెను. ఆమె శీర్షము చండాలవాటిలో పడి "ఎల్లమ్మ"అను గ్రామ దేవత అయినది. మొండెము "భూదేవి" అను పేర వంధ్యా స్త్రీలచే సేవింపబడుచున్నది.

రససిద్ధమహర్షి ఈ క్షేత్రమున ఆలయ నిర్మాణము చేయుటకై వచ్చి ఇచట క్షేత్ర పాలకులను తపముచే మెప్పించి రసలాభము నొందెను. దానితో పరసువేదిని చేసికొని దివ్యదేవాలయములను నిర్మించెను. ఆ తరువాత శిల్పాచార్యులు నవబ్రహ్మేశ్వరాలయములను, అసంఖ్యాకములైన శివలింగములను ప్రతిష్ఠించిరి. ఈ క్షేత్రమున కోటిలింగము లున్న వని ప్రతీతి కలదు.

చరిత్ర : దక్షిణాపథము వైదికమత వికాసమునకును, శిల్పకళా వైభవమునకును, సకల విద్యలకును పేరుగాంచినది. ఇచటి శిల్పాచార్యులు లోకానుగ్రహ కాంక్షతో ఇహపర సాధకములైన దేవమందిరములను ప్రసాదించినారు. సకలభారతమునే ముంచివేయ సమకట్టిన బౌద్ధ జైనాది నాస్తిక వాహినుల నరికట్టి వైదికమత సముద్ధరణకై దీక్షాకంకణము ధరించినవారు సప్త సార్వభౌములు. వారి అడుగుజాడలలో దక్షిణాపథమున చాళుక్యులు, పల్లవులు వైదిక ధర్మరక్షణకై తీవ్రముగ పోటీపడిరి. దాని ఫలితముగ వైదిక దేవాలయములు, గుహాలయములు వెలసినవి. అలంపురదేవాలయములను బాదామి చాళుక్యులు కట్టించిరి.

వారు ఇతరస్థలములో నిర్మించిన ఆలయములకంటె ఇచటివి మిగుల ప్రశస్తమైనవని కళాభిజ్ఞుల అభిప్రాయము. చాళుక్యులీ ప్రాంతమును 7-8 శతాబ్దములలో పాలించిరి. వారు కట్టించిన ఆలయము లన్నియు ఎర్రయిసుకరాతివి. ఇచట ప్రధానాలయములను చాళుక్యవంశ దీపకుడగు "పరమేశ్వర పులకేశి" పట్టమహాదేవి కట్టించెనని చెప్పుటకు ఆధారములున్నవి. అతనిమనుమడగు వినయాదిత్యుని మహాదేవి యువరాజ లోకాదిత్యునితో ఇచటికి వచ్చి ఆలయ నిర్మాణమును ప్రోత్సహించినది. విజయాదిత్యుడు బాలబ్రహ్మేశ్వరాలయము చుట్టును ప్రాకార బంధమును కట్టించెను. చాళుక్య కులవధువులు శిల్పులను సన్మానించిన విషయము చరిత్రప్రసిద్ధము. ఈ కాలమున లాకుల - కాలాముఖశైవము ప్రాబల్యము వహించియుండెను. శిల్పాచార్యు లందరును రసేశ్వర వాదశైవులు.

ఆ తరువాత ఇచట పల్లవులు, రాష్ట్రకూటులు, కల్యాణీచాళుక్యులు మరికొన్ని నిర్మాణములను చేయించిరి. కాకతీయులు, విజయనగర సార్వభౌములు ఈ క్షేత్రరక్షణకు పాటుబడిరి. కృష్ణదేవరాయల కాలములో ముస్లిముల అత్యాచారమునుండి కాపాడు

టకు దుర్గనిర్మాణము జరిగెను.

చాళుక్యవాస్తుశిల్పములు: వేదకాలము నాటికే భారతీయ వాస్తుశిల్పకళలు మహోన్నతస్థితియం దుండెను. ప్రాచీనకాలమున దేవమందిరములకు కర్ర నుపయోగించు చుండినందున నాటి నిర్మాణము లన్నియు నశించినవి. క్రీ. పూ. 4వ శతాబ్దమునుండియే గుహాలయములు, శిలానిర్మాణములు వెలసినవని విద్వాంసులు తలచుచున్నారు.

భారతీయ శిల్పకళ క్రమ వికాస పరిణామముల నంది ఆరంభ - ఉచ్ఛ్రియ - క్షీణదశల నందినది. ప్రాచీన శిల్పకళ శాతవాహనుల కాలమున విశిష్టస్థాయి నందుకొనెను. అజంతా, అమరావతులలోని ఆంధ్ర శిల్పవైఖరులు తరువాతివానికి మేలుబంతులైనవి. ఆకాలపు శిల్పమున నిరాడంబరత, పురాణగాథలచే మతప్రచారము కానవచ్చును. ఉన్నతాదర్శములతో కూడిన మధ్యకాలీన శిల్పము గుప్త - చాళుక్య - పల్లవులచే వెలసినట్టిది. భారతీయ సంస్కృతి చరిత్రలో ఈ కాలమును స్వర్ణయుగ మందురు. ఈ శిల్పపద్ధతిలో విశిష్టమిశ్రణము, పూర్ణత్వము, కళకు భావముతో సన్నిహితత్వము ప్రధానలక్షణములు. చాళుక్యపద్ధతిలో కట్టబడిన అలంపుర దేవాలయములలో ఆ శిల్పకళాసంపద బాగుగా పోషింపబడినది.

భారతీయ శిల్పకళలో చాళుక్య పద్ధతికి ప్రత్యేకస్థానము కలదు. విభిన్న లక్షణములు గల ఉత్తర - దక్షిణ వాస్తురీతులు సుందరముగ మేళవింపబడుటవలన చాళుక్య పద్ధతి రూపొందినది. ఈ పద్ధతిలో తరవాతి కల్యాణీ చాళుక్యులు, హొయిసలులు, కాకతీయులు కొన్నిమార్పులుచేసిరి. అందు వెనుకటి భావగాంభీర్యము క్షీణించెను. ఆ శిల్పమున అలంకరణభాగము పెరిగెను.

క్షేత్రాధిదేవతలు : ఈ క్షేత్రమున నవబ్రహ్మేశ్వర లింగము లున్నవి. వానిలో శ్రీ బాలబ్రహ్మేశ్వరుడు ప్రధానదైవము. ఈ లింగమును జ్యోతిర్లింగముగా స్థలపురాణము చెప్పెను. దివ్యౌషధీ - యోగాన్ని సంస్కారములందిన ఈ రసలింగము నారాధించినవారికి విశేష ఫలప్రాప్తి అగుటలో సందేహములేదు.

బ్రహ్మేశ్వరాలయమున ఆగ్నేయము నందలి చిన్నగుడిలో క్షేత్రాధిష్ఠానదేవత శ్రీ జోగుళాంబ ప్రతిష్ఠింపబడినది. ఈ మహాశక్తి భారతదేశమునందలి అష్టాదశ దేవీ పీఠములలో వర్ణింపబడిన మహాదేవీపీఠము. ఆదిశంకర భగవత్పాదు లీ క్షేత్రమును దర్శించి దేవీ సన్నిధిలో శ్రీచక్రోద్ధారము చేసినారని పెద్దలు చెప్పుదురు.

బ్రహ్మేశ్వరాలయము నందలి కాలభైరవ - కార్తికేయ, త్రిమూర్తులు, వీరభద్రుడు - సప్తమాతృకలు. హరిహర - పంచాయతన, ఉగ్రనరసింహ మూర్తులు ప్రసస్తములైనవి.

ఈ ఆవరణమునందలి గరుడబ్రహ్మ - స్వర్గబ్రహ్మ, కుమారబ్రహ్మ, విశ్వబ్రహ్మాలయములపై రమణీయ శిల్పము కనులపండువచేయును. వీనితోబాటు ముఖ్యమైనది ఇందలి పురావస్తు సంగ్రహాలయము.

## 'పురావస్తు' సంగ్రహాలయము (మ్యూజియము)

దేవాలయావరణములోని సిద్ధ మంటపములో ప్రభుత్వ పురాతత్త్వశాఖవారు నెలకొల్పిన పురావస్తు సంగ్రహాలయమున్నది. అందు అలంపుర పరిసరాలలో లభించిన దేవమూర్తులను, శిలాశాసనములను తెచ్చి చక్కని పీఠములపై అమర్చినారు. ఈ విగ్రహములన్నియు విలక్షణమైనవి. హైందవ మూర్తి లక్షణముల నధ్యయనము చేయదలచినవారికి ఈ సంగ్రహాలయము విజ్ఞానదాయినియైయున్నది.

భారతీయ శిల్పకళ : ప్రాచీన ఈజిప్టు, గ్రీసు, ఆధునిక యూరోపు రీతులకంటె భారతీయ శిల్పరీతులు విభిన్నమైనవి. సత్తారూపములైన శిల్పకృతులలో ఈజిప్టువారు శుద్ధరేఖా స్థిరీకరణకును, గ్రీకులు దేహసౌష్ఠవ సౌందర్యములకును ప్రాముఖ్యము నిచ్చినారు. కాని భారతీయులు కఠినమైన వస్తువును చెక్కి తీర్చుటలోని వైవిధ్యమును రేఖావిన్యాసముచేతనే సూచింపలేదు. మూర్తికల్పనకు నీతియే జీవమనియు అది వస్తువుపైనుండు రేఖలకు లోనుగాక అన్యతత్వమును సూచించుననియు భారతీయ శిల్పులు గణించిరి. కావుననే భారతీయ మూర్తికల్పనమందు నిమ్నోన్నత వృత్తి విన్యాసభేదములకు ప్రాధాన్యము కానరాదు. వస్త్రాభరణాదులచేతనే నిమ్నోన్నతములు సూచితములగును. విగ్రహమునకు దిక్ - కాల - ఆకాశములతో సంబంధము కల్పించి మనుష్యునిదృష్టి నేత్రగోళములనుండి వెలువడి బాహ్యవస్తువును గ్రహించు నపుడు బాహ్య ప్రపంచమునందుండు మాయావిక్షేప - ఆవరణశక్తి ప్రభేద ప్రభావమును బింబ ప్రతిబింబన్యాయముగా ఇంద్రియ గోచరమగునట్లు చేయుదురు. అందువలన బాహ్య శిల్పముయొక్క ఆనందాంశము ఉపాసకుని ఆత్మానందాంశమునకు ప్రతిబింబమై యుండును. అందువలన మన తక్షణ కళయందు పాశ్చాత్య శిల్పముకంటె ఎక్కువ నైజనైసర్గిక గుణములు ప్రకాశించుచున్నవి. వేదయుగమునుండియు మనుష్యునకును బాహ్యప్రపంచమునకును ఉండవలసిన సంబంధము చూపించుటయే భారతీయ శిల్పముయొక్క ముఖ్యోద్దేశము. ఇదియే భారతీయ శిల్పవైశిష్ట్యము.

దేవమూర్తి లక్షణము: వేద యుగమున విగ్రహములను కర్ర - రాయి - మన్ను రత్నములతో చేయుచుండిరి. "హరప్ప" సంస్కృతిలో మూర్తికల్పనము ఉత్తమస్థితి యందుండెను. ఉపనిషత్తులలో ధర్మశాస్త్రములలో పురాణములలో మూర్తిపూజ, ఆలయ నిర్మాణం విషయము లున్నవి. మౌర్య - శాతవాహనుల కాలములలోను అర్చావిగ్రహములు దేవమందిరములు వెలసినవి. గుప్తసామ్రాట్టుల కాలములో పౌరాణిక తాంత్రిక భావములు పెరిగినవి. మన ప్రాచీన గ్రంథములలో దేవమూర్తి లక్షణములు నిర్ధారింపబడినవి.

శాస్త్రోక్తములైన ప్రమాణముల ననుసరించి చేయబడిన విగ్రహములే పూజార్హములు. భారతీయుల తాళమానములు, ప్రమాణములు ఇతరదేశీయు లనుసరించువానికంటె సర్వోత్తమములైనవని పాశ్చాత్య విద్వాంసులే అంగీకరించినారు.

అలంపురమూర్తులు : అలంపుర శిల్పములలోని ప్రతిమాలక్షణములు, దేవమూర్తి లక్షణములు విశిష్టమైనవి. ఈ శిల్పములకు శైవము మూలాధారము. ఇవి ప్రాచీనశైవ సిద్ధాంతము యొక్క మహోన్నతా దర్శములను ప్రకటించుచున్నవి. విష్ణువులోక రక్షణపోషణ బాధ్యతలు వహించి నందున ఆయనకున్నట్టి అవతార భేదములు శివునకులేవు. ఆకారణమున ఆకాలపు శిల్పి సాధారణముగా వైష్ణవ గాథలను చెక్కినంత విశేషముగా శైవ గాథలను చెక్కలేక పోయినాడు. కాని అలంపుర దేవాలయముల మీద శైవ గాథలు, పంచవింశతి శివలీలా విగ్రహములతో చాలభాగము చెక్కబడియున్నవి. శివునకు సంబంధించిన ఉత్పత్తి లయములకు చిహ్నములుగా గౌరీశంకర విలాసములు, వైరాగ్య సంహార మూర్తులు తీర్చబడినవి. ఇందలి త్రిముఖ మహేశమూర్తి విశిష్టమైనది. ఈశ్వరుని సృష్టి స్థితిలయ కారకత్వములను సూచించును. ఇట్టిదే 'ఏఅ ఫెంటా' గుహాలయమున బృహదాకారముతో కానవచ్చుచున్నది. శివలీలా మూర్తులలో దక్షిణామూర్తి, నటరాజు, భైరవమూర్తి, భిక్షాటనమూర్తి, ధ్యానముద్రా మూర్తి, లకులీశమూర్తి, కల్యాణ సుందరమూర్తి, గంగాధరమూర్తి, కిరాతమూర్తి, త్రిముఖమూర్తి, అర్ధనారీశ్వరమూర్తి, అంగోద్భమూర్తి, త్రిపురాంతకమూర్తి, ఈ రక్త బీజ సంహార మూర్తి, ప్రదోషమూర్తి, ఉమామహేశ్వర మూర్తి ఆ అంగనమూర్తులు దర్శనీయములైనవి.

శివలీలామూర్తుల తరువాత పేర్కొనదగినవి మహిషమర్దనీ మూర్తులు-ఇవి సుమారు పదికిపైగా ఉన్నవి. ఆయాకాలములలో పొందిన క్రమపరిమాణములనవి తెలుపును. సమభంగ, ద్విభంగ, అతిభంగ రతులలోనీ మూర్తులు పల్లవ, చాళుక్య, రాష్ట్రకూట, చోళ శైలీభేదములను వ్యక్తము చేయుచున్నవి. ఇందలి సూర్య విగ్రహములు కూడ చెప్పదగినవే. వీనిలో ఉత్తర దక్షిణ సంప్రదాయములకు చెందినవి కలవు. ఉత్తర పద్ధతిలోని మూర్తులకు పాద రక్షకులుండును, దక్షిణాచార మూర్తుల పాదములకు రక్షలుండవు.

మ్యూజియము నందలి విగ్రహములలో వళ్ళీ సుబ్రహ్మణ్యులు, కార్తికేయుడు, కపిల మహర్షి, చతుర్ముఖబ్రహ్మ, వీరగల్లులు, పైకప్పు బండవీది విగ్రహములు, రక్షక భటులు, దక్షప్రజాపతి, గదాధరుడు, నంది వాహన రూఢులైన శివపార్వతులు పేర్కొనదగినవి. ఈ మూర్తులన్నిటిలో గాంభీర్య సౌందర్యాది గుణములు, శాంతప్రసన్నతాది భావములు ప్రస్ఫుటముగ గోచరించును.

విడిగా దక్షిణపుగదిలో ఉంచబడిన నగ్నకబంధమూర్తి, ప్రత్యేకముగా పేర్కొనదగినది. హరప్పత్రవ్వకాలలో లభించిన 'మాతృ' మూర్తికిని ఈ విగ్రహమునకును పోలికలున్నవని విజ్ఞుల అభిప్రాయము. ఈ విగ్రహమునకు తలలేదు - శీర్షస్థానమున పద్మము, దాని కిరుప్రక్కల రెండుచేతులలో పట్టుకొన్న మామిడిపండ్లు, దుగ్ధపూర్ణములైన వక్షోజములు, ఉత్తానపాదములు తీర్చబడియున్నవి. ఈ విచిత్రమూర్తి శిల్పకళాదృష్టిలో ప్రశస్తమైనది. ఇట్టి మూర్తి నాగార్జున కొండత్రవ్వకాలలో బయల్పడినది. ఏలేశ్వరపు త్రవ్వకాలలో మట్టిది, శిథిలమై లభించినది. రుద్రయామిళ తంత్రమున చెప్పబడిన షోడశీమూర్తులలోని "ఛిన్నమస్తా" విగ్రహముకాదు. ఆ లక్షణము లిందునేవు. ఈ విగ్రహముకూడలి సంగమేశ్వరమునుండి తేబడినది.

అలంపుర శిల్పమూర్తులలో ఎర్రఇసుకరాతితో చెక్కబడినవి బాదామి చాళుక్య రాష్ట్రకూటుల కాలమునను, నల్లరాతివి కల్యాణిచాళుక్య కాకతీయుల కాలములలో చెక్కబడియుండును.

అలంపుర శిల్పకళావైభవమును దర్శించుటకును, దక్షిణాపథ చరిత్ర నవగాహనము చేసికొనుటకును, దేశవిదేశ యాత్రికులు విశేషసంఖ్యలో వచ్చి ఆశ్చర్యానందముల నొందుచుందురు.

# జనవరి ముప్పై

వక్కలంక లక్ష్మీపతిరావు

తే. ఒక యశోకుడు నొక బుద్ధు డొక్క క్రీస్తు
వొక్కరూపయి అతడు రూపొందినాడు!
ఆమహాత్ముడు 'రామ! రామా!' యటంచు
తనువు చాలించి అమరుడై తరలినాడు!

సీ. ఇది శాంతిదేవత యెడద రక్తము చింది
వరదలై ప్రవహించు పాడుదినము
ఇది భారతప్రధాని వదనమ్ము కన్నీట
దోగిపోయిన మహా దుర్దినమ్ము!
ఇది ధర్మదేవత హృదయమ్ము బ్రద్దలై
దురపిల్లిపోయిన దుర్ముహూర్త!
మిది విశ్వమానవ హృదయాన గాఢాంధ
కారముల్ క్రమ్మిన కాళరాత్రి!
ఇది అహింసాతపస్విని హింసతోడ
పట్టపగటనె తెగబడి పొట్ట బెట్టు
కొన్న నాజాతి తలయెత్తుకొనగలేక
తొట్రుపడి క్రుంగిపోయిన దుర్దినమ్ము!

సీ. అమరత్వమును రాక్షసత్వమ్ము దిగద్రొక్కి
శివమెత్తి తాండవించినది నేఁడు!
పరిపూర్ణ మానవత్వము గుండుదెబ్బకు
ఎదురేగి ఒరిగిపోయినది నేఁడు!
రఘుపతిరాఘవ రామసంకీర్తనం
బిలయెల్ల మూగవోయినది నేఁడు!
బోసినవ్వులతాత హాసమ్ము కఱవైన
దని ప్రపంచము తపించినది నేఁడు!
విశ్వమునకెల్ల వెలుగు చూపిన ధరిత్రి
ఇరుల తెరలందు మునిగిపోయినది నేఁడు!
భారతీయ మహాజనావళికి బ్రతుకు
చితికి మాయనిమచ్చ వచ్చినది నేఁడు!

# సంఘము-సారస్వతము

డా. దివాకర్ల వేంకటావధాని

కవు లెంత ప్రతిభావంతు లైనను సంఘము నందలివ్యక్తులే. కావ్యరచనాసందర్భమున వారు భావాంబరవీధీ విహార మాచరించు చుండుట సత్యమే. కాని వారు తాము నివసించు భూమిని, తమసర్వవ్యవహారములకు నవలంబమైన సంఘమును పూర్తిగా విస్మరింపఁజాలరు. అట్లు విస్మరించుట నేల వీడిన సామగును. అందుచే వారి కావ్యములందు ప్రతిభా పాండిత్య ప్రకాశములతోపాటు సంఘ ప్రభావముకూడ కొంత గోచరింపక మానదు. ఏ దేశము యొక్క సాంఘిక చరిత్ర నిర్మాణమునకైనను ఇతర సాధనములతోపాటు కవుల కావ్యములను అపరిహార్యము లగుట యిందుచేతనే. కవులు తమ కావ్యములందు సాంఘికాచారాదులను ప్రత్యక్షముగా ప్రపంచించుట కవకాశము లేకపోవచ్చును. కాని వారు రచించు పాత్రల సంభాషణలందు, ఎడనెడ కావించు వర్ణనల యందు తత్కాల ప్రవృత్తులు, సాంఘికాచార వ్యవహారములు, వేషభాషలు పరోక్షముగా వ్యక్తము లగుచునే యుండును.

ఎల్ల సారస్వతములందును కాలప్రభావమును బట్టియు, కవులయు సహృదయులయు నభిరుచి విశేషములను బట్టియు, క్రొత్త క్రొత్త ప్రక్రియ లుదయించుచుండును. ఒక కాలమున ధర్మప్రధానములైన పురాణములు, ఇంకొక కాలమున రసప్రధానములైన కావ్యనాటకాదులు, వేఱొకకాలమున ప్రబోధప్రధానములైన గ్రంథములు, మరొక్క కాలమున విషయ ప్రధానములైన వచనరచనలు వెలువడుచుండుట కదియే కారణము. ఆంధ్రవాఙ్మయమున తొలియుగములందు పురాణములు, తరువాత ప్రబంధములు, పిమ్మట వచనరచనలు, యక్షగానములు తదనంతరము ఖండకావ్యములు కథలు నవలలు బయలుదేఱినవి. ఈ ప్రక్రియా వైధ్యము కలుగుటకప్పటి సాంఘికాది పరిస్థితు లెట్లెంతవఱకుఁ గారణము లైనవో పరిశీలించుట యీ వ్యాసముయొక్క యుద్దేశము.

ఆంధ్రభాష క్రీస్తుశకారంభ కాలము నుండియు జనవ్యవహారమున నుండెననుట కవకాశ మున్నను అందు కావ్యరచన క్రీ. శ. 11 వ శతాబ్ది తరువాతనే జరిగెననుట సర్వవిదితమైన విషయము. అందు కప్పటి భాషా విద్యాపరిస్థితులు కారణములు. అంతకుపూర్వ మాంధ్రభాష ద్రవస్థితిలో నుండెను. అది సువ్యవస్థితమై యుండకపోవుయే కాక కావ్యరచనార్హమైన విస్తృతియు దానికి లేకుండెను. అక్షరాస్యులు పలువురు సంస్కృత భాషాధ్యయనమునకే ప్రయత్నించుచుండిరి. అప్పుడు పాండిత్యమన్న సంస్కృత భాషాసంధియే. అట్టి పరిస్థితిలో పండితు లెవ్వరు నాంధ్రభాష నభ్యసించుటకుకాని యందు కావ్యరచన చేయుటకు కాని పూనుకొనరైరి. సామాన్యు లెవరైన పాండిత్య హీనులయ్యు ప్రతిభావంతులై కవిత్వము చెప్పియుండినచో నది దేశిమార్గమునకు చెందియుండెను. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రలో పేర్కొన్న వివిధములైన పదములరచన అప్పుడు సాగియుండును. పండితాదరము పొందినవి కాకపోవుటచే నవి చాలవఱకు నష్టములైపోయినవి. అందుచేత నవి యెట్టివో, యందలి భాష యెట్టిదో, అప్పటి సాంఘికాది ప్రవృత్తు లందెట్లు ప్రతిఫలించినవో చెప్పుట కవకాశము లేకున్నది.

క్రీ. శ. 11 వ శతాబ్ది యుత్తరార్ధము నారంభమున రాజరాజ నరేంద్రుని ప్రేరణచే నన్నయభట్టు, వ్యాసుఁడు సంస్కృతమున రచించిన మహాభారతము నాంధ్రీకరించుట కారంభించెను. మహాభారతమునకు పంచమవేదమనుపేరు సార్థకమైనది. చాళుక్య రాజులు వైదిక మతావలంబులు. వేదములును, సంస్కృత భాషా రచితమైన భారతమును పాండిత్యమంతగా లేని సామాన్యజనులకు దుర్బోధము లగుటచే నందలి తత్త్వమును వారు గ్రహించుట కవకాశము లేకపోవుట గ్రహించి రాజరాజ నరేంద్రుఁడు పంచమవేదమైన మహాభారతమును సర్వజన సుబోధమైన దేశభాషలో వెలయించు సంకల్పముతో తన కులబ్రాహ్మణుఁడు మహాపండితుఁడు కవిశేఖరుఁడు నైన నన్నభట్టు నందుకు నియోగించెను. అప్పటి కాంధ్రభాష భారతమువంటి మహాకావ్యము వెలువడుటకుఁ దగిన స్థితిలో లేకపోయినను ప్రతిభావంతుఁడైన నన్నయ సంస్కృతమునుండి పదచ్ఛందస్సంపదను సంగ్రహించి అవ్యవస్థితమైన యాంధ్రభాషకు సువ్యవస్థితమైన రూపమొసంగి

మహాభారత రచన కుపక్రమించెను. అవైదికములైన జైన బౌద్ధాది మతములకుఁ జెందిన ప్రచారకులు దేశభాషలు నేర్చుకొని తమ తమ మతముల మహత్త్వమును సామాన్యజనులకు తెలియునట్లుగా తెల్పివారి నా మతములందుఁ జేర్చుకొనుటకు చేయు చుండిన ప్రయత్నములుకూడ రాజరాజు నన్నయచే మహాభారతము నాంధ్రీకరింపఁ జేయుటకుఁ హేతువని కొందఱు చెప్పుదురు. ఇది యొక్కఁటే యాకాలమున భారతరచన సాగుటకు కారణమైనను కాకపోయినను భాషాపరిస్థితులతో పాటు సాంఘిక మత పరిస్థితులును అందుకు దోహద మొనరించె ననుటలో సందేహములేదు.

నన్నయ మరణానంతర మాంధ్రదేశ మందలి సాంఘిక మతపరిస్థితులలో గొప్ప మార్పు కలిగియుండుటచే నాతఁ డారం భించిన మహాభారత రచనోద్యమమునకును అంతరాయము సంభవించెను. ఆ రోజులలో బసవేశ్వరోపజ్ఞక మైన వీరశైవమతము కన్నడదేశమం దంతట వ్యాపించి క్రమముగా నాంధ్రదేశమును గూడ నావరించెను. సామాన్య జనులే కాక పండితులును కవులును గూడ భక్తి ప్రధానమైన యా మతముచే నాకర్షింపబడి దాని నవలంబించుటయే కాక దానిని ప్రచారము చేయుటకై తమ జీవిత సర్వస్వములను ధారబోసిరి. పండితారా ధ్యుఁడు పాల్కురికి సోమనాథుఁడు నట్టి వారిలో ముఖ్యులు. వీరశైవము వేద ప్రామాణ్యము నంగీకరింపని మత మగుటచే తన్మత ప్రచారమునకై కంకణము కట్టుకొన్న కవులు వేదతత్త్వమును దనలో నిముడ్చు కొన్న భారతమువంకకు దృష్టి సారించక పోవుటలో నాశ్చర్యములేదు.

వీరశైవ మీవిధముగా ప్రబలుచున్న ఆ కాలములోనే దానితో సమానాంతరముగా వైష్ణవమతముకూడ వర్ధిల్లుచుండె ననుటకు కొన్ని తార్కాణము లున్నవి. తిక్కన తాత రామాయణము రచించె నను ప్రతీతి యట్టి వానిలో నొకటి. ఒకవంక వీరశైవులు తమ మతమే గొప్పదని మోక్షప్రదమని ప్రచారము చేయుచుండ వైష్ణవులు వేఱొక వంక తమ మతమే గొప్పదని మోక్షప్రద మని వాదించుచుండిరి. ఈ వాదముల మూలమున 'శివాయ విష్ణురూపాయ శివ రూపాయ విష్ణవే' అను నమ్మకము సన్న గిల్లి శివకేశవు లొండొరులకు విరోధు లను విశ్వాసము ప్రబలిపోయెను. దాని కను గుణముగా శైవులు వైష్ణవులు పరస్పర దర్శనస్పర్శన భాషణాదులను సైత మొజ్జగించి యొండొరులను నిందించుకొనుచు వీలైనచో హింసించుటకుకూడా నొడిగట్టుచుండిరి. అట్టి దుష్కాలమున కారణజన్ముఁడై అవతరించి తిక్కన సంఘమునందలి శైవ వైష్ణవుల ద్వేషభావము పరికించి వారికి సామరస్యము కల్గించుటకు తోడ్పడఁజాలునను నుద్దేశముతో నన్నయ కొంతవఱకు రచించియుండిన భారతాంధ్రీకరణమును మరల నారంభించెను. దాని నతఁడు శివకేశవాద్వైతమూర్తి యైన హరి హరనాథ దేవుని కంకితము చేయుట కూడా నీ యుద్దేశముతోడనే. ఈ కాలము ననే మారన మార్కండేయపురాణము నాంధ్రీకరించెను. తరువాత ఎఱ్ఱా ప్రెగడ అరణ్యపర్వశేషమును రచించి భారతమును పూర్తిచేయుటయే కాక హరివంశ నృసింహ పురాణములను గూడ తెనిగించి పేరు గాంచెను. నాచన సోమనాథు డీ కాలముననే ఉత్తర హరివంశమును రచించి హరిహర నాథునకే యంకిత మిచ్చుట చూడ నాతనికి తిక్కన పైఁగల గురుత్వముతో పాటప్పుడు గల శివకేశవాద్వైత స్థాపనావశ్యకము కూడ వెల్లడియగుచున్నది.

శ్రీనాథయుగమున కొన్ని కావ్యనాటకాను వాదములును కథాకావ్యములును బయలుదేఱి నవి. సారస్వతదృష్టితో పరిశీలింప పురాణేతి హాసముల తరువాత కావ్యనాటకములు మనస్సునకు స్ఫురించును. ఆభావముతోనే శ్రీనాథుఁడు మంచన పినవీరభద్రుఁడు మల్లన సింగనకవులు కావ్యనాటకాదుల యనువాద మునకై ప్రయత్నించిరి. శ్రీనాథుఁడు పెక్కు శైవమతపరము లైన గ్రంథములు వ్రాయు టయు భాస్కర బుద్ధారెడ్డులు రామాయణ మును పోతన భాగవతమును వ్రాయుటయు చూడ నాకాలమున శైవ వైష్ణవ మతములు రెండును సమాన ప్రాబల్యముతోనే సాగు చుండెనని తోఁచును. ఆకాలపు సంఘమున సాహసకార్యములందును వానిని వర్ణించు కావ్యములందును అభిమాన మధికముగా నుండినట్లు కనిపించును. ఆ యభిమానమును తృప్తిపఱుచుటకే విక్రమార్క చరిత్ర, కేయూరబాహు చరిత్ర, భోజరాజీయము మున్నగు కథాకావ్యములు వెలువడి యుండును.

ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథయుగము తరువాత వెలసినది ప్రబంధయుగము. దీనికి స్వర్ణయుగ మను ప్రశస్తి యున్నది. ఈ యుగమున సాహితీ సమరాంగణ సార్వ భౌముఁడైన రాయలవారి పోషణమున పెద్ద నాదికవులు మనుచరిత్రాది ప్రబంధములు రచించి యాంధ్రసరస్వతి కభినవాలంకార ములు ప్రసాదించిరి. ప్రబంధములు శృంగార రసప్రధానములై సరస వర్ణనోపేతములై యాకాలమందలి యాంధ్రుల వైభవ విలాసాదు లను చక్కగా వ్యక్తముచేయును. అవి యప్పటి సాంఘికాది పరిస్థితుల కద్దముల వంటివి. పరాక్రమవంతులు ప్రజారంజకులు నైన విజయనగర సార్వభౌముల పాలనమున నాంధ్రదేశ మప్పుడు సుభిక్షమై సర్వ సంపదలతో తులతూఁగుచుండెను. ఆసంప

దై్వభవ మంతయు మనకు ప్రబంధములలో ప్రత్యక్ష మగుచుండును. ప్రజలు చీకుచింత లేక విలాసలాలసులై జీవితము నానంద మందిరముగా గడపుచుండిరి. ప్రబంధము లందలి శృంగారరసప్రాచుర్య మీ పరిస్థితినే కన్నులకుఁగట్టినట్లు ప్రదర్శించుచుండును. ఆముక్తమాల్యద, ప్రబంధములందలి దశావతార వర్ణనలు, తాళ్ళపాక వారి గేయములు మున్నగునవి వైష్ణవమత ప్రాబల్యమునే సూచించినను శ్రీ కాళహస్తి మాహాత్మ్యమువంటి కావ్యము వంటి కావ్యము లప్పుడు శైవముకూడ ప్రచురముగనే యుండెనని సూచించుచున్నవి.

దక్షిణాంధ్ర యుగమున నాంధ్రసారస్వత మునం దంతకుముందు లేని క్రొత్త సాహిత్య ప్రక్రియలు వెలసినవి. వానిలో వచనైక రచనలు, యక్షగానములు ముఖ్యములైనవి ఈ కాలమున ప్రబంధములు కూడ రచింపఁ బడుచునే యుండెను. అహల్యా సంక్రందనము, సారంగధరచరిత్రము, తారాశశాంకము మున్నగు ప్రబంధములందు శృంగార రసప్రాచుర్యమే కాక నీతిరాహిత్యము కూడ కన్పించును. ఇప్పటికవులు కావ్యప్రయోజనములైన యానందోప దేశములలో నానంద మునకే యెక్కువ ప్రాధాన్యమిచ్చి యుండిరి. అది సిద్ధించినచో నీతి లుప్తమైనను వారి కిబ్బంది లేదు. ఇట్టి రచనలుకూడ నప్పటి ప్రజల విలాస లాలసత్వమును సూచించును. నాయక రాజులు కవిత్వమునకే కాక నాట్య సంగీతములకుఁ గూడ నధికమైన ప్రోత్సాహ మొసంగియుండిరి. ఆకారణముచే నాకళలం దారితేరిన నారీరత్నములకు సైతము వారి యాస్థానములం దధికగౌరవాదరములు లభించు చుండెను. నాయకరాజులకును వారి ననుసరించి తత్కాల ప్రజలకును గల లలిత కళాప్రీతియే యప్పుడు పలువురు వనితలు కవితా సంగీత నాట్యములను ప్రదర్శించుటకును, యక్షగానములను నాట్యగానప్రధానములైన దేశీయ రూపకములు వెలువడుటకును అవకాశము కలిగించెను. నాయకరాజులతోపాటు దక్షిణ దేశమున కేగి యచ్చట స్థిరవాస మేర్పఱచుకొన్న యాంధ్రులకు ప్రౌఢములైన పద్య కావ్యములు సులభ గ్రాహ్యములు కాకపోవుట గ్రహించి యప్పటి రచయిత లా పురాణాదులనే వచనరూపమున వెలయించిరి. అంతకుముందు పద్యకావ్యములందే యించించుక తావు పొందఁజాలిన వచనరచన కప్పు డధికమైన ప్రాధాన్య ప్రాచుర్యములు కలుగుట కిదియొక కారణము. అప్పటి రాజులయు ప్రజలయు నాట్యగానాశక్తి యొకవంక యక్షగానములకును వేఱొకవంక త్యాగరాజ క్షేత్రజ్ఞాదులవంటి గాయకశిఖామణులకీర్తన పదరచనలకును దారి చూపెను.

తరువాత భారతదేశమునకు పాశ్చాత్యులు పలువురు వర్తకవ్యాపారార్థ మరుదెంచుటయు, క్రమముగా నాంగ్లేయు లితరులతోసి రాజని తాము రాజ్యము స్థాపింపఁజాలుటయు సంభవించెను. ఆంగ్లేయుల యేలుబడితో భారతదేశమున నాంగ్లభాషా బోధనమును క్రైస్తవ మతప్రచారమును కొనసాగుట కవకాశ మేర్పడెను. ఆంగ్ల పాఠశాలలలో యువకు లాంగ్లమును, ఆభాషయందలి మహాకవుల రచనలను పఠించి ఆవిధమునైన రచనలు తాముకూడ కావింపవలెనని యువ్విళ్ళూరిరి. దక్షిణాంధ్రయుగమునందును తద నంతరమును పలువురు కవులు స్వతంత్ర భావములును ఉపజ్ఞయు కొఱవడిన అనుకరణ గ్రంథములు రచించుటయు నందు భావములకుఁగాక శబ్దాలంకారములకును అనుకృత వర్ణనలకును ప్రాధాన్య మేర్పడుటయు వారి నూతన కవితారచనాభినివేశమునకు దోహద మొసంగెను. వారు కీట్సు, షెల్లీ, టెన్నిసను, వర్డ్సువర్తు మున్నగు నాంగ్లకవుల రచనలచే ప్రభావితులై ఖండకావ్యములను రచింప మొదలిడిరి. ఈనాఁటి కవితోద్యమమునకే భావకవిత్వమనియు కాల్పనికోద్యమమనియు పేర్లు. కొందఱు యువకవులు ప్రేమ వియోగములను కావ్య వస్తువులుగా గ్రహించిరి; కొంద ఱమలిన శృంగారమును వర్ణించుచు లఘుకావ్యములను వెలయించిరి. స్వతంత్ర భావప్రకటనము, మృదుమధుర పద ప్రయోగము, ఆత్మీయతా ప్రదర్శనము ఈ కవిత్వమందలి ప్రధానలక్షణములు. దక్షిణాంధ్ర యుగమందలి ప్రజల యతిశృంగార లోలతయు, కవుల నీతిరహిత శృంగార వర్ణనలును భావకవుల హృదయములలో తద్విలక్షణమైన నూత్నకవితా సంప్రదాయము నవలంబింపవలెనను భావమును రేకెత్తించియుండును.

ఆధునిక యుగమున నూత్నకవితా ప్రక్రియలతోపాటు వివిధములైన వచన రచనలును వెలువడుట సంభవించెను. అంతకు పూర్వము వెలసిన వచనగ్రంథములు పెక్కు పౌరాణికములు. అందలి రచనకును ఆదియుగములందలి చంపూ కావ్యములందలి వచన రచనకును అంతగా తారతమ్యము కానరాదు. ఆంగ్ల భాషాభ్యసనముతో రచయితలకు చిన్నచిన్న కావ్యములతోఁ గూడిన ఆడంబర రహితమైన విషయ ప్రధానమైన వచనరచన కావింపవలెననియు కథలు, నవలలు, విమర్శలు, వ్యాసములు వ్రాయవలెననియు తలంపు దయించెను. దీనికి యుగలక్షణముకూడ కొంత తోడ్పడి యుండెను. ఇది విజ్ఞానశాస్త్ర యుగము. మానవుల మనస్సులందు హేతువాదమునకును, శాస్త్రవిషయ జిజ్ఞాసకును అధికమైన స్థానము కలదు. ఆకారణముచే నూత్న వచనరచనా విధానమునకు ప్రాబల్యమేర్పడెను. దేశమున

సంఘమును భాషను సంస్కరింపలెనను నుద్యమములు మొలకెత్తును. శ్రీ వీరేశలింగం పంతులుగారి సంస్కరణోద్యమము, రామమూర్తిపంతులుగారి వ్యావహారిక భాషావాదము పలువురి హృదయముల నాకర్షించెను.

క్రమక్రమముగా నాంగ్లేయ పరిపాలనము నెడ భారత ప్రజల హృదయములందు వైముఖ్య మేర్పడెను. స్వాతంత్ర్య పిపాస హెచ్చెను. కాంగ్రెసు సంస్థ యేర్పడుటయు, నాయకులు పలువురు మాతృదేశ దాస్య శృంఖలా విచ్ఛేదమునకై ప్రచారము గావించుటయు దేశమున కపూర్వమైన చైతన్యము కలిగించెను. దీనిచే ప్రేరితులై కొందఱు దేశభక్తి నుద్బోధించునట్టియు దేశనాయకుల శౌర్య త్యాగౌదార్యముల వర్ణించునట్టియు కావ్యములు రచింప నారంభించిరి. ఆంధ్ర దేశమున ప్రత్యేకాంధ్ర రాష్ట్ర స్థాపనాసక్తి చెలరేగుటచే కొందఱు రాష్ట్ర మహత్త్వ వైభవనములను వర్ణించు రచనలు కావింపఁ దొడగిరి. ఈ స్వాతంత్ర్య పిపాస సాంఘికాచారములందును భాషా సంప్రదాయము లందును గూడ గానవచ్చును. ఛందో వ్యాకరణాది నియమములు భావ ప్రకటనమునకు నిరోధకము లను భావమేర్పడుటచే కొందఱా నియమముల నుల్లంఘించి స్వతంత్ర రచనలు కావింప నారంభించిరి. దానికి తోడు పెట్టుబడి దారుల ప్రాబల్యము శ్రామికుల దీనత్వము కవుల హృదయములందు క్రొత్త భావములను రేకెత్తించెను. ఇవన్నియు నభ్యుదయ కవితకు, వచన గేయములకు, అందలి క్రొత్త భావములకు దారి చూపెను.

క్రీ. శ. 19వ శతాబ్ది యర్ధభాగమువఱకును ఆంధ్రమున నిజమైన నాటకము లుదయింప లేదు. ఆ సమయమున పార్శీనాటక సంఘముల వారు ప్రదర్శించెడి హిందీ నాటకములను జూచిన యాంధ్రకవులు తమ భాషలో కూడ నాటకములు రచింప ప్రయత్నించిరి. మొదట సంస్కృతానువాదములే వెలువడినను క్రమముగా స్వతంత్రములైన పౌరాణిక చారిత్రక సాంఘిక నాటకములు కూడ నుదయించినవి. పాశ్చాత్య సంపర్కముచే విషాదాంతనాటకములు, ఏకాంకనాటికలు, రేడియో ప్రసారములకై శ్రవ్యనాటకములు బయలుదేరినవి. ఆధునిక కాలమందలి పాఠకులకు దీర్ఘములైన కావ్యములను, నాటకములను, నవలలను చదువుటకుఁ దగినంత తీరికకాని, యోపికకాని లేకపోవుటయు ఖండకావ్య, కథానికా, నాటికల ప్రాచుర్యమునకుఁ గొంత కారణమయ్యెను.

ఈ విధముగా నాంధ్రవాఙ్మయమును మొదటి నుండియు పరిశీలించిచూచిన నందాయా కాలములం దాయా ప్రక్రియలు వెలువడుటకు సంఘ సమాజ పరిస్థితులుకూడ కొంతవఱకు కారణము లయ్యెనని తెలియ వచ్చును. ఏ దేశమందైనను ఏ వాఙ్మయ మందైనను రచయితలపై సంఘము ప్రభావము కనఁబడక మానదు. కవులు సంఘ వ్యక్తు లగుటయు, సాంఘిక పరిస్థితుల వశులై యుండుటయు నిందుకు కారణము.



# పదినేముత్యాలు

## హేమంత వర్ణనము

శ్లో ॥ నిర్భిద్య ఙ్మారుహాణాం అతిఘనముదరం యేషు గోత్రాం గతేషు
ద్రాఘిష్ఠస్వర్ణదండభ్రమ భృతమనసో హంత ! ధిత్సంతి పాదాన్ !
యైః సంభిన్నే దళాగ్రప్రచలహిమకణే దాడిమీబీజబుద్ధ్యా
చంచూచాంచల్యమంచంతి చ శుకశిశవః తేఽంశవః పాంతు భానోః ॥

— జగన్నాథపండితరాజు.

“ప్రాతఃకాలమునందలి సూర్యకిరణములు, అడవిలో దట్టమైనచెట్ల ఆకులసందులలోనుండి భూమికి దిగజారగా, వాటిని చూచి చిలుకలు స్వర్ణదండము లనెడు భ్రాంతిచేత తమ పాదములను వాటిపైన మోపి నిలువదలచుచున్నవి పాపము; ఇంతేకాక, ఆకుల కొనలందున్న మంచునీటి చుక్కలు సూర్యకిరణములతో కలసియున్నందున నవి దానిమ్మగింజ లనెడి భ్రాంతిచేత చిలుకపిల్లలు తమ ముక్కులతో ఆ నీటిబిందువులను కొరకుచున్నవట.

కం॥ క్షేత్రములు పుండ్రపాకప
విత్రము లగుఁ; గరుడుపారు పెరుగు వరఁగెడున్ ;
గాత్రములు ఘుసృణచర్చా
పాత్రము లగు; హైమనప్రభావ మయారే ॥

మ॥ స్మరదర్పోష్మనివాసభూము లనుచున్ శంకించె నాఁగన్ దమున్
దొరయన్ బోక హిమంబు ముజ్జగములందున్ వ్యాపనం బూన న
బ్బుర మౌనుమ్మకు నిమ్ము లౌకోమలచన్పొంతల్ విజృంభించె ను
ద్ధుర కేంద్రీకృతచూతసాయకమహోదుద్దాంతదుర్గస్థితిన్॥

— ఆంధ్రబిల్హ—.

శ్లో ॥ సత్యేన రక్ష్యతే ధర్మః ; విద్యా యోగేన రక్ష్యతే;
మృజయా రక్ష్యతే రూపం; కులం వృత్తేన రక్ష్యతే ॥
వృత్తం యత్నేన సంరక్షేత్; విత్తమాయాతి యాతి వా ;
అక్షీణో విత్తతః క్షీణః; వృత్తతస్తు హతో హతః ॥

— మహాభారతము.

— సత్యమువలన ధర్మము నిలుచును ; మనస్సు నిలకడ (ఏకాగ్రత) చేత విద్య రక్షింపబడును ; రూపము, పరిశుభ్రతచేత కాపాడబడును ; సత్ప్రవర్తనచేతనే కులము రక్షింపబడును. — కనుక అన్నిటికన్నను, చివరకు ధనముకన్ననుగూడ, మంచినడవడిక ఉండుటయే మానవునకు ముఖ్యమైన సంపద. ధనము చంచలము. అది మానవుని ఒకప్పుడు చేరును, ఒకప్పుడు వీడిపోవును. కనుక ధనహీనుడు హీనుడుకాడు. వృత్తహీనుడు హీనుడుగా, భ్రష్టుడుగానే భావింపబడును, అతడు జీవన్మృతుడు.

శా॥ గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే, యమునతో నానందముం జెందునే,
రంగత్తుంగతరంగహస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని గుణభద్రా ! తుంగభద్రానదీ !

— తెనాలి రామకృష్ణుఁడు.

శా॥ శ్రేణుల్ గట్టి నభోఽంతరాళమునఁ బాఱెన్ బకు : ఉష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యెఁ ; మృగతృష్ణావార్ధు లింకెన్ ; జపా
శోణం బయ్యెఁ బతంగబింబము ; దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె ; సరోజఖండములు నిద్రాణంబు లయ్యెం గడున్॥

— అల్లసాని పెద్దన.

మ॥ అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం డైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధరావణశిరస్సంఘాతసంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డాగరితకున్ గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్యకతుల్యకంచితజనుస్సంసారఫల్యకున్ ॥ ”

— పోతనామాత్యుడు.

శా॥ ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితున్ గనుంగొనిరి యుత్పన్నప్రమోదంబునన్
వ్యామగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్య లాటవికసేనాధీశసీమంతినుల్ ॥

— శ్రీనాథకవి.

# ప్రసిద్ధాలంకారికులు-అభినవగుప్తుడు

వేదాల తిరువేంగళాచార్యులు

"అభినవగుప్తుడు" అను వారు ఇద్దరున్నారు. అందొకడు కామరూప దేశమున - ప్రకృతపు టస్సామున నాది శంకరుల కాలములో నుండెను. శాక్త భాష్యము రచించినాడు. శంకరునితో వాదించి యోడెను. శిష్యు డయ్యెను. కాని ద్వేషముతో నతనిపై బ్రయోగ మొనర్చెను. అందువలన శంకరునకు భగందర రోగము గలిగి యెంతకును నయముగాకపోగా పద్మపాదుడు ప్రతి ప్రయోగ మొనర్చి యిద్దరి రోగమును గుదిర్చెను. శంకరునకు నయమయ్యెను. అభినవగుప్తుడు చచ్చెను. ఇతని కాలంకారికులలో నామమాత్రపు బ్రసక్తియే.

రెండవ వానికి "అభినవ గుప్తపాదు" డని పేరు. ఇందు కొక గాథ యున్నది. పూర్వము "వలభి" పాఠశాలలో జదువు బాలురలో నొక బాలుడు బుద్ధిమంతుడును ధీరభాషియునై తోడివారికి భయము గొల్పుచుండెను. వారి గురువు యతనికి "గోపానసీ భుజంగ" అని పేరిడెను. గోపానసి=వలభి "గోపానసీతు వలభీ" అని అమరము. భుజంగము=గుప్తపాదుడు.

ఇతడు కాశ్మీరకుడు. యితని "ప్రత్యభిజ్ఞా విమర్శినీ బృహద్వృత్తి"ని బట్టి పదియవ శతాబ్దము చివరను పదునొకొండవ శతాబ్ది మొదటను ఉండెను. ఇతని తండ్రి చుఖలుడు తల్లి దుఃఖల పినతండ్రి వామనగుప్తుడు. సోదరుడు మనోరథ గుప్తుడు. తాత వరాహగుప్తుడు. కర్ణ, క్షేమ రాజాదులు శిష్యులు. లక్ష్మణ గుప్తుడు, భట్టతోతుడు, భట్టేందురాజు, ముగ్గురు గురువులు. ఇతడు ఇరువది మూడు గ్రంథములు వ్రాసెను.

మొదటి గురువు కాశ్మీర శైవమతములో ప్రముఖాచార్యు డగు నుత్పల దేవుని శిష్యుడు. ఆతనినుండి యీ అభినవుడు కాశ్మీర శైవ మతాగమము లందు గట్టి పాండిత్యమును, చక్కని అనుష్ఠానమును గడించి "పరమ మహేశ్వరాచార్య" పదవి కెక్కెను. ఆ పాండిత్యానుష్ఠానములను ఈ గ్రంథములలో విస్తరించెను. [1. క్రమస్తోత్రము 2. తంత్ర వటధానిక 3. తంత్ర సారము 4. తంత్రాలోకము 5. దేహస్థ దేవతా చక్రస్తోత్రము 6. అనుత్తరాష్టిక 7. పరమార్థ చర్చ 8. పరమార్థ ద్వాదశిక 9. పరమార్థ సారము 10. పరాత్రింశికా వివరణము 11. ప్రకరణ స్తోత్రము 12. ప్రత్యభిజ్ఞా విమర్శినీ లఘువృత్తి 13. బృహద్వృత్తి 14. బోధ పంచశిఖ 15. భగవద్గీతా టీక 16. భైరవ స్తోత్రము 17. మహోపదేశ వింశతి 18. మాలినీ విజయవార్తికము.]

ఇతడు భరతనాట్య సూత్రవ్యాఖ్య "అభినవ భారతి"లో ముప్పదియారు అధ్యాయముల మొదటను, ఆ శైవ మతపు ముప్పదియారు తత్వములను స్తుతించి ముప్పది ఏడవ అధ్యాయము పైమతపు పరమ తత్త్వము "అనుత్తర తత్త్వమును" నుతించెను.

ఇక రెండవ గురువు భట్టతోతుడు భరతనాట్యశాస్త్రము నుపదేశించెను. "అభినవభారతి" మొదట నిట్లున్నది.

శ్లో॥ సద్విప్రతోత వదనోదిత నాట్యవేద
తత్త్వార్థ మర్థి జనవాంఛిత సిద్ధిహేతోః
మహేశ్వరాభినవగుప్త పదప్రతిష్ఠః
సంక్షిప్తవృత్తి విధయా విశదీకరోమి॥

గ్రంథ గ్రంథులను విప్పగల భట్టతోతుని నోటినుండి వెలువడిన నాట్యవేదపు తత్త్వార్థము నెరుగగోరువారి తలపు నెరవేరునట్లు మహేశ్వరుడు "అభినవగుప్తు" డనునేను సంక్షిప్త మగు వృత్తిని రచించి విశదపరతును.

మూడవ గురువు ఇందురాజు. సాహిత్యమును కవిత్వమును నేర్పెను. ఈ చివరి గురువులిద్దరి యనుగ్రహము వలనను ఇతని యాలంకారికత సమగ్ర సుందరమై అప్రధృష్య మగుటయేగాక తరువాత వారందరికినీ నానందముగా శిరోధార్యమైనది. ఇతని యలంకార తంత్రపు శౌండీర్య మీ గ్రంథములం దగుపడును. 1. కావ్యకౌతుక వివరణము, 2. ధ్వన్యాలోక లోచనము 3. నాట్యలోచనము 4. భరతుని నాట్యశాస్త్ర వ్యాఖ్య "అభినవభారతి" 5. ఘటకర్పర కులక వివృతి.

ఇతడభినవభారతిలో ప్రాచీన వ్యాఖ్యాత నొకనిని "నాస్తిక ధుర్యోపాధ్యాయుడు" అని పేర్కొనెను. అతడు "భాగురి". ఇతని భరతనాట్య సూత్రవ్యాఖ్యను "ధ్వనిలోచనము"లో నభినవుడు స్మరించెను. నాస్తిక మతమగు లోకాయతమునకు వ్యాఖ్యాతగా నితనిని పతంజలి తన మహాభాష్యములో పేర్కొని నాడు. కనుక యీనాస్తిక ధుర్యోపాధ్యాయుడు "భాగురి" "పతంజలి" కన్న ముందే భరత నాట్య సూత్రవ్యాఖ్య

రచించెను. మన యలంకార శాస్త్ర మును మన ఆలంకారికులు B. C. రెండవ శతాబ్దమునాటికే సమగ్ర సుందరముగా రచించియుండిరి.

"భరతుని" నాట్యశాస్త్రము మన యలంకారశాస్త్రమునకు ప్రధాన మత మును సర్వమూలమును నగుటయేగాక సర్వమాన్యమును సర్వతోమాన్యమును, నగు గ్రంథము. దానికి యీ భాగురియే గాక శకులీగర్భుడు, భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్టనాయకుడు, కీర్తిధరుడు, భట్టయంత్రుడు, మొదలగువారు వ్యాఖ్యలు రచించిరి. నాన్యదేవుడు "సరస్వతీ హృదయాలంకారము" అను భాష్యము వ్రాసెను. హర్షాదులు వార్తి కముల గూర్చిరి. ఈ అన్నిటిలోని లోటు పాటుల జక్కగా గ్రహించిన భట్టతోతుని యుపదేశము నీ ప్రతిభాశాలియగు శిష్యుడు తన యనుభవముతో సరిజూచి మెరుగుపెట్టి నికషోత్తీర్ణ తత్త్వమును "అభినవభారతి"గా వెలువరించెను.

శ్లో. తస్మాత్స తామత్రనదూషితాని
మతాని తాన్యేవతు శోధితాని
పూర్వప్రతిష్ఠాపిత యోజనాసుమూల
ప్రతిష్ఠా ఫలమావనంతి.

పెద్దల మతమునిట దూషింపలేదు. శోధించితిమి. ప్రకృతమతమున కా మత ములు మూలము లగును. "సద్విప్రతోత మదనోదిత నాట్యవేద తత్త్వార్థం........ విశదీకరోమి. మంచి బ్రాహ్మణుడు భట్ట తోతుడు తెల్పిన నాట్యవేదపు తత్త్వార్థ మును విశదీకరింతును, అనియెను.

ఇతడు అభినవభారతిలో "రస సూత్రము, నాట్యవేదము, నాట్య శాస్త్రము, నాట్య మనుకరణము గాదు." ఇత్యాది విషయములందు పూర్వవ్యాఖ్యా తల మతములను వ్రాసి దాని మీద దన యుపాధ్యాయుని విమర్శను దన సిద్ధాంత మును వ్రాసెను. మచ్చున కొక విషయము నుదాహరింతుము. అలంకార శాస్త్రమున కంఠకును పరమ ప్రధానమును శాస్త్ర సర్వస్వమును నగు రస విషయములో భట్ట లోల్లటాదులు భిన్న భిన్నములుగా నూహించిరి. వీరందరికిని మూలము భరతుని "విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అను సూత్రమే భట్టలోల్లటుని తలంపిది :- విభావాదులగు సీతారామాదులందునూ నటునందును కూడ ముఖముగానే రతిస్ఫురించును. అది విభావానుభావాదుల వలన నుపచిత మగుచో రసముకాదేని భావము. ప్రాచీను లగు దండ్యాదులుకూడా "రతిశృంగార తాం గతా రూపబాహుళ్య యోగేన" అని "అధిరుహ్య పరాంకోటిం కోపో రౌద్రాత్మతాం గతః" అని యీ మత మునే యంగీకరించిరి. కనుక సూత్రము లోని సంయోగపదము పోష్య పోషక భావమును సంబంధమును దెల్పును.

శ్రీశంకుని యూహ యిది :-ఎన్నడో పోయిన సీతారామాదులందు రతి మనకిపు డెట్లు స్ఫురించును? అభినయించు నటు నందు ముఖ్యమగు రతి యుండదుకదా. కనుక నటుడు అభినయము వలన రామాదుల రతి ననుకరించును. అప్పు డతనియందు ఆరత్యనుకరణమును మన మూహింతుము. అది ముఖ్యమగు "రతి" కాదు. దాని యనుకరణమే. కనుకనే దానికి రసము అను మారుపేరు. కనుక సూత్రములోని సంయోగపదము అనుమానరూపమగు గమ్యగమక భావమును తెల్పును.

మరొకరి (భాగురి) ట్లందురు :- సాంఖ్యుల దృష్టిలో రసములు స్వభావతః సుఖదుఃఖముల కల్గించునవి. బాహ్యవిషయ ములకుమాత్రమే సుఖదుఃఖములు కల్గించు శక్తియున్నది. దళస్థానీయములగు విభావ ములును సంస్కారకములగు అనుభావ వ్యభిచారులును కలసి అంతరములగు స్థాయీ భావములను సుఖదుఃఖ స్వభావ ములనుగా సవరించును. కనుక సంయోగ మనగా జన్యజనకభావము.

భట్టనాయకుని మార్గ మిది :- కావ్య వాక్యములు మామూలు మాటలవంటివి కావు. కనుక వానికి అభిధమాత్రమే కాక భావనయు భోగీకృతియు నని రెండు వ్యా పారములు లెక్కువయున్నవి. అభిదవలన కావ్యార్థ మెరుగవచ్చి భావనవలన భావిత మగును. భోగీకృతి రసాస్వాదనమును కల్గించును. కనుక కావ్యార్థములగు విభావాదులతో రసములకు గల సంయో గము యీ వ్యాపారత్రయమే.

భట్టతోతుడు పై మతముల నిట్లు విమ ర్శించెను :- జడమగు మనోవృత్తి ఆత్మ సంవేదనమగు రసము కానేరదు. కనుక భట్టలోల్లటుని మత ముచితము గాదు. శ్రీశంకుకుని మతముకూడ అసంగతమే. ముఖ్యమగు రతి కాధారములైన సీతా రామాదులు ప్రకృతమున లేరుగనుక వారి రతి ముఖ్యముగా నిపుడుండనట్లే వారును వారి రతియుగూడా ప్రకృత మెరుగ రాదు. కనుక అనుకరణ మెట్లుకుదురును? అది యనుకరణమని యూహించుట మాత్రమెట్లు? మరొకరి (భాగురి) మత ములో "స్థాయీభావ్యారసత్వ ముపనే ష్యామః" అను భరతునితో విరోధము తప్పదు. అపచారకల్పన మనుట యుక్తము కాదు. భట్టనాయకుని మార్గములో రెండు వ్యాపారములు శబ్దముల కప్రసిద్ధములు అవి మనోవ్యాపారములు కాని శబ్దధర్మ ములుగావు. ఇంతకును రసమనగానేమో? అది ఎచట స్ఫురించునో? నిరూపించలేదు.

అభినవగుప్తులు సిద్ధాంత మిట్లొన ర్చిరి :- "కావ్యార్థాన్ భావయంతిహి" అను భరతుని వాక్యమునుబట్టి కావ్యా ర్థమే రసము. దానిసామగ్రివిభావాదులు. అవి ప్రకృతములో లేవుగనుక విజ్ఞాన వాదము ననుసరించి భావనయే దానికి రూపము. వానిని భావించుటవలన రస ప్రతీతికి ప్రతిబంధకములగు దేశకాలాదుల స్ఫురణ తొలగిపోవును. అప్పుడు సాక్షా

త్కార స్వభావమును ఆత్మప్రకాశ రూపమును నగు సంవేదనము ఆస్వాదరూపమున నేర్పడును. ఈ ఆస్వాదనమేరసన. ఇందులో గోచరమై ఆస్వాదింపబడునదే రసము. ఇందులో రతియు గోచరింపక తప్పనిదేకనుక యీ యౌచిత్యమువలననే "స్థాయిభావాన్ రసత్వముపనేష్యామః" అన్నాడు ముని. ఈ రతియు విజ్ఞాన రూపమే. ఈ సంవేదనమున కేపేరు పెట్టినను పై జెప్పిన స్వరూప స్వభావములు తప్పవు. ఈ రసము స్థాయికాదు. సాధ్య స్వభావము. చర్వణసమయముననే ఏర్పడును. కనుక విభావాదు "సంయోగము"న అనగా మేళనమున నేర్పడు రసనలో నాస్వాదింపబడున దే రసము.

ప్రాచీనుల మతముల శోధించిన యీతని సిద్ధాంతమును సకల దేశములందును సకల భాషాశ్రయములగు లక్ష్యల లక్షణములకు, అన్ని కాలముల లోను సమన్వయించును. కనుకనే సహృదయులుకానీ, కవులుకానీ, విమర్శకులు కానీ తరువాతి అలంకారికులుకానీ దీనినే శిరసావహించిరి. ఈతడు వ్యంజనావాది. "ధ్వనిలోచనము"లోను "అభినవ భారతి లోనుగూడ శ్రీశంకుని అనుమాన మతమును ఖండించి "రోమాంచాదులు రతి నవగమింపజేయును. అభినయము వలన వ్యక్తమగునపుడాస్వాద్య మగును," అనెను. విభావాదికము, విజ్ఞానవాదము, ననుసరించి రససామగ్రి యనుటయు వ్యంజనా వాదమునే బలపరచును. ఇతడు స్ఫోటవాదికాడు. స్ఫోటవ్యంజన కాజాలదు.

"సాదరంబు సైదండ యౌవనమిడ బైకి లేచుచున్న యీ పటుకుచయుగ మిటకు వేంచేయు మదనున కెదురుదోయి స్వాగతంబిచ్చునట్టి యాభాగుతోచె."

ఇట నీ "యౌవన విజృంభణము మదనోన్మాద కరము." అను వ్యంగ్యముశబ్ద స్ఫోటమా ? తదభిన్నమగు నర్థస్ఫోటమా ? రెండునుకాజాలదు.

మరియు,

వాచియత్నస్తుకర్తవ్యో నాట్యస్యై షాతనూస్స్మృతా
అంగనైపథ్య సత్త్వాని వాక్యార్థం వ్యంజియన్తిహి"

అనుచోట ఆంగికాభినయాదులు స్ఫోటకవకాళము లేనివి వాక్యార్థములను వ్యంజనమొనర్చును" అని భరతు డనుటవలన నతనికి సమ్మత నీవ్యంజన స్ఫోటకాజాలదని స్పష్టము.

ఈ ఆంగికాభినయములోనే సాత్త్వి కాదుల నంతర్భవింపజేసి నాట్యములో కృత్రిమత్వమును ప్రధానమొనర్చు చున్నారని నందికేశ్వరాదుల నితడు నిరసించెను. మరియు నందికేశ్వరుడు, నుడివిన సంగీత ప్రధానమగు నృత్యమును గూచిపూడి భాగవతులు చక్కగా ప్రదర్శించుచున్నారు. అభినవగుప్తుడు మాత్రము రూపకములలో నృత్యసంగీతముల ప్రాధాన్య మొప్పుకొనలేదు. "వచ్చె విరాట్రాజమౌళి" ఇత్యాది గేయములందుత్తమ పాత్రలకుగూడ ఆంగికాభినయమును భాగవతులు విస్తరించుచున్నారు. అభినవగుప్తుడు దీనిని అనగా ఉత్తమ పాత్రలకు ఆంగికాభినయ ప్రాధాన్యములనుగూడ నొప్పుకొనలేదు.

కాని యీవిషయములో మన మాలోచించవలసి యున్నది. "గీతంప్రాణః ప్రయోగస్య" రూపక ప్రదర్శనమునకు సంగీతము ప్రాణము. అని ముని "వాచి యత్నస్తు కర్తవ్యః" అనుచోట నాంగికాభినయము వాక్యార్థవ్యంజకమని యతడే యన్నాడు. కనుక నపుడుత్తమ పాత్రమునకు మాత్ర మాంగికాభినయము లేకుండ వాచిక మెట్లు వ్యక్తమగును ? మరియు "యక్షాదయోహి తత్వజ్ఞా నాట్యస్య" యక్షులు మొదలగువారు నాట్యతత్వము నెరుగుదురు, అని యభినవుడే యన్నాడు. యక్షులు ప్రదర్శించు యక్షగానాదులందు నృత్య సంగీతముల ప్రాధాన్య మందరెరిగినదే. అచట నాంగికాభినయ ముత్తమ పాత్రలందు కూడ విస్తరించుటయు ప్రసిద్ధమే. కనుక అభినవుని వాద మంత యుక్తముగా దోచదు. అయితే "నృత్తరత్నావళి" "సంగీత రత్నాకరము" మొదలగునవి యీతనినే అనుసరించినవి.

భట్టలొల్లటుడు మీమాంసక మతము నవలంబించె నందురు. కాని నిదర్శనమేమియు గన్పడదు. భట్టనాయకుడు సాంఖ్యమతము ననుసరించె నందురు. అదియు నసంగతమే.

ఇతడు "అభినవ భారతి" పదునారవ యధ్యాయములో "పాదతాడితక భాణము" నుదహరించి, "శ్రోత్రియాదుల నెగతాళి చేయునపుడు వారి గుణముల గూర్చినమాటలు సొగసుగా నుండును." అనును. ధ్వనిలోచనములో భట్టనాయకుని మీమాంసతో నెగతాళిచేయును. కనుక భట్టనాయకుడు మీమాంసకుడని యూహ. ఇతడు భట్టకుమారిలుడుకాడు. ఇతడు మాయాద్వైత వాదమును స్వీకరించెనని అభినవ భారతిలో నున్నది. భట్టకుమారిలుడు తన శ్లోకవార్తికములో నీ మతమును నిర్మూలించెను కాదా? ఈతని కారోపించిన సాంఖ్య మతస్పర్శ "మరొకరి"మతములో నున్నది. అతడు భాగురియే కావచ్చును. నిరీశ్వర సాంఖ్యులు కూడ నాస్తికులేకదా !

కదమ వ్యాఖ్యాత లందరును నృత్యగీత నాట్యాదులను ఆగమ శాస్త్రాను సారములగా వ్యాఖ్యాన మొనర్పగా నభినవుడు ముద్రల నా శాస్త్రానుసారముగా వివరించి నాట్యశాస్త్రము నంతను వైదిక కర్మలకు పాంగముగా వ్యాఖ్యానించెను. ఇతడు మంచి కవిత్వమును కూడ రచించెను. ధ్వనిలోచనములో విప్రలంభ శృంగార పుటాశ్రయ భేదమున కుదాహరణమును గమనించుడు:

దయిత యా గ్రథితా స్రగియంమయా।
హృదయధామ నినిత్య నివేశితా
గలతి శుష్కతయాపి సుధారసం।
విరహదా హరుజాం పరిహారకం॥

దయిత కూర్చిన యీ పుష్పదామమెపుడు
హృదయధామమ్మునను ధరియింతు నేను,
దామ మెండియుజిమ్ము సుధారసమ్ము
అసమవిరహాగ్ని రుక్పరిహారకమ్ము.

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు.

రసాభాస మలంకార మగుట కుదాహరణము.

సమస్తగుణ సంపద స్సమలం క్రియాణాం
గుణైర్భవన్తియది భూషణంతవ తథా
పినో శోభసే
శివం హృదయవల్లభం యది యథా
తథారం
జయేః తదేవననువాణితే జగతి సర్వ
లోకోత్తరం.

ఇంత గుణశోభతో నలంకృతి గుణమ్ము
లుండినను సొగసగుగాని యొప్పలేవు
హృదయ వల్లభు శివునెటులేని రంజినమ్ము
సేయుట లోకోత్తరమ్ము వాణి.

ఇతని కీ కవితలో భట్టేందు రాజు గురువు. శుద్ధ సారస్వత ప్రవాహ పవిత్రత సకల వాఙ్మయ మహార్ణవ పూర్ణభావ సంపాదనాద్ద్విజ రాజస్వ ఇందు రాజస్వ అని అభినవ భారతిలోను,''అస్మదుసాధ్యాయస్య విద్వత్కవి సహృదయ చక్రవర్తినో భట్టేందు రాజస్వ'' అని ధ్వనిలోచనములోను పేర్కొనెను. నిజముగా నీ యిందురాజు యీ ప్రశంస కర్హుడే. అతని కవిత నొకింత చవిచూడుడు.

యద్విశ్రమ్యవిలోకితేషు బహుశోనిస్థే
మనలోచనే
యదాత్రాణి దరిద్రతీప్రతి,దినం లూనా
బ్జి నీ నాళవత్
దూర్వాకాండనిడంబకశ్చ నిబిడోయ
త్పాండిమాగండయోః.
కృష్ణేయూని సయావనాసుననితా మైవ
లేషస్థితిః.

దీనిని జూచియే యీ క్రిందిపద్య ముదయించినది.

జిలుగుపయ్యెద జాఱ జెక్కుల జెమరూన
గనుఱెప్ప విడక చూడని మిటారి
చెవియచెక్కునను దోచిన కృష్ణవదనంబు
గూర్మిమీరగ ముద్దుగొనని వనిత
పులకండములు గుల్కు బొమ్మంచుమోవిక
గ్రుక్కిళ్ళు మ్రింగని కుందరదన
పైడి కంబంబున బ్రతిఫలించినమూర్తి
గౌగిటజేర్చి చొక్కని లతాంగి
కలుగనేరరు వ్రేపల్లె చెలులలోన
గురుజనంబుల కళికిపై కొనరుగాక
కరుగరే చంద్రుగను చంద్రకాంత
మణులజోక
గోపాలరాయని గాంచినపుడె.

## దశావతార చరిత్రము

ధ్వనిలోచనములో ''శ్యామల'' పదమును వివరించుచు అభినవ గుప్తపాదులు "ద్రవిడ వనితోచితాసితవర్ణయా" అనెడి గౌడులకందరకును "అరవత'' లందరును నల్లగా నుందురని ప్రసిద్ధికాబోలును; నవీనుడు శరచ్చంద్రుడు కూడ తననవల "పథేర్ ధాబీ"లో "ఆపిల్ల నల్లగానున్నది. అరవపిల్ల గాబోలును" అన్నాడు. ✲



"డూ...డూ, డూ...డూ బసవన్నా" - చిత్రకారుడు-ఆయాస్య (గుంటూరు)

భారతదేశంలో అత్యధికంగా
అమ్మకం జరుగుతున్న సిగరెట్టు
ఆంధ్రప్రదేశ్ లో ఉత్పత్తి అవుతున్నది



# శారదరాత్రులు

అన్నాప్రగడ శ్రీరామమూర్తి

ఉ॥ వెండిమలాము వేసి పృథివీతల మంతయు చూచువారి క
న్పండువు చేసె పున్నమిదివంబున వెల్గుచు చందమామ - నా
నిండుమనంబు భావమధునిర్భరనీరజమై ప్రఫుల్లమై
యుండెను-శారదాంబకు మహోదయ మీ రజనీ విశేషమున్.

ఉ॥ భూమిని క్షీరసాగరము ముంచినదో యనిపించుచుండె-నీ
సోమరసంబు ద్రావి తమ క్షుత్తులు దీర చకోరపాళి సు
త్రాముని సోమయాజుల పదమ్ము వహించుటజేసి గెల్చునో
యే మొ-జగద్రహస్యము గ్రహింపగజాలరు పూర్తిగా నరుల్.

ఉ॥ ఈ యఖిలంబు సుందరత యేచి కనుల్ వికసింపజేయుచున్
తీయని స్వప్నముల్ బయలుదేరగ జేసెను - జీవితమ్ములో
మాయనిచీకటుల్ తెరలమాటుకు బోయె క్షణంబు స్వర్గమం
దూయెల లూగె చిత్తమురహోగతి నేగెడు రాజహంసయై.

ఉ॥ ఒక్క సరస్సునన్ నవనవోత్పల - మొక్క రసాల శాఖపై
నెక్కిన కోకిల - మ్మొకమహీస్థలి వెన్నెలకుప్ప లాడుచున్
చక్కని బాలికామణియు - శారదరాత్రులలో మదీయముల్
దృక్కులకున్ విశిష్టరసదిగ్ధకళాత్మక ముఖ్యదృశ్యముల్.

చ॥ అమలవసుంధరావలయ మంతయు వెన్నెలవాక మున్గి చి
త్తములు కలంచుచుండె హిమధామముకై వడి చకురుత్సవ
ప్రమదముగాక లేదు సుఖభావము లేశము దైహికమ్ముగా
సముదిత రమ్యతాపరవశత్వమునన్ కవు లెంచి రంతియే.

ఉ॥ ఆకసమందు తారకలహారమునందలి హీరమైన యా
రాకకు రాకపోక లెటులా మనకన్న మనోహరోహలో
నాకు గతించె కాలము - క్షణక్షణ నూతన రూపరమ్యతా
శ్రీక కవిత్వదోహదము చిన్మయమై యనుభూతి పర్వమై.

చ॥ ఒక పరిపక్వయోగి హృదియో యనిపించిన యాకసమ్ముపై
చకచకలీను చందురుని చక్కదనమ్ములతీరు తీయముల్
ప్రకటితభావవేగ రసవాహిని యైన కవిత్వకన్య న
ర్తకి యనునట్లు చేసె కవితానటనప్రదరమ్యశక్తులై.

ఉ॥ "శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులన్
చారుతరంబు" లేన; బహుసన్నుత చిత్రవిచిత్ర వైఖరీ
చారపరాయణంబులును సర్వజగద్రమణీయ భూమికల్
భూరిమనోజ్ఞ రాజత విభూషణముల్ ధరణీపురంధ్రికిన్.

ఉ॥ కార్తిక పూర్ణిమా శశివికాసము మూసినకంటి మూతకున్
స్ఫూర్తి మదంశువౌచు తెరపుళ్ళయినట్టిది మింటిలక్ష్మికిన్
వర్తులమైన నెన్నొసటి పైగల బొట్టువిడంబమైన యా
మూర్తియె నా యెడంద నలుమూలల చీకటి వేరువిత్తగున్.

చ॥ ధవళిమ రక్తిమమ్ము ప్రియదర్శనయోగ్యముగావిమిశ్రమై
దివిగల దీప మీభువికి తేజ మొసంగుట సృష్టిచిత్రమై
యవితథ శక్తమౌ భగవదంశము స్పష్టము కాదొకండె మా
నవు డెపుడిట్టి దీప మిడినాడు జనించినదాది నేటికిన్.

మ॥ శరదిందూదయవేళలో ప్రణయపూజాతన్మయత్వంబులో
వరదాంపత్యకళావిలాసి యువకద్వంద్వంబు వీక్షింప దా
సురవర్గక్షుధ తీర్చు పూర్ణశశి దృష్టుల్ తన్పు మోమైన తత్
గురుసౌభాగ్యము సంక్రమించు కవిచంద్రున్ నామ
సామ్యంబునన్.

ఉ॥ నింగి వెలుంగుచున్ కళలునిండినమోమున వెండికంచపున్
బంగరు పొన్నువోలె కనుపండుగయై సుఖశీతలాచ్ఛకాం
తిం గురియించుచుండె నతితీక్ష్ణకరావళి మార్చి దైవశ
క్తిం గురితింపజేసి రవికిన్ భువికిన్ శశి మధ్యవర్తియై.

ఉ॥ పూచిన మల్లెపందిరిని బోలిన చుక్కల యాకసాన దో
బూచుల చందమామ నగుమోమది మబ్బుతెరల్ పెకల్చి యా
లోచన, లోచనమ్ములు విలుప్తత చెందిన మానవాటవిన్
తోచియు తోచనట్టి పనితో నిటు దేనికి కాయు వెన్నెలల్.

శా॥ ఆ శోభామయు చెంతకున్ వెడలి శల్యంబుల్ పరీక్షింతురా
యీ శాస్త్రజ్ఞులు, వీరికిన్ వశము కానేవచ్చుగానీ, రసా
వేశం బంది కవీంద్రు లొందెడు సుఖావిర్భూతి సిద్ధించునా
కోశంబున్ విడదీసి త్రుంప పువురేకుల్ వాసనల్ చిమ్మునా?

ఉ॥ కార్తిక శుక్లపక్షనిశ గాసిన వెన్నెలపాలవెల్లిలో
పూర్తిగ మున్గిపోయినది భూతల మంతయు మఱ్ఱియాకుపై
వర్తిలు గోపబాలకునిభంగి ప్రియాహృదయాంకపీఠిపై
భర్త యొకండు పక్ష్మములు వాల్చెను సృష్టికి నాందిచర్యగా.

ఉ॥ వెండిజరీదుకూలమున వెన్నెలదేవత భూమిమీద కా
పుండినయట్లుగా ప్రకృతి యున్నది శారదనూత్నశోభలన్
నిండిన యీ శరచ్చరమనిస్తులరాత్రము వేయికన్నులన్
పండుగవోలె చూచితిని ప్రాణసఖీ పరిదీప్తజాగృతిన్.

ఉ॥ కార్తికమాసమందుదయకాలములందుహిమాంబుబిందువుల్
వర్తిలుచున్న యీ ముదురువర్ణపు పచ్చని జొన్నయాకులన్
మూర్తిచెలంగగా బయలుపుచ్చెను సాత్త్వికభావచిహ్నముల్
పూర్తిగ క్షేత్రలక్ష్మి ఋతుపూరుషుపై ననురాగమగ్నయై.

ఉ॥ కృత్తిక, తారకాసతుల, నెంతటియందపు పైడిబొమ్మయో
మత్తువదల్చి నాథుని సమస్తకళల్ వికసింపజేయగా -
మొత్తము కాంతిపుంజముల భూవలయంబున పుక్కిలించె స
ద్వృత్త పరాయణుండయిన వేలుపుగిడ్డి గుణాలదొడ్డయై.

ఉ॥ చల్లదనాల కిక్కలయి శారదరాత్రులు చాలచిక్కనౌ
యల్లికతోడి మంచుతెరలై జగమంతయు నావరింపగా
పిల్లలు పెద్దలున్ వెనుకవేసిరి వీథుల సంచరింప భా
వోల్లసనంబు కూర్పగలవో ? మితిమీరినయో ఋతుప్రభూ !

ఉ॥ నీదయ పండువెన్నెలయి నేలను నింగిని నిండి - మింటికిన్
మేదినికిన్ రచించినది మేదురశీతనవాంశుమార్గముల్ -
పోదును చూచివచ్చెదను భూరిసుధాకరలోక మయ్యయో
లే దణిమత్వసిద్ధియును - లేవు నవీనుల శాస్త్రపద్ధతుల్.

ఉ॥ క్రౌంచమహా గుహాంతరము రాజమరాళకరాళమాలికా
భ్యంచితమున్ విడంబిత మనంతనభోవలయంబు - తారకా
సంచయనీలపాండిమల సన్నవమిశ్రవిశిష్టవర్ణమై -
కాంచగ రామణీయకము కల్గిన కన్నులు రెండు చాలునా ?

ఉ॥ లేదు సుమా తమోగుణము లేశము భూసతికిన్ భవత్ప్రభా
వోదయకాలమందు తనకో మఱి పెంపుడుబిడ్డలై నరుల్
భేదముతో చరించెదరు వెల్గు నెఱుంగక కొంతమంది మా
మా దురితంబు లెట్లయిన మాన్యుడవే సుకృతీ శరత్పతీ !

శంకరయ్య సముద్రపుటొడ్డున నిలబడి చూస్తున్నాడు. సముద్రము ఆకలిగొన్న పులిలా నోరుతెరుచుకొని ఒడ్డుమీదికి వచ్చి పడుతున్నది. చేతులు వెనక్కు పెట్టుకొని ఉరవడితో వచ్చి విరిగిపడుతున్న అలలను చూస్తూ నిలబడి పోయాడు. ఆ హోరుకు అతడిగుండె దడదడలాడిపోయింది. ఉద్వేగంతో సముద్రముపొంగి పొర్లినట్టుగా అతడికి కడుపులో దుఃఖము పొంగిపొర్లుకుంటూ పైకి లేచింది. నుంచి ఆ పొంగు చల్లారటానికి గంటకుపైగా పట్టింది. చుట్టూ కలయచూశాడు. గుంపులు గుంపులుగా ప్రజలు మూగిఉన్న ఆ ప్రదేశము అతడికి నిర్జనారణ్యముగా కనబడ్డది.

రాత్రి ఎనిమిదిగంటలు కావచ్చింది. శంకరయ్య చేతులు రెండూ కోటుజేబులో పెట్టుకుని బజార్ల వెంట తిరిగితిరిగి మార్కెట్టు చేరుకున్నాడు. అప్పటికే మబ్బులు ఆకాశాన్నంతా ఆవరించుకున్నాయి. అతడు ఏదో ఆలోచించుకుంటూ దుకాణాల ముందరగా మందంగా నడుస్తున్నాడు. ఒకవరస దుకాణాలు చుట్టివచ్చేసరికి పెద్దపెద్ద చినుకులతో ప్రారంభమైన వాన, జోరున కురవటము మొదలుపెట్టింది. జనమంతా దుకాణాలలోకి దూరారు. శంకరయ్య కూడా ఒకదుకాణము లోకి జొరబడి గోడవారగా నిలబడ్డాడు.

వర్షం నిలిచి కురుస్తున్నది. దుకాణాలలో దూరినజనమంతా ఒక్కొక్కళ్ళే చోటు చూసుకుని కూచోవటము మొదలుపెట్టారు. శంకరయ్యకూడా ఒకమూలగా గోడ కానుకుని కూర్చున్నాడు. అక్కడ చేరినవాళ్ళంతా మెల్లగా కబుర్లలోపడ్డారు. వాళ్ళంతా నవ్వుకుంటుంటే శంకరయ్యకు కూడా అనుకోకుండానే నవ్వువస్తున్నది. కాని అతడి మనసులో ఇంటిసంగతులు సముద్రపు పొంగులా పొంగిపోతున్నాయి. మోడులాంటి తనజీవితము చిగిర్చి - పుష్పించి ఫలించిందనుకున్నాడు. కాని ఆ సంతోషము నీటి బుడగలా మాయమయింది. స్మృతిచిహ్నాలను తనకు మిగిల్చిపోయింది. అతడిని రంపపు కోతకు ఎరగా చేసింది. అతడి గుండెను కరకర నమిలి మింగేస్తున్నది.

అతడి జీవితములో జరిగిన సంఘటనలు అట్లా జరక్క ఇంకొకమాదిరిగా జరిగితే ఎట్లా ఉండేదో ! కొన్నాళ్ళకా మిల్లులోనే పెద్ద ఉద్యోగము దొరికేదేమో ఎవరు చూడవచ్చారు ? కాని - అట్లా జరగలేదు. మిల్లులో ఉద్యోగముమాట అటుంచి గృహకల్లోలాలతో మనసు కుంచించుకు పోయింది. ఒకనాడా పరిస్థితులమీద వెగటుపుట్టింది.

శంకరయ్య మనసు పాదరసములా పరుగులెత్తటము మొదలుపెట్టింది. గతాన్ని విస్మరించాలని అతడు ఎంత ప్రయత్నించినా మనసాగలేదు. ఛీ ! 'మనసెంత పాపిష్టిది !' అని విసుక్కున్నాడు. కళ్ళుమూస్తే గడచిన సంగతులు ప్రత్యక్షమయి కలతచెందిస్తాయని అతడు కళ్ళు విప్పుకొని చూడటము మొదలుపెట్టాడు. కాని కొంతసేపటికి కళ్ళు వాటంతట అవే మూతలుపడ్డాయి. మసకమసకగా గడచిన సంగతులు కళ్ళకు కట్టాయి.

అతడికి ఒంటిమీద స్పృహ వచ్చేసరికి కళ్ళు తుడుచుకుంటూ ఎదురుగా తల్లి కనబడ్డది. నాలుగు పక్కలా కలయజూసేసరికి అక్కడ తానొక్కడేకాదు - ఇంకా చాలా మంది మంచాలమీద దుప్పట్లు కప్పుకొని పడుకొని ఉన్నారు. కొందరు మూలుగుతున్నారు. తన చేతులవంక చూసుకున్నాడు. గట్టిగా పట్టీలు కట్టిఉన్నాయి. బాధ తెలియకుండా ఉండాలని మందు యిచ్చినట్టున్నారు. కాని చేతులలోనుంచి సన్నగా పోటూ-జివ్వుజివ్వున లాగినట్టూ అనిపిస్తున్నది. చేతులమీద దృష్టి పడగానే కళ్ళవెంట నీళ్ళు కారి ధారకట్టాయి.

అతడు పనిచేసే బట్టల మిల్లులో వారానికి పదిహేను రూపాయలు ఇచ్చేవారు. ఏడాదికొకసారి బోనసూ ఇరవయి గజాలబట్టా వచ్చేవి. మిల్లులో యంత్రాలు గిరగిర తిరుగుతూ ఉంటే అతడి మనసులో ఏదో సంతోషములాంటిది పొంగులువారేది. ఉడుకు రక్తము ఉరకలు వేసేది.

ఎప్పటిలాగే ఆనాడుకూడా అతడు రాత్రి పూట డ్యూటీలో ఉన్నాడు. పన్నెండుగంటల వరకూ చురుకుగా జాగ్రత్తగా పనిచేశాడు. తరువాత కొద్దిగా నిద్ర తూగటము మొదలుపెట్టింది. ఒకసారి మెషీను మీదికి ఒరగబోయాడు. కాని వెంటనే సర్దుకుని చన్నీళ్ళతో ముఖమూ కళ్ళూ కడుక్కుని పనిచేయటము మొదలుపెట్టాడు. ఒకగంట తరువాత మళ్ళీ నిద్రమబ్బు వచ్చింది. అతడి కీసారి సర్దుకోవటానికి అవకాశము లేకుండాపోయింది. రెండుచేతులూ మరలోపడి నలిగిపోయాయి. అతడు కేకలు వెయ్యటమూ అక్కడ ఉన్నవాళ్ళు యజమానికి టెలిఫోనుచేసి అంబులెన్సులో తనను ఆసుపత్రిలో చేర్చటమూ-బాధ భరించలేక తను గావుకేకలు వెయ్యటమూ అతడికి బాగా జ్ఞాపకమున్నది.

బాహ్యస్మృతి కలిగిన తరువాత తల్లిని తన చేతులను గురించి ప్రశ్నించాడు. ఆమె చెప్పలేక కన్నీరు కార్చింది. ఆ మరునాటికల్లా అతడికి తెలిసిపోయింది, మోచేతుల వరకూ కొట్టేశారని. బాధ తగ్గి పుండు నయమయిన తరువాత శంకరయ్య ఇంటికి వచ్చాడు. మిల్లు యజమాని ఒక ఏడాది జీతము పంపాడు.

అతడి కిప్పుడు చేతులు పూర్తిగాలేవు. రెండూ మొండివి. ఒకరు బట్టకట్టాలి; ఎవ

రయినా అన్నముపెట్టాలి. తమ్ముడు ధోవతి కడుతున్నాడు; చెల్లెలు అన్నముకలిపి నోట్లో పెడుతున్నది. అన్నము తిన్నతరువాత చీకటిపడేవరకూ వాకిటి అరుగుమీద కూర్చునేవాడు. ఆలోచనలు సుడులు తిరుగుతుంటే పట్టపగలుకూడా అతడి కంటి ముందర కటికచీకటి తాండవించేది.

ఇంతవరకూ తల్లీతండ్రీ చాలాప్రేమతో గౌరవంగా అతడిని చూస్తూవచ్చారు. కాల చక్రము దొర్లిపోతున్నది. అతడి గాయాలు పాతబడిపోతున్నాయి. తల్లిదండ్రుల సానుభూతికూడా క్రమంగా మాటుమణిగిపోతున్నది.

అంతవరకూ ఇంట్లో ఏం జరుగుతున్నదో ఏం జరిగిందో అతడికి తెలియదు. అప్పుడప్పుడు తల్లీ తండ్రీ ఘర్షణపడుతూ ఉంటారు. తండ్రి ఎంతసేపటికీ తగవును సాగదీస్తూనే ఉంటాడు. రాత్రిళ్ళు నిద్రపట్టే వరకూ నోరు మెదుపుతునే ఉంటాడు. అది అలవాటే కనుక శంకరయ్య అంతగా మనసుకు పట్టించుకోలేదు. కాని ఆనాటి ఘర్షణ తీవ్రరూపము దాల్చిందనే చెప్పాలి.

"నేను సంపాదించినన్నాళ్ళూ నీవూ నీ కొడుకులూ తిన్నారు. ముసలితనంలో నాకు కానీ యిచ్చేనాళ్ళు లేరు. చిన్నవాడి జీతంలోంచి ఓ రూపాయివ్వు" తండ్రి గద్దించి అడుగుతున్నాడు.

"ఎక్కడిదయ్యా డబ్బు! శంకరయ్య బోనసుతో పిల్లపెళ్ళి అయిం దనుకుంటున్నావా? పెళ్ళి బాకీలు చిన్నవాడి జీతంలోంచే తీరుతున్నాయి." తల్లి పనిచేసుకుంటూనే జవాబిచ్చింది.

తండ్రికి ఎక్కడలేని కోపం వచ్చింది. ఆమె జుట్టు పీకుతూ "ఆ మొండివాడికి కమ్మగా వండి పెట్టగలవూ? నా కో రూపాయ చుట్టపీకల కిస్తే తప్పొచ్చిందా?" అంటూ అరుస్తున్నాడు.

తల్లిమీద చెయ్యి చేసుకుంటున్నాడేమో తండ్రి, అడ్డము పోదామని లోపలికి వెళ్ళుతున్న శంకరయ్యకు తండ్రి అనే చివరి మాటలు వినబడ్డాయి. అతడి గుండెమీద చమ్డాతో కొట్టినట్లయింది. క్రుంగినమనసు అధఃపాతాళానికి దించుకుపోయిన ట్లయింది. త్రాణలేని అతడి మనసు ముందూ వెనుకలు చూసింది. ఎటు చూసినా గాఢతిమిరము! అగాధము! కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి. చప్పున అతడు వెనక్కు తిరిగాడు. అరుగు మీద కూర్చుని ఆలోచనలో పడ్డాడు. ఇంక ఇంట్లో ఒక్కొక్కరే తన నంత భారంగా ఎంచుకుంటారన్నమాట, తండ్రి సంగతి తెలిసిపోయింది. మరునాడు తమ్ముడుకూడా ఆమాట అనవచ్చు. ఇకపోతే తల్లి. ఆమె తన నోటిమీదుగా అనకపోయినా సమర్థించ లేదు. ఛీ! తన బ్రతు కెంతకు దిగజారిపోయింది! చప్పున శంకరయ్య లేచి నిలబడ్డాడు. అడుగులు ముందుకు పడ్డాయి. మెల్లగా నడక సాగింది.

అతడు నడిచి నడిచి నడిరాత్రివేళకు ఒక చెట్టుదగ్గరికి చేరుకున్నాడు. ఆ రాత్రి కక్కడ కన్నుమూసుకొని తెల్లవారగానే మళ్ళీ బయలుదేరాడు. అతడికి తన గమ్యస్థానము తెలియదు. కాని తెలిసినట్టుగానే తడబాటు లేకుండా గబగబా నడిచిపోతున్నాడు.

మధ్యాహ్నము పన్నెండు గంటలు కావచ్చింది. వైశాఖమాసపు ఎండలు మండిపోతున్నాయి. వడగాడ్పు ఈ చెవి నుంచి ఆ చెవికి దూసుకుపోతున్నది. శంకరయ్య ఆకలిచేత డస్సిపోయాడు. నీరసం చేత కాళ్ళు తడబడుతున్నాయి. దాహం చేత నాలుక పిడచకట్టుకుపోయింది. తన అభిమానాన్ని చంపుకొని ఆ ఊరంతా తిరిగి తిరిగి, ఓ యింటిముందర ఆగి పట్టె డన్నం పెట్టమన్నాడు. అయిదు నిముషాల తరువాత విస్తట్లో అన్నము పెట్టుకుని ఒక యిల్లాలు బయట నిలబడ్డది. అన్నపు విస్తరి చూడగానే అతడికళ్ళు ఆనందంతో మెరిసిపోయాయి. చూస్తూ నిలబడిపోయాడు.

"అబ్బీ! విస్తరి పట్టుకో, అట్లా చూస్తావేం?" అన్న దామె. ఆమె హెచ్చరికతో ఈ లోకానికి వచ్చాడు. మొండి చేతులతో విస్తరిని గుండె కానించుకుని బయలుదేరాడు. చల్లదనానికి పక్షులు చెట్లమీదికి చేరిన ఆ మండుటెండలో అత దొక చెట్టుకిందికి చేరాడు. కూర్చుని ఆ విస్తరిని మెల్లగా నేలమీద ఉంచాడు. అతడికి కడుపులో ఆకలి మండిపోతున్నది. ఇన్నాళ్ళనుంచీ లేని సమస్య ఒకటి వచ్చిపడ్డది. ఆ విస్తట్లో ఉన్న అన్నము తననోటికి వచ్చే దెట్లా? అనుకుంటుండగా నవ్వు వచ్చింది. చప్పున నేలమీద బోర్లాపడుకుని విస్తట్లో నోరు పెట్టి గబగబా ఆ అన్నమంతా తినేశాడు. తింటూ ఉండగా గొంతుపట్టిన ట్లయింది. దగ్గర్లో నీళ్ళులేవు. ఉన్నా తాగటము ఒక సమస్య.

అతడు అన్నము తింటూండగా ఎవరో నవ్వినట్టు వినబడ్డది. కాని అతడు అన్నము తినేధోరణిలో సరిగా వినిపించుకోలేదు. మళ్ళీ అటువంటి నవ్వే వినబడితే వెనక్కుతిరిగి చూశాడు. అక్కడికి పదిబారల దూరాన పదిహేడు పద్దెనిమిదేళ్ళ పడుచు నీడలా తనవైపుకు కదిలిరావటము అతడికి కనబడ్డది. ఆమె దగ్గరికి రాగానే ఆశ్చర్యముతో "నీ కాళ్ళ కేమయిందీ?" అంటూ అతడు కళ్లుపెద్దవిచేసుకుని అడిగాడు.

"నీ చేతుల కేమయిందీ?" అన్న దామె కళ్ళు చిన్నవి చేసుకుంటూ ఆదుర్దాగా. ఇంచుమించుగా ఇద్దరూ ఒక్కసారే ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు.

ఆమె తనచేతులకేసి చూస్తూ ఉండటము వల్ల అతడికి మళ్ళీ మనసులో బాధ బయలు దేరింది. అయినా ఆమె కాళ్ళవంక చూడటము మానలేదు. కొంత సేపటికి అతడు తెప్పరిల్లు కుని "ఆసంగతి తరువాత చెప్తా. నాకు దాహమవుతున్నది. మంచినీళ్లు తాగిస్తావా ?" అన్నాడు.

"నీళ్ళేవీ ?"

"దగ్గర్లో ఎక్కడయినా ఉన్నాయేమో !"

"చూద్దాం పద"

అత డామెను నిలువెల్లా మరొక్కసారి చూశాడు.

అది గ్రహించి ఆమె తొందరగా "పోవాలంటే నేను రాలేను. నాసంగతి చూస్తున్నావుగా !" అన్నది.

"నీవు తప్పుపట్టుకోకపోతే నా బుజాల మీద ఎక్కించుకుని తీసుకుపోతాను వస్తావా?"

ఆమె కొంచెము సందేహించింది. "నాలుక పిడచకట్టుకు పోతున్నది సందేహించకు మరి" అంటూ అతడు మళ్ళీ హెచ్చరించాడు. ఆమె తలవంచుకుని వెలుగులాంటి నవ్వు నవ్వింది. నేలమీదికి ఒంగి శంకరయ్య ఆమెను బుజాలమీద కూర్చోబెట్టుకున్నాడు. సిగ్గుతో ముడుచుకు పోతూ అతడికి ఆమె దారిచూపిస్తున్నది. ఆమె చెయ్యి చూపించినట్లల్లా అతడు నడిచాడు. చింతతోపు ఆవల ఉన్న ఒక సన్నటి వాగు మెరుస్తూ మెలికలుతిరిగి తాచుపాములా పరుగెత్తుతున్నది. శంకరయ్య వాగుఒడ్డున ఆమెను దించాడు. ఆమె చేతులతో పాకుతూ వెళ్ళి ఆ సెలయేటినీళ్ళు దోసిళ్ళతో అతడికి తాగించింది. అతడు ఒడ్డెక్కుతుంటే ఆమె కూడా కడుపునిండా నీళ్ళు తాగింది.

"ఆ చెట్టునీడన కాసేపు కూచుందాము" అంటూ అతడు ముందుకు నడిచాడు. అతడు దిక్కులు చూస్తూ నడుస్తూండగా ఆమెకాసేపటిలో చెట్టుకిందికి చేరుకుంది.

"అయ్యో ! నా మతిమరుపుచూడు ! ఇసక నేలన నీచేతులు కూరుకుపోతుంటే చూస్తూ ఊరుకున్నానుగాని నిన్ను ఎత్తుకురావాలని తోచలేదు. ఎంత పొరబాటు ?" అతడు రెండుచేతులతో తలపట్టుకుని ఎంతోసేపు బాధపడ్డాడు.

"ఈ కాస్త దూరానికేనా అంత నొచ్చుకుంటున్నావు ? ఇంకా ఇంతదూరము కూడా నా కలవాటే." ఆదగ్గర్లో ఒక బండ చూసుకుని దులుపుకుని కూర్చున్నదామె. శంకరయ్య చుట్టూఉన్న చెట్లవంక చూస్తూ మధ్య మధ్య ఆమె ముఖముకేసి చూస్తున్నాడు. ఆమె శరీరము నల్లగా బొద్దుగా నిగనిగలాడి పోతున్నది. చందమామలాంటి ముఖము – చారడేసి కళ్ళు – కొసదేరిన ముక్కు – సొట్ట పడిన గడ్డము – ఒకసారి చూస్తే మరుపురాని సోయగము. ఆమె యౌవనము అతడి ఉడుకురక్తాన్ని గిలకొట్టింది. అతడట్లా తనను చూస్తుంటే ఆమెకు సిగ్గు ముంచుకు వచ్చింది. అతడి దృష్టి ఆమె కాళ్లమీద మళ్ళీ పడ్డది.

"అయితే నీ కాళ్ళు ఇట్లా ఎందు కయినాయి ?"

"పుట్టినప్పుడే ఇట్లా ఉన్నాయి.

పేరు అడిగితే సత్తి అని చెప్పింది.

"మెడకు నల్లపూసలు కట్టుకున్నావు. పెళ్ళయిందేమిటి ?"

"అవును."

తరువాత ఏ మడగాలో శంకరయ్యకు తోచలేదు. కొంత సేపటికి "అయితే నీ వా చెట్టుకింద ఏం చేస్తున్నావు ?" అన్నాడు.

"ఏంలేదు. నిన్న సాయంత్రం మనగా వచ్చాను. రాత్రి అక్కడే కొంగు పరుచుకుని పడుకున్నా."

శంకరయ్య ధైర్యము తెచ్చుకుని అడిగాడు "నీ యిల్లెక్కడ ? అక్కడి కెందుకు వచ్చావు ?"

ఆ మాటతో సత్తి తల మళ్ళీ దించుకు పోయింది. ఆలోచిస్తూ కాసేపు ఊరుకుని మళ్ళీ హెచ్చరించాడు శంకరయ్య.

"మా చెల్లిని బావ కిచ్చి చేశారు. దాని పెళ్ళిలోనే నాక్కూడా అతడిచేతే పుస్తె కట్టించారు..."

"అదేమిటి ?"

"మరి నన్నెవరూ చేసుకోలేదు. పెళ్ళి కాలే దనుకోకుండా బావ చేతే పుస్తె కట్టించారు."

"అయితే నీ విప్పుడు ఎక్కడున్నావు!"

"మా అమ్మదగ్గరే ఉన్నా. అమ్మ ఫ్యాక్టరీలోకి కూలికి పోతే ఇంట్లోపనంతా చేసి వండి పెడతా."

"మరెందుకు వచ్చావు చెట్టుకిందికి ?"

సత్తి తల వంచుకుంది. ఆమె కన్నీళ్లు జలజల రాలి ఇసుకలో ఇంకిపోయాయి. ముఖము పైకెత్తి ఆమె కళ్ళు తుడవాలనుకున్నాడు. చప్పున తన చేతులసంగతి జ్ఞాపకమొచ్చి వెనక్కు తగ్గాడు.

"నీ కంత బాధ కలిగించేదయితే అడగనులే. పగటిపూట అన్నము తినేటప్పుడు నిన్ను చూడలేదు. చూస్తే ఆ అన్నమంతా నేను ఒక్కడినే తింటానా ? నాతప్పు నాకు తెలిసినప్పటినుంచీ మాచెడ్డబాధగాఉంది.''

"నన్ను చూస్తే నీకు బా ధెందుకు ? అసలు నిన్నటినుంచీ నాకు తిండి మీద అయిష్టత పుట్టింది. ఏందుకో తెలుసా ? మా బావ చెల్లిని తీసుకు పోవాలని వచ్చాడు. పప్పుచారు, మసాలాకూరా నేనే వండాను. వెలుగుండగానే అంతా నవ్వుతూ పేలుతూ తిన్నారు. ఆ సంబరములో అమ్మయినా నేను తిన్నదీ లేనిదీ అడగలేదు. మా బావ రాకతోటే కుంగిపోయిన నా మనసు, దాంతో

మరీకుంగింది. చిన్నా పెద్దా కలిసి నీకర్మ అన్న ట్లనిపించింది. ఇంట్లో ఉండలేక పోయాను" ఆమె కన్నీరు కార్చటము మొదలుపెట్టింది.

శంకరయ్య మనసు నీరయిపోయింది. అతడికి కూడా కళ్ళ నీళ్ళు వచ్చాయి. ఆమెకు దగ్గరగా జరిగి "ఏడిస్తే లాభం లేదు. నీవుకూడా బతకటం నేర్చుకోవాలి. నా సంగతి విన్నావా ? సంపాదించినన్నాళ్లు ఇంట్లో అందరూ గౌరవించారు. అవిటి వాడిని కాగానే అందరికీ బరువయ్యాను. ఇల్లు బయలుదేరి మూడురోజులయింది. అప్పటికి యిప్పుడు తిన్నాననుకో."

సత్తి తడికళ్ళతో అతడి ముఖంలోకి చూసింది.

"నే నో మాటచెప్తా. తప్పు పట్టుకోవు కదా !"

ఏమి టన్నట్టుగా చూసిందిసత్తి తలఎత్తి.

"నీవు మళ్ళీ యింటికి వెళ్ళదలచు కున్నావా ?"

లేదన్నట్టుగా సత్తి తల తిప్పింది.

"చూడు సత్తీ! నీకు కాళ్ళు లేవు. నా చేతులు లెట్లా ఉన్నాయో చూస్తున్నావుగా! నిన్ను నా మెడమీద కూర్చోబెట్టుకుని ఎంత దూరమయినా తిప్పుతా. నా కింత అన్నం నోట్లో పెట్టు. మ నిద్దరం కలిసి బతుకుదాం. ఏమంటావు ?"

సత్తి తలవంచుకుని నేలమీద పుల్లతో గీతలు గీస్తున్నది. "ఏమంటావు చెప్పు ?" అన్నాడు.

ఆమె ఓరకంట చూసి ముసిముసి నవ్వులు నవ్వింది. "అయితే పోదాం లే."

"ఎక్కడికి ?"

"ఎక్కడికయినా పోదాం."

ఆమె జాలిగా అతడికళ్ళల్లోకి చూసింది. అతడు నేలమీదికి ఒంగి ఆమెను మెడమీదికి ఎక్కించుకున్నాడు. వచ్చినదారికాక మరొక దారి పట్టాడు.

దారిపొడుగునా సత్తిని మాట్లాడించాలని శంకరయ్య ఎన్నో కబుర్లు చెప్పాడు. ఎనిమిదవ క్లాసువరకూ తాను చదివిన చదువంతా ఉపయోగించి ఆమెకు తెలియని విషయాలెన్నో చెప్పాడు. తప్పుపోయినా మంచిరాగములో పదా లెన్నో పాడాడు. సత్తి మౌనంగా వింటూకూర్చున్నది. అతడు మాత్రము ఇనుమడించిన ఉత్సాహముతో అడుగులు గబగబా వెయ్యటము మొదలుపెట్టాడు. రాత్రి తొమ్మిదిగంటలపొద్దుకు ఒక దేవుడిగుడి దగ్గర సత్తిని దింపి శంకరయ్య లోపలికి వెళ్ళాడు. పూజారి రెండరటిపళ్లూ ఒక కొబ్బరిచిప్పా అందరితోపాటు శంకరయ్యకూ పడేశాడు. అతడు వాటిని మొండిచేతులతో గుండె కదుముకొని సత్తిచేతి కిచ్చాడు. తిని ఇద్దరూ బయలుదేరారు.

అది వెన్నెలరాత్రి. పాలు పుక్కిలించి నట్టున్నది ప్రకృతి. శంకరయ్య సత్తిని తీసుకుని ఒక చెట్టుక్రిందికి వచ్చాడు. శంకరయ్య బుజాలమీది రుమాలు తీసి సత్తి నేలమీద పరచింది. చల్లగాలి మందంగా వీస్తున్నది. ఆకాశంమీద పట్టిన మబ్బుతునకలు అనేక రూపాలలో పరుగులెత్తుతున్నాయి. శంకరయ్య సత్తికి దగ్గరగా కూర్చుని మళ్ళీ కబుర్లు చెప్తున్నాడు. తను పనిచేసిన మిల్లులో దారముదగ్గరనుంచి బట్ట తయారయేవరకు వివరించి చెప్పాడు. ఆమె కళ్ళు పెద్దవి చేసుకుని వింటున్నది. అయిదు నిముషాల మౌనము తరువాత శంకరయ్య పురుషుడయినాడు, అతడిని చూసి ఆమె స్త్రీ ఐంది. పొడిమాటలలో "నేను నీ వాడిని" అన్నాడు శంకరయ్య సత్తి కళ్ళలోకి చూస్తూ.

సత్తి ఓరగంట చూసింది. ఆమె పెదవులు గులాబిమొగ్గ విచ్చుకున్నట్టు విచ్చుకున్నవి. ఏదో మాట్లాడబోయింది. కాని గొంతు మూగబోయింది.

దేవాలయంలో ఉన్న పొగడ చెట్టు కమ్మని తావులను విరజిమ్ముతూ పూలను కూడా రాల్చింది. ఆ వాసనలకు ఉక్కిరిబిక్కిరి అవుతూ చుక్కల రాజుసాక్షిగా సత్తి మైమరచి నిద్రించింది.

తెల్లవారి లేచి మళ్లీ బయలుదేరారు. రాళ్ళనక – ముళ్ళనక శంకరయ్య నడిచి పోతున్నాడు – సత్తిని బుజాలమీదికి ఎక్కించుకుని. కొద్ది దూరములోనే ఊరు ఒకటి తగిలింది. ప్రతి నాలుగిళ్ళ మధ్య ఒక హోటలున్నది. చెత్తకుండీ దగ్గర పిల్లలూ పెద్దలూ ఎంగిలాకుల కోసము తగాదా పడుతున్నారు. ఎంతసేపు నిలబడినా శంకరయ్యకూ సత్తికీ ఏ హోటలులోనూ తినుబండారాలు దొరకలేదు. హోటలులో నుంచి బయటికి వచ్చిన ఒకాయన "నా సంచీ స్టేషను వరకూ తీసుకువస్తే బేడా యిస్తా" నన్నాడు. శంకరయ్యకు బేడ మీద లక్ష్యం లేదు. "ఎంత దూరమయ్యా స్టేషను ?" అన్నాడు. అతడు దారిచూపుతూ సంచి చేతి కివ్వబోయాడు. శంకరయ్య వెనక్కు తగ్గి తన చేతులు చూపించాడు.

అతడు వెళ్ళినదారినే నడుస్తూ శంకరయ్య స్టేషను చేరుకుని, సామాన్లు తీసుకుని పరుగెత్తే కూలీలతో వెళ్ళి, జనసమ్మర్దం బాగా ఉన్న డబ్బాలో ముందు సత్తిని ఎక్కించి తనూ ఎక్కేశాడు. రైలు సాగింతరువాత ప్రయాణీకులంతా సర్దుకొని కూర్చున్నారు. శంకరయ్య జంకుతూనే సత్తిని వారగా ఒక బెంచీ మీద కూర్చోబెట్టాడు. కొంతసేపు నిలబడ్డ తరువాత తనుకూడా సత్తిపక్కనే సర్దుకున్నాడు.

చెట్లూ పొలాలూ గట్లూ గబగబా వెనక్కు పోతుంటే రైలు రయిమంటూ ముందుకు పరుగెత్తుతున్నది. ప్రయాణీకులంతా ప్రతి స్టేషనులోనూ ఏదో ఒకటి కొనుక్కుని తినటము మొదలుపెట్టారు. ఒక ముసలి

వాడు దగ్గుతూలేచి అరటిపళ్ళు కొన్నాడు. తాను రెండు తిని "ఈ పిల్లకు ఏమీ కొని పెట్టవా ?" అని శంకరయ్యను అడిగాడు. సత్తి నా కేమీ వద్దంది. సత్తి ఎందు కట్లా అన్నదో శంకరయ్య గ్రహించి నవ్వు కున్నాడు. ఆ ముసలివాడు రెండుపళ్ళు సత్తిచేతిలో పెట్టాడు. అభిమానము కొంత-భిడియము కొంత సత్తిని తిననీయకపోయి నాయి. శంకరయ్య గ్రహించి కనుసన్న చేసాడు. సత్తి శంకరయ్య నోటి కొకటి అందించి తా నొకటి తిన్నది.

బాత్‌రూముకు పోతూ వస్తూ ఒక నడి యీడు ప్రయాణీకుడు శంకరయ్య చేతులు చూశాడు. మెల్లగా దగ్గరికి పిలిచి ఏమయిం దని అడిగాడు. శంకరయ్య అంతా చెప్పిం తరువాత "బొంబాయిలో ఒక ఆసుపత్రి ఉన్నది. అక్కడ రబ్బరుచేతులు పెడతారు. అవి పెట్టించుకుంటే ఏవైనా తేలికపనులు చేసుకోవచ్చు" అన్నాడు.

"డబ్బు కావద్దూ ? రబ్బరు చేతులు ఊరికే వస్తాయా ? అన్నాడు శంకరయ్య ఆశ్చర్యముతో.

''పేదవాడవని డాక్టర్లకు చెప్పుకో; బీద వాళ్ళకు ఊరికేనే పెడతారు. నేను చూశాను" అన్నాడు.

శంకరయ్య అతడిచేత అడ్రసు రాయించు కుని చొక్కాజేబులో పెట్టించుకున్నాడు. ప్రయాణీకులందరూ ఒక్కొక్కరే శంకరయ్యను పిలిచి - అతడి చేతులు ఎట్లా నలిగిపోయాయో అడిగి తెలిసికొన్నారు. జాలిపడ్డారు.

రైల్లో ఉన్నంతసేపూ శంకరయ్యకూ సత్తికీ ఎవరో ఒకరు తినడానికి ఏదో ఒకటి యిస్తునే ఉన్నారు. శంకరయ్య అనుకు న్నట్టుగా ప్రయాణీకులు ఘా కేం పట్టింద న్నట్టుగా లేరు. రాత్రివేళ శంకరయ్య కూర్చునే కునికిపాట్లు పడ్డాడు. సత్తి స్థలము దొరికి నంతలో బాగానే నిద్రపోయింది. మరునాడు చాలామంది ప్రయాణీకులు దాదరులో దిగిపోతున్నారు. శంకరయ్య కూడా సత్తితో వెనుక తలుపుగుండా దిగి పోయాడు.

సత్తీ శంకరయ్యా బొంబాయి వీధులన్నీ తిరిగి పట్టణమంతా చూశారు. పెద్ద పెద్ద దుకాణాల ముందర నిలబడి, అడుక్కుని, డబ్బు సంపాదించి కడుపులు నింపుకున్నారు. ఆసుపత్రి వెదికి తెలుసుకునేసరికి నాలుగు రోజులు పట్టింది ఆ జంటకు. పెద్ద డాక్టరుతో తన గోడంతా చెప్పుకుని శంకరయ్య కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు. చేతులు పెట్టిన తరు వాత అక్కడే ఒక చప్రాసీ పని యిప్పించ మన్నాడు. శంకరయ్య కథంతా విన్న తరు వాత ఆయన గుండె కరిగిపోయింది.

మరో పదిహేను రోజులకల్లా శంక రయ్య రబ్బరుచేతులు పెట్టుకుని అక్కడ చప్రాసీ పని చేయటం మొదలుపెట్టాడు. ఒక గదిలోనుంచి మరో గదిలోకి కాగితాలు తీసుకుపోవటము, రోగులను ఒక వార్డు నుంచి ఇంకొక వార్డుకు వెంటపెట్టుకుపోవ టము లాంటి తేలికపనులు చేస్తున్నాడు. ఆసుపత్రి ఆవరణలో ఒక గది యిచ్చారు. సత్తితో కాపరము పెట్టాడు. పనిచేసి ఇంటికి వచ్చి సత్తిపెట్టిన అన్నం తిని, కాస్త ఊసు లాడి మళ్ళీ పనిలోకి వెళ్ళేవాడు.

తన పని అయిన తరువాత శంకరయ్య సత్తి కాళ్ళసంగతి డాక్టర్లను అడుగుతూ ఉండేవాడు. సత్తికి కాళ్లు అసలు లేకపోలేదు. జేనెడు పొడుగున మెలికలు తిరిగి సన్నగా ఉన్నాయి. వాటిని చెక్కితేగాని కొయ్యకాళ్ళు పెట్టటానికి వీలులే దన్నారు. అందుకు సత్తి ఒప్పుకోకుండా వచ్చింది. శంకరయ్యకు ఆసు పత్రిలో పనిచేస్తున్నంతసేపూ ఏదో విధంగా పొద్దుగడిచేది. ఇంటికి వచ్చి సత్తి కాళ్లు చూడగానే ప్రాణము చివుక్కు మనేది. సత్తిని గురించిన ఈ బాధ అతడికి తను చేతులు పెట్టించుకున్న తరువాత మరీ ఎక్కువయింది.

"నేను మాత్రము ఈ రబ్బరు చేతులు పెట్టుకుని కులికానా చెప్పు సత్తీ ! నీ కాళ్లు అట్లా ఉంటే నా మన సెట్లా ఉం దనుకు న్నావు ? నే చెప్పినట్లు కాళ్ళు పెట్టించు కోవూ సత్తీ !" అని బ్రతిమిలాడే వాడు. అతడి మాటలకు సత్తి జవా బిచ్చేది కాదు. కాని కాసేపటిలో అతడి విచారము పోగొ ట్టేది. తన తెలివంతా ఉపయోగించి రుచిగా వంటచేసి శంకరయ్యకు అన్నము తినిపిం చేది." నాకు చేతు లున్నాయిగా ! వాటితో చంచా పట్టుకుని తింటా నని'' ఎప్పుడయినా శంకరయ్య అంటే ''నా చేతులతో అన్నం పెట్టాలనేగా నీతో వచ్చింది" అనేది. అట్లాంటి సమయాలలో శంకరయ్య నేలకు ఒంగి ఆమెను గుండెకు అదుముకునేవాడు.

ఆ నెలలో ఆసుపత్రిలో ఆడనౌకరు పని ఖాళీ అయింది. ప్రయత్నముచేసి సత్తి తన కా పని యిప్పించమంది. శంకరయ్య వద్దంటే వద్దన్నాడు.

"ఎందుకు ? నేనూ పని చేస్తే డబ్బు వస్తుందిగా" అన్నది సత్తి గోముగా.

"నేను తెచ్చేది చాలు. నీవు యింట్లో ఉండూ" అన్నాడు.

"ఆ పని కష్టమైంది కాదని అంతా అంటు న్నారు. పోనీ చేస్తే ఏం?"

"వద్దు సత్తీ ! చెప్పినట్టు విను"

సత్తి చిన్నబుచ్చుకుంది. మనసులో ఏవేవో ఆలోచనలు మెదిలాయి.

ఆసుపత్రిలో పెద్దడాక్టరుగారికి శంక రయ్యంటే అభిమానము. ఆయనే స్వయంగా అతడికి చేతులు పెట్టాడు. శంకరయ్యను

చూసి తనపంట పండినట్టు మురిసేవాడు. శంకరయ్య చేతులు కోటుజేబులో పెట్టుకుని గిలకలాగ ఆసుపత్రి అంతా తిరుగుతూ ఉంటే, తనగది గడపమీద కూర్చుని, సత్తి విస్మయంతో కళ్ళు విప్పి చూసేది. అతడు సంపాదించిన పలుకుబడికి ఆశ్చర్యపడేది. తెలియని వాళ్లెవరన్నా అతడెవరని అడిగితే మూతి తిప్పుకుంటూ "నాకేంకాడు" అనేది.

నిండుచేతుల కోటు తొడుక్కుని తెల్లటి లాగూ పాపోసులూ ధరించి ఠీవిగా తిరిగే చప్రాసీ శంకరయ్య కాళ్ళులేని సత్తికి మొగుడంటే అతడికే అవమానము. అందరి ముందరా సత్తి అత డెవరో అన్నట్టు దూరం దూరంగా తిరిగేది. అతడు యింటికి రాగానే వేడివేడి అన్నము పెట్టేది. అతడు ఆవురు ఆవురు మంటూ తిని ఆనందంతో సేద దేరేవాడు.

ఈమధ్య సత్తి కాస్త చిక్కింది. తెల్ల బడ్డది. ఎక్కడ బడితే అక్కడ కొంగు పరుచుకుని పడుకోడము మొదలుపెట్టింది. పాలిపోయిన చెక్కిళ్ళూ, దోక్కుపోయిన ముఖమూ, బావిలోంచి వచ్చినట్టుగా మాట. సత్తి గుర్తుపట్టలేకుండా అయ్యేసరికి అక్కడ పనిచేస్తున్న ఆడనౌకర్లంత పనిపెట్టుకుని వచ్చి దీవించిపోయారు.

శంకరయ్య ముసిముసినవ్వులు నవ్వుతూ తనలో తాను సంబరపడుతుంటే సత్తి ఆలోచనలో మునిగిపోయేది. మనసులోమాట పైకి రానీయకుండా బిగబట్టుకుని సత్తి నెలలురాగానే మగపిల్లవాడిని కన్నది. సంబరపడుతూ శంకరయ్య పురిటిగదిలోకి వెళ్ళాడు. కాళ్ళూచేతులూ బాగా ఉన్నాయా లేదా అని పరకాయించి చూశాడు. తనబిడ్డకేలోపమూ లేదనుకోగానే అతడిమనసు ఊరటచెందింది; ఆనందముకొద్దీ గంతులు వేసింది. అవయవలోపము తన చిన్నారి తండ్రికి లేదు – లేదు – లేదు! పాపాయి పండులా ఉన్నాడు! ఆ సంతోషంకొద్దీ పాపాయికి పేరుపెట్టిననాడు తోటి నౌకర్లందరికీ విందు చేశాడు. డాక్టర్లకు పండ్లూ మిఠాయి సమర్పించాడు.

సత్తి పాపాయిని ఒళ్ళో పెట్టుకుని కాళ్ళు ఒకచేత్తో సవరిస్తూ పాలిచ్చేది. అలా కాళ్ళు సవరించేటప్పుడు ఆమె మనసులో ఏవేవో ఊహలు మెరిసి పిడుగుపాటులా ఉండేవి. గుండె గబగబ కొట్టుకుంటుంటే సత్తి ఆయాసపడుతూ సర్దుకునేది.

శంకరయ్య చేతులు పెట్టించుకున్న తరువాత కేంద్ర ఆరోగ్యశాఖమంత్రి ఆసుపత్రి చూడటానికి వచ్చాడు. కాళ్ళూ చేతులూ పెట్టించుకున్నవాళ్ళందరినీ పిలిచి చూశాడు. శంకరయ్యకు అయిదు రూపాయలు ప్రమోషనుకూడా యిచ్చాడు. ఆ మాట శంకరయ్య యింటికివచ్చి సత్తికి చెప్పాడు మురుస్తూ.

"నిన్నుకూడా కాళ్లు పెట్టించుకోమని మంత్రి గారన్నారు. కాళ్లు పెట్టించుకో సత్తీ:" అన్నాడు ఎంతో బాధగా.

భోజనసమయంలో శంకరయ్యకు మంచి నీళ్ళయిస్తూ అతడి ముఖంలోకి చూసింది సత్తి. తనకు కాళ్లులేవని అత డెంత వేదన పడుతున్నాడో గ్రహించింది. శంకరయ్య చేతులు మధ్యలో పోగొట్టుకున్నా కృత్రిమపు చేతులు పెట్టించుకుని జీవితములో తనకు కావలసినవి సాధించుకున్నాడు. తోటివారిలో అధికారులలో మెప్పు పొందుతున్నాడు.

పాపాయికి మూడవనెల నిండవచ్చింది. మనుష్యులను చూసి గుర్తుపట్టుతున్నాడు. మనిషిని చూడగానే బోసినవ్వులు ఒలకపోస్తున్నాడు.

సత్తికి రాత్రిళ్లు సుఖంగా నిద్రపట్టి వారం రోజులయింది. పాపాయిని చూసుకుని మురిసే ఆనందంలో ఒక లిప్త విషాదము – శంకరయ్య ప్రయోజకత్వము చూసుకుని పొంగే మనసులో ఏదోవెలితి – ఆమె మనసు చుట్టూ సాలిగూడులా అల్లి బిగించి వేస్తున్నాయి. ఆమెమనసు గిలగిల కొట్టుకుపోవటము మొదలుపెట్టింది.

ఆమె జీవితములో కాళ్ళులేని లోపము వల్ల మానసికంగా ఎన్నో బాధలు అనుభవించింది. కన్న తల్లే కడు హీనంగా చూసింది. ఇంటెడు పనీ చేయించింది. తోటివాళ్ళంతా నవ్వుతూ పేలుతూ ఉంటే తానా పొయ్యి దగ్గర పొద్దంతా గడిపింది. తనను తీసుకుపోవటానికి బావ వచ్చాడని చెల్లెలు మురిసిపోతుంటే తనకు తలకొట్టినట్లయింది. తనను తప్పించుకుని బావ తిరుగుతుంటే తన కేదో చెప్పలేని బాధ బయలుదేరింది. తనను చూసి అందరూ ఎంత అసహ్యించుకున్నారో తలచుకుంటే కడుపు చుమ్మలు చుట్టుకుపోతుంది. అంతలో పాలకు లేచిన పాపాయి మీదికి ఆమె ద్యాస మళ్ళింది. అవును! ఇప్పుడా మెకు ఏలోటూ లేదు. తను గడ్డిపరకకంటె అధమము అనుకున్ననాడు శంకరయ్య ఆదుకున్నాడు. "నీవూ మనిషివే నని" ధైర్య మిచ్చాడు. తన లోపాన్ని అతడు అసహ్యించుకోలేదు. తనను చూడగానే వెన్నలా కరిగిపోతాడు. పాపాయి పుట్టినప్పటినుంచీ శంకరయ్యలో మురుపు ఎక్కువయింది. కాని కాళ్ళు పెట్టించుకుంటే బాగుంటుందంటాడు. పాపాయి పెద్దవాడవకముందే పెట్టించుకోమని బలవంతం చేస్తాడు. వొత్తిడి చేస్తాడు.

అతడి ఒత్తిడికి ఆగలేక పెనుగాలికి ఊగిపోయే సన్నటి మొక్కలా ఉంది సత్తి పని.

ఆనాటి పగటి భోజనానికి వచ్చిన శంకరయ్య సత్తి ముఖంలోకి చూస్తూ "కళ్ళూ ముఖమూ వాచిపోయా యెందుకు? కంట్లోకి

పొగ పోయిందా?" అన్నాడు. ఆమె తెచ్చి పెట్టుకున్న నవ్వుతో తలవంచుకుని అన్నము పెట్టింది. మామూలుగా శంకరయ్య పాపాయి మంచముమీద కూర్చుని "సత్తీ! వీడు పెద్ద చదువు చదివి డాక్టరవాలి. ఎన్ని ప్రాణాలనో రక్షించాలి. వాడి చదువుకోసము నెలకు పది రూపాయల సర్టిఫికెట్లు కొనమని డాక్టరుగా రన్నారు. ఈ నెలలోనే మొదలుపెట్టా. తీసుకో నా జేబులోంచి" అన్నాడు. సత్తి కళ్ళలో నీళ్లు నిలిచాయి. శంకరయ్య ఆమెను సమీపించి గుండె కదుముకున్నాడు. ఆనాడు చెట్టుకింద కనబడి పెళ్ళిచేసుకోమని తనడగగానే నవ్వుతూనే కళ్ళనీళ్ళు కార్చిన సత్తి ముఖము చప్పున శంకరయ్యకు స్మృతిపథాన మెరిసింది. కాని యిప్పటికీ అప్పటికీ ఎంతోతేడా కనబడ్డది శంకరయ్యకు.

"సత్తీ! పెద్దడాక్టరుగా రేమన్నా రనుకున్నావు? వీడిని బాగా అభివృద్ధిలోకి తీసుకు రావాలన్నారు. మనకున్న లోపాలు కష్టాలు వాడికి లేకుండా చేయమన్నారు. చదువుకు కావాలంటే తానుకూడా సహాయము చేస్తానన్నారు."

సత్తి పాపాయిని చూస్తూ వింటున్నది.

"కొంత బాధపడి అయినా సరే సత్తీ! డాక్టరుగారు నిన్ను కాళ్ళు పెట్టించుకోమన్నారు. చూడు సత్తీ! ఆదొరగారు చెప్పేదేమిటంటే గుడ్డివాళ్ళు గుడ్డివాళ్ళుగాను, కుంటివాళ్ళు కుంటివాళ్ళుగానూ ఉండనవసరము లేదు. ఆధునిక శాస్త్రంతో అనేక ఉపాయాలు, వసతులూ ఏర్పడ్డాయి. కుంటి వాళ్ళూ గుడ్డివాళ్లూ అందరిలాగే ఉండవచ్చు, ఈ వసతులతోటి. అప్పుడుగాని వాళ్ళకు అందరిలో గౌరవమూ మర్యాదా రాదు. ఇతర దేశాలలో ఇటువంటి విషయాలలో చాలా శ్రద్ధ తీసుకుంటారట. మనం మాత్రము ఎందు కలా చేయకూడదు సత్తీ!"

సత్తి మౌనంగా వింటూ కూర్చుంది.

"మనలో మనమాట అనుకో. నేనూ నీవంటి అవిటివాడినే. నా కేమనిపించదు. మనము యితరుల సంగతి ఆలోచించాలి. వీడే ఉన్నాడనుకో. పెద్దవాడైన తరువాత మన్ని తలుచుకుని సిగ్గుపడే అవకాశము యివ్వకూడదు."

"ఆ కాళ్ళతో నేను నడవగలనా!" అన్నది సత్తి దీర్ఘంగా ఆలోచించి.

"డాక్టరుగారు చేతనయినంత ప్రయత్నం చేస్తా నన్నారు."

మరునాడు శంకరయ్య సత్తిని డాక్టరు దగ్గరికి తీసుకువెళ్ళాడు. డాక్టరు పరీక్ష చేశాడు. కొయ్యకాళ్లు పెట్టించుకొంటే చంకలక్రింద కఱ్ఱలు పోటీ చేసుకుని నడవవచ్చు అన్నాడు. మరునాడు రమ్మన్నాడు.

సత్తి యింటికి వచ్చింది. శంకరయ్య డ్యూటీలోకి వెళ్లాడు. శంకరయ్య వెళ్ళిన తరువాత సత్తి మంచానికి అడ్డంగా పడుకుని కుమిలికుమిలి ఏడ్చింది. చిన్నబోయిన ముఖంతో ఇంటిపని చక్కబెట్టుకుంది. శంకరయ్య అన్నము తిన్న తరువాత తనూ తిన్నట్టుగానే గిన్నె లన్నీ కడిగింది. శంకరయ్య ఏదో మాట్లాడుతున్నాడు. కాని ఆమె చెవినపడటములేదు. ఏవో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి. ఆమెఊహించుకుంటోంది- అబ్బాయి పెద్దవాడయి పెద్దచదువులు చదివి పెద్దడాక్టరు దయవల్ల మంచిస్థితికి వస్తాడు. అప్పు డతడికి తన తల్లినిగురించి నలుగురితో చెప్పుకోవటానికి చిన్నతనముగా ఉంటుందేమో! బాధపడి పెట్టించుకున్నా కొయ్యకాళ్లూ, చంకలకింద కఱ్ఱలూ! ఈ పనిక్కూడా ఒక ఆపరేషను చెయ్యాలి. అదయినా ఎంతవరకూ సానుకూలమవుతుందో చేసిచూడాలట.

ఒకనాడు శంకరయ్యకు రాత్రిపూట పక్క వేస్తూ సత్తి అడిగింది. "నా కాళ్లు యిట్లా ఉంటే నీకు చిన్నతనముగా లేదుకదూ?" అని. ఈ మాట అనేటప్పుడు ఆమె గొంతు మామూలుగాలేదు.

శంకరయ్య నోటితో జవాబు యివ్వలేదు. లేచివచ్చి సత్తికి దగ్గరగా కూర్చుని "ఆ మాట యిప్పు డెందుకు జ్ఞాపకము వచ్చింది? ఎందు కట్లా అడుగుతున్నావు?" అన్నాడు.

"పెద్దవాళ్ళ మధ్య తిరుగుతున్నావు కనుక అడిగాను. నీవు కాళ్ళతో తిరుగుతుండగా నేను ఎదురయితే నీకు బాగుండదు కదూ?"

"ఎప్పు డయినా అన్నానా ఆమాట! అయినా నీసంగతి అందరికీ తెలుసుగా!"

"ఊరికేనే అడిగా ననుకో. మనబాబు పెద్దవాడైనతరువాత-వాడి కెట్లా ఉంటుంది? చదువుకుని గొప్పవాడు కాబోతున్న నీ కొడుక్కూ, వాడితల్లి యిట్లా ఉన్నదంటే నీకూ ఎట్లా ఉంటుంది?"

"అంతా బాగుంటుంది- నీవు కాళ్ళు పెట్టించుకుంటే."

"పెద్ద డాక్టరుగారు నమ్మకంగా చెప్పలేదుగా. ఆపరేషను చేసి చూడా లన్నారు కదూ?"

"చూడనీ" శంకరయ్య సంభాషణను అంతటితో తుంచేశాడు.

కాలము మర్చిపోయింది. కాని సత్తి మాత్రము కన్నవారింట్లో తనకు జరిగిన భంగపాటు మరవలేదు. ఆ భంగపాటు ఆమె భవిష్యాన్ని నిలవదీసి ప్రశ్నించుతోంది. తీపి చేదులమధ్య ఆమె మనసు ముందుకూ వెనక్కూ ఊగిపోతున్నది.

ఆ మధ్యాహ్నంవేళ సత్తి పిల్లవాడిని పడుకోబెట్టి శంకరయ్య బట్టలన్నీ దులిపి పెట్టెలో పెడుతున్నది. పిల్లవాడు లేచాడు. సత్తి పలకరిస్తూనే ఉన్నది. కాని పాకటము నేర్చినపిల్లవాడు ఆగలేదు. ఇదిచూసి సత్తి

జరుగుతూ పిల్లవాపెని అందుకో బోయింది. అంతలో వాడు గడపదాటి మెట్టుమీదనుంచి దొర్లాడు. మెట్టు చాలాచిన్నది. కాని ఆపాటికే పిల్లవాడు గుక్కపట్టాడు. సత్తి పిల్లవాడిని ఎత్తుకుని సముదాయించుతూండగా శంకరయ్య వచ్చాడు. అంతా విని "ముందు ముందు వీడికి నడక వస్తుంది. వీడిని నీ వేం పట్టగలవు. దబ్బున ఒక అడుగు వేసి వాడిని పట్టుకోగలవా?" అన్నాడు.

సత్తి మాట్లాడకుండా తనపని తాను చేసుకుపోయింది. ముక్కచెక్కలవుతున్న మనసును రాయిగా జేయాలని ప్రయత్నిస్తూ.

అమరునాడుదయమే లేచిన సత్తి ఇంటి పనులన్నీ శ్రద్ధగా చేసుకుని, శంకరయ్యకు ఇష్టమయిన కూర వండింది. పాలు కొని పాయసము చేసింది. ఎప్పటిలాగే పక్కింటి ముసలమ్మచేత పిల్లవాడికి నీళ్ళు పోయించింది. పెట్టెలో ఉన్న కొత్తచొక్కా తొడిగింది.

శంకరయ్య రాగానే అన్నము పెట్టింది. అతడు డ్యూటిలోకి వెళ్లుతుంటే కనుచూపు ఆనేంతవరకూ గడపలో నిలబడి చూసింది. పిల్లవాడిని ఒళ్లో వేసుకుని ఒళ్లు నిమురుతూ కడుపునిండా పాలిచ్చింది. ఉబికి ఉబికి వస్తున్న దుఃఖాన్ని అణచుకోలేక ఉక్కిరిబిక్కిరి అయింది. పిల్లవాడిని గుండెకు హత్తుకుంది. ముద్దులతో నలిపివేసింది. తలా బుగ్గలూ ఒళ్లూ నిమిరి నిమిరి పడుకోబెట్టింది.

రోజూ వచ్చి పిల్లవాడికి నీళ్ళుపోసే ముసలమ్మను కేకవేయగానే వచ్చింది. "కాస్త పిల్లవాడిని చూస్తూఉండు" అని బయలుదేరింది. గడపదాటి వెనక్కుతిరిగి చూడగానే బావురుమని ఏడవా లనిపించింది. ఒక్కసారి మంచముదగ్గరికి వెళ్ళి పిల్లవాడిని చేతుల్లోకి తీసుకోవాలని మనసు వేగిరపెట్టింది. అయిదు నిమిషాలపాటు నిలబడి ఆలోచించింది. పెదవులూ గడ్డమూ దుఃఖముతో వణికిపోతున్నాయి. సత్తి నిగ్రహం తెచ్చుకుని కొంతదూరము పోయి వెనక్కు తిరిగి చూసింది. మళ్ళీ దుఃఖము పొంగింది. రాయి అయిన మనసు నీర్శకారటము మొదలుపెట్టింది. ఆలోచనలు అడుగును ముందుకు సాగనివ్వలేదు. కాని ఆమెలోనుంచి పట్టుదల ప్రజ్వరిల్లుతూ పైకిలేచింది. సత్తి తనశక్తినంతా కూడగట్టుకుని ముందుకు సాగిపోయింది.

శంకరయ్య ఆసాయంత్రము డ్యూటీనుంచి వచ్చేసరికి పిల్లవాడు ఏడుస్తున్నాడు. ముసలమ్మ పట్టలేకపోతున్నది.

"ఏదయ్యా సత్తి, యిప్పుదేవస్తానని అప్పుదనగా వెళ్ళింది."

"ఎక్కడికి వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది?" శంకరయ్యకు కంపరం పుట్టింది. భూమిమీద కాలు ఆనలేదు. పిల్లవాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఎలా సమాధాన పెట్టాలో శంకరయ్యకు తెలియలేదు. గబగబా వెళ్ళి, గ్లాసెడు పాలుతెచ్చి ముసలమ్మ కిచ్చాడు పిల్లవాడికి పట్టమని. ముసలమ్మ కాళ్ళమీద పిల్లవాడిని పడుకోపెట్టుకుంటే శంకరయ్య చంచాతో నోట్లో పోశాడు.

"సత్తి ఎక్కడికి వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది?" పిల్లవాడు ఏడుపు మాని నిద్ర పోగానే శంకరయ్య తడబడుతూ ఇల్లంతా తిరిగాడు. అతడి కేమీ తోచలేదు. ఆదుర్దా ఎక్కువయింది. పిల్లవాడిని చూస్తూ ఉండమని ఆ ముసలమ్మకే ఒప్పగించి బయలుదేరాడు. బొంబాయి వీధులన్నీ తిరిగి వెదకటానికి ఎంతకాలము పడుతుందీ? ఎంతకనీ ఆ మహాపట్నములో వెదకటం? పోలీసు స్టేషనులో చెప్పాడు. తిండి లేకుండా ఆ రాత్రంతా తిరిగాడు. జనసమ్మర్దము తక్కువన్న మాటేగాని రాత్రిళ్ళుకూడా బజార్లు సందడిగానే ఉన్నాయి. తెల తెలవారుతూ ఉండగా కాసేపు కాలిబాటమీద కూర్చున్నాడు. అతడి మనసంతా పాడుబడ్డ మఠంలా ఉన్నది. శ్యామాకాశంలోనుండి ఒక్కొక్క చుక్కే మబ్బుచాటున మరుగుపడి పోతున్నది. ఉండి ఉండి పిల్లవాడు కెవ్వుమన్నట్టు శంకరయ్య ఉలిక్కిపడుతున్నాడు.

శంకరయ్య ఎండిపోయిన పెదవులతో వాడిపోయిన ముఖంతో మళ్ళీ బయలుదేరాడు. ఏడుగుట్టాల దొర ప్రకృతిలోకి పొడుచుకుంటూ వస్తున్నాడు. శంకరయ్య దారివెంట నడుస్తూ కనబడ్డవారి నందరినీ అడుగుతూ ముందుకు సాగిపోయాడు. మధ్యాహ్న మయింది. పచ్చి మంచినీళ్లు తాగలేదు. పొద్దు వాలిపోతున్నది.

సాయంకాలము నాలుగు గంటలనుండీ జనమంతా సముద్రపుఒడ్డుకు చేరుకుంటారు. అక్కడే తినుబండారాలు, చిన్న చిన్న వినోదకరమయిన వస్తువులూ అమ్మకానికి వస్తాయి. జనం గుంపులు గుంపులుగా మూగిఉంటారు. శంకరయ్య వాళ్ళను తప్పించుకుని పోతున్నాడు. అక్కడికి వంద గజాల దూరాన నీళ్ళవైపు చూస్తున్న సత్తి కనబడ్డది. అతడికి ప్రాణము లేచివచ్చింది.

"సత్తీ" అని కేకలు వేసుకుంటూ శంకరయ్య ముందుకు పరిగెత్తాడు. ఎప్పటినుంచీ నీళ్ళవంక చూస్తూ నిలబడ్డదో సత్తి – శంకరయ్య కేకవినగానే పాకుతూ వెళ్ళి నీళ్ళలో దభాలున పడిపోయింది. చూస్తూ ఉండగానే సత్తిని కెరటాలు లాక్కుపోతున్నాయి. సత్తికోసము పరుగెత్తి శంకరయ్య తాను నీళ్ళలోకి ఉరికాడు. సత్తి తలవెంట్రుకలు కనబడుతూ అలలతోపాటు పైకి లేస్తుంటే పట్టుకోవచ్చనుకున్నాడు.

(మిగతా 58 పేజీలో)

# యోగాసనములు

తల్లావఝ్ఝల యశోకాంతసిన్హా



రచయిత

మన యోగాసనములు, సూర్యనమస్కారముల యొక్క ప్రాముఖ్యతను, ప్రయోజనమును తెలిసిన కేరళ ముఖ్యమంత్రిగా ఉన్నరోజులలో శ్రీ పట్టం థానుపిళ్ళెగారు (ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ గవర్నర్) విద్యాలయములలో నిర్బంధముగా వాటిని నేర్పుటకు ఏర్పాటు చేసిరి. అటువంటివారు మనకు గవర్నరుగా ఉన్నరోజులలోనే మన ఆంధ్రప్రదేశ్‌లో యోగవిద్యను, విద్యార్థి, విద్యార్థినులకు నిర్బంధముగా నేర్పుటకు ఎట్టి ఆటంకము ఉండదని భావిస్తున్నాను. ఎందుకనగా ఈ మధ్య సెప్టెంబరు 1964లో, భారతప్రభుత్వపు విద్యాశాఖమంత్రిగారికి ఆసన ప్రాముఖ్యవిషయమై నొక్కి వ్రాస్తూ విద్యాలయములలో ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకతను నేను వివరించితిని. నా సూచనలను సానుభూతితో పరిశీలించి, యోగాసనముల ప్రాముఖ్యతను భారత ప్రభుత్వమువారు గమనించినట్లును దేశవ్యాప్తిగా యువతీయువకుల వయసుకు తగిన ఆరోగ్యము, బలము పెంపొందించుటకు, అవలంబింపబోవు విధానములో యోగాసనములుగూడ చేర్చుటకు నిశ్చయించినట్లు నాకు ప్రత్యుత్తర మిచ్చిరి. అందువల్ల నా చిరకాలవాంఛ త్వరలోనే ఫలించగలదను నమ్మకము కలుగుచున్నది. ఇంకొక ప్రబలకారణ మేమన, 74 సంవత్సరములు ఆరోగ్య సౌభాగ్యముతో జీవించి, భారతమాతకు చిరస్మరణీయమైన సేవను చేసిన జవహర్‌లాల్ నెహ్రూ, యోగాసనములు అనుష్ఠించుట వలన, తన ఆరోగ్యమును కాపాడుకొనుచు, అమోఘమైన సేవ చేయగలిగెను. ఆయన అడుగుజాడలలో యువతీ, యువకులు నడువవలెననియు, ఆయన ఆదర్శప్రాయుడనియు, మన దేశనాయకులు, ఘంటాపథముగా ఒక్కాణించుట వల్ల, ఆసనపద్ధతివ్యాసంగము విరివిగా ప్రచారములోనికి రాగలదని నమ్మకము.

ప్రస్తుతము మన స్కూళ్ళలోను, కాలేజీలలోను, ఇచ్చు ఫిజికల్ ట్రెయినింగు పాశ్చాత్య వ్యాయామపద్ధతుల ననుసరించియున్నది. మన భారతదేశములోని శీతోష్ణపరిస్థితుల దృష్ట్యా, మన సంప్రదాయానుకూలముగా వచ్చుచున్న, సాంస్కృతిక రీత్యా తిలకించిన, పాశ్చాత్యపద్ధతులు ఎక్కువ ఉపయోగకరములు కావని విశదమే. మీదుమిక్కిలి మనకు హానికరముగా పరిణమించుటకు పూర్తి అవకాశమున్నది. పాశ్చాత్య వ్యాయామపద్ధతులను అనుసరించే వయసున నరములకు ఒత్తిడి కలిగి, కండరములు అభివృద్ధి చెందును. ఈ విధానమునకేదు. ప్రాచ్య



శీర్షాసనము

వ్యాయామ పద్ధతుల అవలంబించినచో కండరములకు ఒత్తిడి కలిగి, నరములు బలిష్ఠము లగును. పాశ్చాత్య పద్ధతులవలన హృదయదౌర్బల్య మేర్పడును. మన భారతీయ పద్ధతులవలన హృదయము బలిష్ఠ మగును. పాశ్చాత్య పద్ధతుల శిక్షణలో మిక్కుటమగు ధనవ్యయమగును. మన పద్ధతులద్వారా శిక్షణ గఱపినయెడల, ధన వ్యయము లేకపోగా, మిక్కిలి ఉపయోగ కరములు.

భారతదేశపు మహాఋషులు ఆరోగ్య సౌభాగ్యములతో వర్ధిల్లి, అతీంద్రియ ద్రష్టలైన వైనము పాశ్చాత్యవిజ్ఞులు కూడా వొప్పుకొనిన విషయమే. యోగాసనములద్వారా మహాఋషులు ఆరోగ్యమును సంపాదించుకొనిరి. ఐదు వేల యోగాసనములు గలవు. నా 1430 మైళ్ళ హిమాలయా పదయాత్రలో 360 ఆసనములు వేయువారలను చూచితిని. 128 రకముల ఆసనములుమాత్రము గ్రంథస్థలములై యున్నవి. 13 రకముల ప్రాణాయామము లున్నవి. సర్వసాధారణముగా 10 ఆసనములు ఆచరణలో నున్నవి. ఐదు రకముల ప్రాణాయామములు సాధనలో నున్నవి. వీటిని సులువుగా విద్యాలయములలో ప్రవేశపెట్టవచ్చును. ఆఖరుకు నాల్గు ఆసనములైనను మూడురకముల ప్రాణాయామములను నియమముగా 10 నిమిషములపాటు ప్రతిరోజు అభ్యసించిన యెడల యువతీయువకులు, బాలబాలికలు, వృద్ధులు వయస్సుకుతగిన ఆరోగ్యము కలిగి సుఖముగా నుండగలరు. మన ఆసనములను అభ్యసించినయెడల ఫలిత మేమనగా ధనవ్యయము లేకుండుట; వయస్సుకు తగిన ఆరోగ్యము బలము కలుగుట; ఉదరములోని ప్రేగులు శాస్త్ర సమ్మతముగా స్పందించును. హృదయము దృఢ మగును. వక్షస్థలము విశాల మగును. ఊపిరితిత్తులలోని అన్ని భాగములు విజృంభించును. జీర్ణశక్తి పెంపొంది భుజించిన పదార్థము చక్కగా జీర్ణమై వొంట బట్టును. నాళములలోని రక్తము ధారాళముగా ప్రవహించును. సోమరితనము పోయి చుఱుకుదన మేర్పడును. అనాయాసముగా మూత్రపురీషములు విసర్జింతురు. శరీరము వ్యాధిగ్రస్తముకాదు. ముదిమి త్వరగా ప్రవేశించదు. క్రమశః వార్థక్యము ప్రాప్తించినను మనశ్శరీరముల పాటవము క్షీణించదు. శరీరము నందుండు యెముక లన్నియు స్నిగ్ధముగా నుండును. మెదడు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు సమపాళములలో వృద్ధిచెంది బలిష్ఠము లగును. ఈ ఫలితములను గుర్తించిన పాశ్చాత్యదేశములలోని శాస్త్రవేత్తలు, గృహిణులు, నర్తకులు, మన ఆసనములచే ఆకర్షింపబడి 'వానిని అనుష్ఠించుచున్నట్లు సచిత్ర వార, మాస పత్రికలద్వారా విదితమే.

మన విధానము క్రీ॥ పూ॥ 5000 సం॥ ల నుండి ఆచరణలో నున్నట్లు శాండిల్య, దర్శన, ధ్యానబిందు, మైత్ర ఉపనిషత్తులలో వివరములు కానవచ్చుచున్నవి. క్రీ॥ పూ॥ 4000 సం॥ ల కాలమున వర్ధిల్లిన సింధునదీలోయ నాగరికతను వర్ణించిన సర్ జాన్ మార్షల్ తన గ్రంథములో ఆ కాలమున ఆసనములు ఆచరణలో నున్నట్లు ఋజువుపరచెను. మానాథ సంప్రదాయ ప్రకారము శ్రీమచ్ఛేంద్రనాథుడు పరమశివునివద్ద ఆసన వివరములు తెలిసికొని యీ సద్విద్యను పలువురకు నేర్పినట్లు తెలియుచున్నది. వారి ముఖ్యశిష్యుడైన గోరఖ్‌నాథ్ చాల మంది శిష్యులకు బోధచేసినట్లు తెలియుచున్నది. పతంజలి మహాఋషి (200 బి. సి.) కూర్చిన యోగసూత్రములలో ఆసనముల విషయమై పేర్కొనెను. 13 వ శతాబ్దమున యోగవిద్యను పలువురకు బోధించిన శ్రీ జ్ఞానేశ్వర్ మానాథ సంప్రదాయములోనివాడే. ఆయన తన యోగ మహిమలచే హేమాహేమీలను అచ్చెరు వందజేసెను. శ్రీరామానందుడు, కబీర్, వుత్తర భారతములోను, యోగివేమన, నారాయణతీర్థులు దక్షిణ భారతములోను 14,15,16,17 శతాబ్దములలో యోగ విద్యను బోధించిరి. ఛత్రపతి శివాజీ గురువైన సమర్థ రామదాసు 17 వ శతాబ్దములో అనేకమంది శిష్యులకు యోగ



సర్వాంగాసనము

విద్యను బోధించినట్లు తెలియుచున్నది. శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద, రామతీర్థ అద్వైతానందతీర్థ, శ్రీ నృసింహ భారతి, శ్రీ చంద్రశేఖరభారతి (పిరిద్దరు శృంగేరి పీఠాధిపతులు) శ్రీ మాధవ యోగేంద్రుడు, శ్రీ కువలయానంద, అస్మద్యోగ గురువర్యులు శ్రీమహంత్ చార్ సంప్రదాయ అఖాడా పంచవటీ నాసిక్ శ్రీ బిహారీ దాస్‌గారును వుత్సాహవంతులైన అనేక యువకులకు యోగ సద్విద్యను నేర్పిరి. 1880-1938 వరకు తమతో సమవుజ్జీ లేదని అనిపించుకొన్న ఆంధ్రవీర కంఠీరవ, జగదేకవీర, మల్ల మార్తాండ, కలియుగ భీమ, మొదలైన సార్థక బిరుదులు పొందిన శ్రీ కోడి రామమూర్తిగారు యోగవిద్యను తమ గురువులైన శ్రీ సీతారామావధూత వద్ద (విజయనగరమునకు సమీపములో నున్న పీరఘట్టములో) నేర్చుకొన్నారు. నేపాలులోని ఖాట్మండుకు 5 మైళ్ళ దూరములో నున్న అడవులలో నివశించుచు ఆసనములు అచరించుచు ఆరోగ్యముగానున్న 137 సం॥ వయస్సుగల శ్రీ గోవింద భారతిని దర్శించి కొన్ని వివరములు తెలిసికొను భాగ్యము కలిగెను. గంగోత్రిలో శ్రీ కృష్ణానందావధూత 180 సం॥లు గలవాడు; శ్రీ రామానందావధూత 140 సం॥ వయస్సుగలవాడు; వీరు యోగాసనాభ్యాసముచే ఆరోగ్యముగా వున్నారు. మన ముఖ్యమత ప్రవక్తలు జగద్గురు భగవత్పాదులు శ్రీ ఆది శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు, శ్రీ వల్లభాచార్యులు యోగాసన సాధకులే. ఈ విధముగా అనాదినుండి ఇప్పటివరకును గురువునుండి శిష్యునకు ప్రాప్తించుచు వచ్చిన యోగవిద్యను మన హాయాంలో అనుష్ఠించి వర్ధిల్లుట మన కనీస కర్తవ్యము. ముందుతరముల వారికి యీ విద్యను అందించుట మన పరమ కర్తవ్యము.



పశ్చిమోత్తానసనము

ఇప్పుడు ముఖ్యమైన ఆసనములు కొన్నిటిని వివరించెదను. 300 ఆసనములు వేయగలిగియు, 16 సం॥ల నుండి కేవలము రెండు ఆసనములను మాత్రమే నియమముగా అనుష్ఠించుచున్న 112 సం॥ల యోగిని దర్శించితిని. ఆ రెండు ముఖ్యమైన ఆసనములను వివరిస్తున్నాను. ఒకటి-సర్వాంగాసనము. సమమైన నేలపై చాపవేసుకొని వెల్లికల పరుండి రెండు మోచేతులను భూమిపైనుంచి హస్తములు శరీరమునకు అండగా నుండగా కాళ్లు నిటారుగా పైకెత్తవలయును. గడ్డము వక్షమునకు ఆనియుండవలెను. దీనిచే వెన్నుపూస బలిష్టమగును. జఠరాగ్ని ప్రజర్విల్లును. మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధచక్రములపై ప్రభావము ప్రసరించును. రెండవది-పశ్చిమోత్తానాసనము. సమమైన భూమిమీద కాళ్ళు చక్కగా చాచి, మోకాళ్లు వంగకుండ, రెండు చేతులతోను రెండు కాళ్ళ బొటనవ్రేళ్లను పట్టుకొని వూపిరితిత్తులలోని గాలిని చేతనైనంత వరకు విడిచి, నడుము వంచుతూ ఫాలమును మోకాళ్ళమీద ఆనించవలెను. మణిపూర చక్రము మీదను, అనాహత విశుద్ధ చక్రముల మీదను ప్రభావము ప్రసరించును. వెన్నుపూస స్నిగ్ధముగా నుండును. జఠరాగ్ని ప్రజ్వరిల్లును.

మనకు అదర్శప్రాయుడైన జవహార్‌లాల్ నెహ్రూ చాలాకాలముగా శీర్షాసనమును అనుష్ఠించినట్లు, 74 సంవత్సరములు ఆరోగ్యముతో వర్ధిల్లి భారత మాతకు చిరస్మరణీయమైన సేవను చేయుటకు తోడ్పడిన శీర్షాసనము- రెండు చేతుల వేళ్ళను జతపరచి సమమైన భూమిపై నున్న చాపపైనుంచి శిఖాస్థానమునకు బ్రహ్మరంధ్రమునకు మధ్య భాగము చాపపై ఆనగా జతపరచిన చేతులు అండగా నుండగా మోచేతులు భూమిమీద ఆన, కాళ్లు నిటారుగా నెత్తవలెను. శిరస్సులోని నాళములలో రక్తము ధారాళముగా ప్రసరింపగా మెదడు నిగ్గుతేరి తెలివితేటలు, వికాసము, గ్రహణశక్తి, జ్ఞాపకశక్తి, ఆత్మ

విశ్వాసము పెంపొందును. జ్ఞానేంద్రియములు తేజోవంతములగును. హ్రస్వ దృష్టి, చత్వారము మొదలగు కంటి జబ్బు లేర్పడవు. సర్వరోగములు తొలగునని ప్రతీతి. షట్చక్రములపైన ప్రభావము కలిగియుండును. యెల్లప్పుడును వుత్సాహముగా నుండును.

ఆసనములను అభ్యసించునప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ప్రాధాన్యమున్నదని గమనించవలెను. ఋష్యాదులు భిన్నభిన్న ఆచారములను సూచించిరి విరుద్ధముగా శ్వాస నిశ్వాసములు జరిపిన అపాయము కలదని గ్రహించవలెను. ఎట్టి అపాయమునకు లోనుగానట్టి పద్ధతి జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్యులవారు వివరించిరి. అది యెట్లనగా ప్రతి వ్యక్తి తన శక్తికొలది శ్వాసను పీల్చి దానిని శక్తికి మించకుండా వూపిరితిత్తులలో ఆపి, యే సమయములో ఆపలేనని గుర్తుకు వచ్చునో అప్పుడు నెమ్మదిగా విడువవలెను. ఈ పద్ధతి నవలంభించిన వారు మనోదార్ఢ్యము, వుత్సాహసంపద, ఆత్మవిశ్వాసము పొంది యెట్టి కష్టములనైనను యెదుర్కొనుటకు ధైర్య సాహసములను కలిగియుందురు. అభ్యాసకులు తమ శక్తివంచనలేక ఆసనముల నభ్యసించుట యుక్తము.

(52 వ పేజీ తరువాయి)

"అయ్యో అయ్యో" అంటూ అందరూ అటుచూడటం మొదలుపెట్టాడు. ధైర్యశాలు లిద్దరూ నీళ్ళల్లోకి దూకారు, వాళ్ళను పట్టుకోవటానికి. వాళ్లు ఎంతదూరముపోయినా సత్తి తలవెంట్రుకలు చేతికి చిక్క లేదు. ఈతరాని శంకరయ్య రబ్బరుచేతులు పైకెత్తుకుని కనబడ్డాడు. అతడిని ఒడ్డుకు చేర్చారు.

పదిమందీ చుట్టూ మూగి ఏమి టేమిటని శంకరయ్యను గుచ్చిగుచ్చి అడిగారు. అదుర్దా ఆందోళనదుఃఖము పొంగిపొర్లొచ్చాయి శంకరయ్యకు. చిన్నపిల్లాడిలా వలవల ఏడ్చాడు.

సత్తి ఎందుకు ఆత్మహత్య చేసుకుంది ? ఎందుకంత సాహసానికి ఒడికట్టింది ? ఏ ఉద్దేశ్యముతో పండువంటి పాపాయికి అన్యాయము చేసింది! బంగారంవంటి సంసారంలో ఎందుకు చిచ్చులేపింది? శంకరయ్య రబ్బరు చేతుల్తో తల బాదుకున్నాడు.

శంకరయ్యను తడిబట్టలతో ఒకాయన తన కారులో యింటికి చేర్చాడు.

వాన జోరు తగ్గింది. దుకాణంలో కూర్చున్నవాళ్ళందరూ ఒక్కొక్కరే లేచి వెళ్ళారు. శంకరయ్య ముంగురులతో దోబూచులాడే జాబిల్లి లాంటి పాపాయి ముఖము జ్ఞాపకానికి రాగా గృహోన్ముఖుడైనాడు.

"వీరభోగ్యా వసుంధరా"



# ఆహ్లాదకరమైన
# అరబ్ నృత్యాలు





సాంస్కృతిక మార్పిడి కార్యక్రమం క్రింద సంయుక్త అరబ్ రిపబ్లిక్‌నుండి వచ్చిన రేడా జానపద నృత్య బృందం నవంబరు నెలలో హైదరాబాదులో మూడు ప్రదర్శనలు యిచ్చింది. ఆ ప్రదర్శనల్లోని కొన్ని చిత్రాలు..........





...ఆహ్లాదకరమైన నృత్యాలతో జంటనగర
పౌరులను మంత్ర ముగ్ధులను చేసిన అరబ్
కళాకారుల సొగసైన కదలికలు.







'మంత్ర మురళి' నృత్యం నుండి ఒక దృశ్యం.



'మంత్ర మురళి' లో బృందనాయకుడు,
గాయకుడు మహమ్మద్ రేడా.



'ముగ్గురు మూర్ఖులు' నృత్యం నుండి...



"సంయుక్త అరబ్ రిపబ్లిక్ సంస్కృతిని మరింతగా దర్శించడానికీ, అర్థం చేసుకోవడానికీ యీ బృందం పర్యటన అవకాశాన్ని కల్పించింది" అని ప్రారంభోత్సవం రోజున ముఖ్య అతిథిగా హాజరైన ఆంధ్రప్రదేశ్ గవర్నరు తమ సంక్షిప్త ప్రసంగంలో ప్రస్తావించారు.

సాంస్కృతిక వ్యవహారాల శాఖామంత్రి శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, ప్రభుత్వ కార్యదర్శి శ్రీ ఎల్. ఎన్. గుప్త, బృంద నాయకుడు మహమ్మద్ రేజా, కుమారి జయశ్రీలనుకూడా ఈ చిత్రంలో చూడవచ్చు.




రవీంద్రభారతి మెట్లపై మా ఫోటోగ్రాఫరు సయిదుద్దీన్ ఎదుట చిరునవ్వులు చిందిస్తూ నిలుచున్న కళాకారులు.



సినీనటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుతో కళాకారులు.

# జాతీయ గీతాలు

— 'చిత్రభాను'

బాలలూ!

మన జాతీయగీతం మీకందరకూ జ్ఞాపకం వుంటుందను కొంటాను. ఏ భారతీయుడూ ఆ పాటలోని ఒక మాటనైనా మరచిపోరాదు. ప్రతి దేశానికీ ఒక జాతీయ గీతం వుంటుంది. జండాలు ఎగురవేసేటప్పుడు ఆ గీతాలను హృదయపూర్వకంగా భక్తితో పాడుకొంటారు. ప్రతి జాతీయగీతంలోనూ 'తమ దేశం ఎల్లప్పుడూ స్వతంత్రంగా వుండాలని' భగవంతుని ప్రార్థిస్తారు.

కొన్ని దేశాల జాతీయగీతాల అర్థాలను మీకు వివరిస్తాను.

ఇంగ్లాండు దేశపు జాతీయగీతం:

దయామయియైన మన రాణిని భగవంతుడు రక్షించు గాక! ఆమె ఎక్కువకాలం జీవించుగాక! ఆమెకు విజయం ప్రాప్తించుగాక! చాలాకాలం రాజ్యాన్ని పరి పాలించుగాక! ఓ ప్రభూ! శత్రువులను ముక్కలుచేయి. వారిని ఓడించు. వాళ్ళ ఎత్తులను పడగొట్టు. మా రాణి మీదే మా ఆశలన్నీ! ప్రపంచంలో శక్తి అంతా ఆమె కోసమే. యుగయుగాలు ఆమె జీవించాలి. మా ఉద్దేశా లను రక్షించు. దయగల మారాణిని రక్షించమనే ఈ గీతాన్ని పాడుతుంటాము.

'హెన్రీ కేరీ' ఈ గీతాన్ని రచించారు.

ఆస్ట్రేలియాదేశపు జాతీయగీతం:

భూమినీ ఆకాశాన్నీ సృష్టించిన ఓ దేవుడా! మేం నీ కేం యివ్వగలం! అంతా నీదే! ఈరోజే మాది. రోజంతా నిన్నే స్తుతిస్తుంటాం. ఈ దేశం నీది! ఓ భగవాన్! మా దేశాన్ని రక్షించు.

ఈ గీతాన్ని 'బ్రిటన్ స్టీఫన్' అనే కవి వ్రాశారు.

ఆస్ట్రియా దేశపు జాతీయగీతం:

"నా చిన్న దేశమా! డెన్యూబ్‌నది నీ గుండెలపైనుంచి రక్షగా వ్యాపించివుంది. దక్షిణదిశను ఎత్తైన పర్వతాలు ప్రహరీలై నిల్చున్నాయి. నువ్వు భయపడవలసిన అవసరం ఏముంది?"

దీనిని వ్రాసినవారు మైకేల్ హైనిశ్.

మన భారతదేశపు జాతీయగీతాన్ని రాసినవారు ప్రముఖదేశభక్తుడు 'విశ్వకవి' రవీంద్రనాథ్ టాగూర్.



'వేకువ రంగవల్లికలు'

చిత్రకారుడు: మారేమండ శ్రీనివాసరావు, గుంటూరు.

# "ఆచార్య దేవో భవ"

— 'అనంతం'

కోటివిద్యలైన కూటికే విద్యలై
బ్రదుకు బ్రదుకుకొఱకె బ్రదుకఁబడుట
బ్రదుకలేనివాఁడు బడిపంతులైనాఁడు;
పరువు లేనివాఁడు గురువు నేఁడు.

'అద్ది నాకు వలయు' ననుకొను మది యెండ
మావి యగును; మింటిపూవు నగును;
'వచ్చెనేని గెంటివైచెద' ననుము, నీ
యింటిముందు కుక్కవంటి దగును.

'నన్ను గౌరవింపకున్నా' రనుచు నేడ్వ
నెగిరిరారు గౌరవించువారు;
అట్టె విడువకుండ అతిగ వాపోవుచో
ఉన్న సుంతకూడ నూడిపోవు.

గురువు మల్లెయైన ధరజనుల్ తుమ్మెదల్
గురుని సుగుణమధువుకొఱకు మూఁగు;
వట్టి డాంబికునకుఁ బట్టరు గొడుగులు
ఉల్లికంపు తేటు లొల్లఁబోవు.

డంబమునకు నున్న డంబున కొకసారి
యెవఁడో మోసపోవు టెపుడుఁ గలదు;
కాని, కల్ల — నిజముఁ గానంగనౌ రోజు
రాకపోదు, కల్ల పోకపోదు.

విద్య, వినయ మున్న, వెలసినఁ బాత్రత,
గౌరవమ్ము వచ్చితీరుఁ దానె;
అవ్వి యున్న యాతఁ డాసింపఁబోవఁ డా
గౌరవమ్ముఁ; గాని, కాంచు దాని.

వ్యాసముఖ పురాతనాచార్యవర్యులఁ
దలను దాల్చువారి తనయులేమి,
గురునిఁ గొంచపరచుకొను టేమి ? ఇందులో
నెవరు నెఱుఁగలేని దేమికలదు ?

కాసుకొఱకు బోధ గావింపఁబోవని
వ్యాసమునిని దేవుఁడనుట పొసఁగె;
చదువు — కొనినవాఁడు సరు కెంత మంచిది
యిత్తు వంతవఱకె కృతముఁ దలఁచు.

"పను జేయునట్టి దెట్టిదైనను నేమి ?
వినుము చెప్పునదియె" అనుట తప్పు;
చేఁత నెల్ల వేళఁ జిత్తానఁ దలఁచును;
చెప్పుదాని మఱచు శీఘ్రముగనె

కాని, లోనికంటెఁ గప్పిన పొరఁజీల్చు
వెజ్జులైన యట్టి యొజ్జలఁ బ్రజ
మెచ్చుకుంట - తమకె వచ్చు మే ల్పెబ్బరల్
గనకయుంట - హితము గొనకయుంట !

'శ్రీ'యని యెట్టికార్య మొనరింపఁదలంచిన వేళనైన 'వం
దే' యనిపించుకోఁదగిన దివ్యుఁడు: మూవురుమూర్తు లొక్కఁడై
నా యఖిలాజ్ఞతా గిరివినాశ పరాయణవజ్రి; నా యుపా
ధ్యాయుఁడు, లోకగేయుఁడు సహాయుఁడు నౌనుద్విలోక యాత్రలన్.

వ్యాసపత్రం:

# "జననీ జన్మభూమిశ్చ..."

బి. కరుణాదేవి

దేహం కొంకర్లుపోతున్న ఈ రాత్రి వ్రాయటానికి వీలుచిక్కింది నా ఆత్మకథ...

శరీరాన్ని గిలిగింత పెడుతున్న చలిని నా కౌగిట పొదిగిపెట్టి వ్రాయబోతున్నాను.

మనసున కానందం ప్రసాదించి, నరాలకు నవచైతన్యం కలిగించే శీతలపవనాన్ని ముందుగా స్మరించనీ! ఆ శిశిర పవనుడే... సముద్రమట్టానికి ముప్ఫైవేల అడుగుల ఎత్తున – ముక్కంటి పదసాన్నిధ్యంలో– ఉత్తుంగ శిఖరాలనడుమ – ఉనికి నేర్పరచుకున్న మాకు కులదైవం. మా జీవితాలకు వేగుచుక్క. నిద్రాణమైన మనసులకు వైతాళికగీతిక!

దేశరక్షణ కవకాశం కలిగిందన్న గర్వం పొడసూపిననాడు, నశ్వరమైన శరీరమంటే అలసభావం కలుగుతుంది. శాశ్వతమైన ఆనందం ప్రసాదించే ధర్మం దెసకు మరలుతుంది మనస్సు. జీవితానికి చక్కిలిగింత పెడుతుంది.

నిజమే! దేశరక్షణకు పాటుపడే అవకాశ మెందరి కబ్బుతుంది? ఎన్ని జన్మాంతర సంస్కారాలవల్ల అది లభ్యమవుతుందో?

విక్రమార్కుడి సింహాసనంమీద కాల్మోపితే – తామరతంపరలు విచిత్రానుభూతులు కలిగేవని వినికిడి. అది నిజమో, కాదో తెలిలేదీ హిమనగంపై కాల్మోపేవరకు... ఇప్పుడిప్పుడే అది నిజం కాబోలుననిపిస్తుంది.

హిమనగమంటే – తొలుత గంగకుజన్మనిచ్చినముసలిముత్తైదువ జ్ఞాపకాని కొస్తుంది. గంతులేస్తున్న గంగను చూడగానే, ఆ గంగావతరణానికి జీవితాన్నే బలిపెట్ట వెనుకాడని ధీశాలి భగీరథుడు మనోవీధిలో మెదలుతాడు. మెదలటంతోనేనా? ఆయన కృషి మనకు తోడునీడై, తలలో నాలుకై, మనలను ధర్మపథంవైపు నడుపుతుంది. అంతటితో ఆగితే తీరిపోను?

మహనీయుల హృదయోన్నత్యంవంటి మంచిమనసులను తనబిగికౌగిట బంధించటానికి చేతులు జాపుతుంది. ఆ హృదయంలోనిపవిత్ర భావాలవంటి ధవళకాంతులు మందహాసంతో మనల నాహ్వానిస్తాయి. ఈ ప్రశాంత ప్రకృతిలో ఎంతటిలాలన, ఆదరణ లభ్యమౌతాయని?

హృదయాన్నుద్రూత లూగించే ఈ రమణీయ ప్రదేశంలో – ఆధ్యాత్మికంగా ఉన్నత పథానికి నడపించగల ఈ సుందరసీమలో అడుగిడటమే ఒకఅదృష్టవిశేషం. అందునా, ఒక మహదాశయంతో, మాతృదేశారాధనాకాంక్షతో – అడుగిడటం జన్మను తరింపచేసుకోటమే.

మనవూరు, మనవారని మన మెన్నో భ్రమలుపోతాము! ఎక్కడివూరు? ఇక్కడి ఔన్నత్యాన్ని కొలవటాని కేకొలబద్ద చాలదు. కొత్తకొలబద్ద కావాలి. ఎల్లలోకములొక ఇల్లనే' మాట వింటేనేచాలు – మనసుపులకరిస్తుంది. విశాలమైన ఈ ఇంటికి కొలబద్ద హిమనగం. అండదండ ఆదిదంపతులు. శబ్దార్థములవంటి గౌరీశంకరులు విహరించిన కైలాసశిఖరం. తానమాడిన మానసం తలచుకుంటేనేచాలు మేను జలదరిస్తుంది.

ఈ సీమలోనే శేషజీవితం గడుపుదా మనే సంకల్పం నారుపోసుకుంటుంది. ఆ అపురూపమైన భాగ్య మబ్బాలేకాని, జారవిడచుకోటానికి మన సంగీకరించదు. జారవిడుచుకునే మందమతి లభించడు,

గరళకంఠుడికి, ఆదిశక్తికి 'పహరా' పట్టవలసిన భాగ్యం ఈ దాసుడికి కలిగింది. రుద్రుడిపై దాడి సాగించటం? ఆ రుద్రుడికి మేము పహరాపట్టటం? అంతా ఆ చిన్మయుని లీలావిలాసం.

పూర్వం మహాభక్తులకే పరమాత్మునికి వింజామరలు వీచే భాగ్యం, మాలికలు కూర్చి అర్పించే అదృష్టం లభించేవట. కాని, ఈనాడు నావంటి భక్తాంఘ్రిరేణువుకు సహితం ఆ భాగ్యం కలగటం "కోటిజన్మల తపఃఫలం."

ఇలా ఆలోచించేకొద్దీ, ఆద్యంతాలు తెలియని భావా లెన్నో నాలో గట్లుతెంచుకుంటాయి. మమత అంటే కొత్త అర్థం స్ఫురించిం దిక్కడ. భవబంధాలు తెంచుకొమ్మని హెచ్చరించటానికి మనస్సుకిక్కడ రెక్కలు వచ్చాయి, జీవితాన్ని కొత్తకోణంలో పరిశీలించమని కోరటానికి వివేకాని కిక్కడ అవకాశం కలిగింది.

ఏమిటీ కొత్తవిల్వలు? ఎందు కీ కొత్త కొలబద్దలు? దేశకాలపరిస్థితులు మారినందువల్ల, నావాడు, నావాడు అనేభావం తొలగి

పోయింది. నానాడు అనే కొత్తభావంమొగ్గ తొడిగింది. దేశమంటే మమకారం కలిగింది. మా నవత్వ మంటే ఆప్యాయత తొంగి చూచింది. ఇది .ఈ యుగధర్మం. త్యాగం చేయాలి దేశంకోసం – ఇదే నలుపదికోట్ల హృదయాల్లో స్పందిస్తూన్న శపథం. నాతల్లి ఐనదేశంకోసం త్యాగం చేయాలి. స్వేచ్ఛగా, గర్వంగా నేను తలెత్తుకు తిరగటంకోసం ఈ గడ్డను రక్షించుకోవాలి. ఇదే యెల్లెడలా ప్రతిధ్వనిస్తున్న ప్రతిజ్ఞ.

చరిత్ర నిర్వచించిన కొత్త అనుబంధం ఇదే. సంకుచితమైన పాత భవబంధాలు పటా పంచల్జేసి, కొత్తబంధంలో జీవితాన్ని కైంకర్యం చేయటం నేర్చుకున్నాను.

ఈ మాట వింటే "మీ పార్వతి !" సంగ తేమిటని ప్రశ్నిస్తారు. పట్టుమని పాతికేళ్ళు నిండని గోపాలం, పండు ముసలిలాగా మాటాడుతా దేమని నివ్వెరపోతారు ! నాకు తెలుసు.

ఎందుకు నా పార్వతిని గుర్తు చేసి, ఒక నాడు నాలో ఉవ్వెత్తుగా రేగి, అణగారిన ఆవేదనలను వియోగబాధను జ్వలింప చేస్తారు ?

అప్పటికింకా పార్వతి పెట్టుకున్నపారాణి ఆరలేదు. నా కళ్యాణ కంకణం విసర్జించ లేదు. తొలి వలపులోని తడి ఇంకలేదు. అంతలోనే 'దేశం పిలిచిందన్న' మాట నా యెదను బల్లెమై నాటింది.' మనసులో పెను తుఫానును రేపింది.

నా గారాల పార్వతి ఒకవంక, గౌరవం కోసం ముష్కరులతో పెనుగులాడుతున్న ముదివగ్గు ముత్తైదువ దేశమాత మరొక వంక ! నా మనోనేత్రం ముందు ఆ దృశ్యం ఇంకా నాట్యమాడుతున్నది ?

జీవితరంగంలో అడుగిడబోతున్న పార్వతి నెలా త్రోసిరాజనటం? త్రోసి రాజని, ఎలా వియోగబాధను భరించటం ?

మా వూరే అలకాపురిగా, నేనే యక్షునిగా కొండచరియల్ని చుంబిస్తున్న మేఘమాలిక లను ఆషాఢ మేఘునిగా ఊహించుకొని తీరని మనోవేదనకు గురియైనాను.

ఒకనాడు అద్దంవంటి అంతరాత్మ గర్జిం చింది: "నీ జాతి ప్రతిష్ఠ గంగపాలవుతుంటే నీ వింకా గోళ్ళు గిల్లుకుంటున్నావ్వా ? నీ దేశ గౌరవం మంటగలిసిననాళ్ళు నీవ్వు బ్రతుకుకొనే దేమిటి ?" అని.

"అదిగో అటు చూడు : దాస్య శృంఖ లాల్లో తగులుకొనటాని కిచ్చగించని దేశ మాత. పదిహేడు వసంతాలకిందటి నీ స్థితి జ్ఞాపకం చేసుకో ! ఆనాడు నీవు స్వతంత్ర భారత పౌరుడి వని చెప్పుకొని, తలెత్తుకొని తిరిగేవాడివేనా?" నా వివేకాన్ని కొరడాతో కొట్టిన ట్టనిపించింది.

"ఆ దుస్థితినుండి నిన్ను తప్పించటానికి మీ తాత ముత్తాతలు గోళ్ల గిల్లుకున్నారా ? లేదే ! తమ జీవితాల్నే పణం పెట్టారు ? పులికడుపున మేకపిల్ల పుట్టినట్టు..."

"చాలించు, నే నీ అపవాదులు భరించలేను చిత్తక్షోభ సహించలేను. పగతుర గుండెల్లో రక్తంతో నా మాతృభూమి ఋణం తీర్చు కొని కాని, అడుగు బెట్టను నేనీ గడ్డపై." ఆవేశంతో నా అంతర్వాణిని హెచ్చరిం చాను.

ఆ మాట విన్న నా పార్వతి కుడికంటిలో కన్నీటిని, ఎడమకంటిలో ఆనందభాష్పాన్ని దాచుకుంటూ, "క్షేమంగా వెళ్ళిరం" డని అంది బొంగురుగొంతుకతో.

నా నిర్లిప్తతకు నాకే సిగ్గనిపించింది. కంటికి రెప్పలా కాపాడి, ఉగ్గుపాలతోపాటు వీరుల కథలను కూడా రంగరించి, త్రావించి కడకు కంటికి చూ పానక, కంటికి రెప్పవలె కాపాడవలసిన కొడుకును కదనభూమికి ఆభరణంగా సమర్పింప సమకట్టిన 'మా అమ్మ' పవిత్ర పాదాలకు నమస్కరించాను.

"జననికంటే ఉత్కృష్టమైనది జన్మ భూమి. ఆ జన్మభూమికి ఆపద కల్గిననాడు ఆదుకోవటం మన విధ్యుక్త ధర్మం. దేశ మాత సౌభాగ్యంతోనే మన జీవితాలు ముడి పడ్డాయి. ఆమె ఆనందంలోనే మన ఆనందం దాగి వుంది. వెళ్లు. నీ కర్తవ్యం నీవు నిర్వ ర్తించు. నా గురించీ, పార్వతి గురించీ బెంగ పెట్టుకోకు. ఇకనుంచీ తల్లైనా, తండ్రైనా దేశమే ! క్షేమంగా వెళ్ళి లాభంగా రా ?" అని ఆశీర్వదించింది;" పేదరికానికి నొచ్చు కొని 'నన్నీదేశానికో పెద్ద నగగా' సమ ర్పించిన మా అమ్మ.

అంతలోనే హారతిపళ్ళెంతో వచ్చింది పార్వతి. అప్పటి పార్వతి మగువమాంచా లగా, ఆరాధ్యదేవతగా నా అంతరాంత రాలలో నిలిచిపోయింది.

నిజానికి, తొలిసారిగా ఆ కొత్త కొల బద్దతో వారి త్యాగదీక్ష కొలవదగింది.

వారి త్యాగాలముందు నాత్యాగాని కున్న విలువ ఏపాటి దని, మదనపడుతుంటాను. వీలున్నప్పుడెల్లా, మంచుమలకు మహదాశ యాని కంకితమైన "నేను".

---

# ప్రభుత్వ నిర్ణయాలు

✻ 58 పట్టణ మునిసిపాలిటీలలో రక్షిత మంచినీటిసరఫరా పథకాలను అమలు జరపడానికి రూ. 4,10,00,000 లు కేటాయించాలని నిర్ణయించారు. యీ పథకాల అమలుకు అయ్యే ఖర్చులో 87½ శాతం గ్రాంటుగాను, 12½ శాతం ఋణంగాను యీ మొత్తంనుంచి ఇస్తారు.

✻ నాగార్జునసాగర్ క్యాంపులోఉన్న తూర్పుపాకిస్తాన్‌కు చెందిన 350 కాందిశీకకుటుంబాలకు సబ్సిడరీ ఆదాయం కల్పించేందుకు వీలుగా చేనేతవంటి కుటీరపరిశ్రమలను నెలకొల్పాలని నిశ్చయించారు. కాందిశీక కుటుంబాలకు యిప్పుడుయిస్తున్న ఆర్థికసహాయాన్ని మరికొంత కాలం కొనసాగించాలనికూడా నిర్ణయించారు.

✻ తెలుగుటైపురైటర్లకీ బోర్డును ఖరారుచేయడం జరిగింది. ప్రథమదశలో 150 టైపురైటర్లను కొనుగోలుచేయాలని ప్రభుత్వం నిశ్చయించింది. యీ టైపురైటర్లను ఉపయోగించడంలో శిక్షణ ఇవ్వడానికి శిక్షణకేంద్రాలను ప్రారంభిస్తారు.

✻ ఆంధ్రప్రదేశ్ కాంటెంజెన్సీ నిధిని రూ. 3 కోట్లనుంచి రూ. 5 కోట్లకు పెంచాలని నిశ్చయించారు. యితరవిషయాలకుతోడు బర్మానుంచి వచ్చే భారతీయుల పునరావాసానికి కూడా యీ నిధిని ఉపయోగిస్తారు.

✻ మత్స్యశాఖ డైరక్టొరేటుకు ఎదురుగా ఉన్న 6 ఎకరాల స్థలాన్ని కార్పొరేషన్ కార్యాలయం భవనాన్ని నిర్మించడానికి వీలుగా మునిసిపల్ కార్పొరేషన్‌కు ఇవ్వాలని నిశ్చయించారు.

✻ రాయలసీమలోని గ్రామీణ సహకార పరపతిసంఘాలను, రిజిస్ట్రేషన్ నియమావళిక్రింద చెల్లించాల్సిన రుసుమునుండి మినహాయించాలని ప్రభుత్వంవారు నిశ్చయించారు.

✻ సికింద్రాబాదులోని కంటోన్మెంటుప్రాంతంలో వృత్తి కళాకారులకై పారిశ్రామిక శిక్షణ సంస్థను ప్రారంభిస్తారు. యీ సంస్థలో 264 మందికి ప్రవేశఅవకాశం ఉంటుంది. యీసంస్థకై రూ. 20.00 లక్షల అనావృత్తఖర్చు అవుతుంది. ఇందులో మూడవ ప్రణాళికకాలంలో రూ. 11.00 లక్షలు, మిగతామొత్తం నాల్గవ ప్రణాళికకాలంలో ఖర్చుచేస్తారు.

✻ ప్రభుత్వసర్వీసులో నియమించబడిన వైద్యపట్టభద్రు లందరూ 3 సంవత్సరాలపాటు ప్రజారోగ్యశాఖలో పనిచేయాల్సిఉంటుంది. యిందులో 2 సంవత్సరాలు నిరంతరాయంగా పని చేయాలి.

✻ తాడేపల్లిగూడెం, విజయవాడ, రాజమండ్రి, గుడివాడ, మచిలీపట్నం, నంద్యాల, నిజామాబాదు, రేణిగుంట, కొడవలేరు, తెనాలి, మహబూబునగర్, సంగారెడ్డి ప్రదేశాలలో ఆహారధాన్యాల నిలువచేయడానికి రూ. 3.00 కోట్లఖర్చుతో గోదాములను నిర్మించాలని నిశ్చయించారు. యీ ఖర్చుమొత్తాన్ని భారతప్రభుత్వం భరిస్తుంది. యీ గోదాములలో 3.25 లక్షటన్నుల ధాన్యాలను నిల్వ చేసే అవకాశం ఉంటుంది.

విశ్వమానవ సౌభ్రాత్రతను విశదపరచి విశ్వవిఖ్యాతివడసిన

# విశ్వపురుషుఁడు వివేకానందుఁడు

కె. విశ్వేశ్వరరావు



*"Arise, awake and wait not till the goal is reached."*

— SWAMI VIVEKANANDA.

క. భగవంతుండగు విష్ణుఁడు
జగముల కెవ్వేళ యేని రాతుసవ్యథ
కలుగున్
తగ నవ్వేళల తడయక
యుగయుగమునఁ బుట్టి కాచు
నుద్యల్లీలన్"

—భాగవతము.

ముప్వురు కుమార్తెలు పుట్టిన తరువాత భవానీదేవి పుత్రుని కొఱకు శివుని తాను ప్రార్థించుటయేగాక, కాశీలో నివసించుచున్న తన మేనత్తను శివునికి పూజలొనర్చుమని కోరెను. ఆమె మేనత్త యొనరించిన పూజలు, గంగాభిషేకములు, ఆమె యొనర్చిన ప్రార్థనలకు ప్రతిఫలముగా శివుఁడు తానే అవతరించుచున్నట్లు భవానీదేవికి కలలో కనపడి చెప్పెను. 1863 సం॥ములో మకర సంక్రాంతికి ముందటి రోజున, జనవరి 12వ తేదీని శివుఁడు నరేంద్రనాథ దత్తుగా అవతరించెను. గౌతమబుద్ధుని తల్లి మాయాదేవికి బుద్ధ జననమునకు ముందుగా నిష్ఠేయొక తెల్లయేనుఁగు ఆరు దంతములతో స్వప్నమందగపడెను.

"ఇతఁడే సుమీ భువనేశ్వరీదేవి
కడుపార గన్న బంగారు బిడ్డ"

నరేంద్రుని పితామహుఁడు పిన్న వయసుననే సన్యాసాశ్రమము స్వీకరించెను. ఈతఁడు జనించిన గృహము ఉత్తమ సంస్కృతీ సాంప్రదాయములకు ఆధ్యాత్మిక చింతనకు తావలము,

శ్లో॥ "...యోగినామేవ భవతి ధీమతామ్
ఏ తద్ధి దుర్లభతరమ్ లోకే జన్మయదీ
దృశమ్"

— భగవద్గీత.

శివాజీ తల్లి జిజియాభాయి శివాజీకి చిన్నతనమున భారత రామాయణములందలి వీర గాథలను బోధించినట్లే, మిక్కిలి దైవభక్తి కలిగిన భవానీదేవి నరేంద్రునకు రామాయణ భారతములలోని వీర చరితములను ఉగ్గుపాలతోఁ ద్రావించెను. బుద్ధునకు చెన్నుఁడను రథచోదకునివలన మనస్సు మారినట్లు నరేంద్రునకు తన తండ్రిబండినడపువానితో గలిగిన సంభాషణలతో మనసు మారి "జీవితములో పెండ్లియాడ కూడదు. పెండ్లాడినచో సుఖము, స్వేచ్ఛ పోవును" అని నిశ్చయించుకొనెను.

శైశవమునుండియు నరేంద్రుఁడు త్యాగశీలుఁడు, బిక్షకుల నెన్నడును రిక్తహస్తములతో పోనిచ్చెడివాఁడుకాఁడు, సన్యాసులకు నడుముకు కట్టుకొన్న నూతన వస్త్రములనైనను దానమిచ్చి పంపెడివాఁడు. తలిదండ్రు లితని మేడపై యంతస్థునందలి గదిలోనుంచగా తలుపులు బిగించుకొని ధ్యాన నిమగ్నుఁడై ధ్యాననిష్ఠ నభ్యసించెను.

విద్యార్థిదశనుండియు నరేంద్రునకు "భగవంతుని స్వరూపమెట్టిది?" అను సందియము కలిగెను. ఒకనాఁడు నరేంద్రుఁడు బ్రహ్మసమాజమునకు అధ్యక్షుఁడగు దేవేంద్ర నాథ టాగూరు (రవీంద్రనాథ టాగూరు తండ్రి)ను "ప్రభూ! మీరు దేవుని చూచితిరా?" అని ప్రశ్నించెను. అందులకా మహర్షి యొసగిన సమాధాన మీతనికి నచ్చలేదు. ఈ ప్రశ్ననే దక్షిణేశ్వరమున నివసించుచున్న తన భావిగురువు రామకృష్ణ పరమహంసను దర్శించినపుడు వేసెను.—

"స్వామీ! తమరు దేవునిచూచితిరా?" అని యడిగెను. "నేను చూచుటయేగాదు నీవుకూడ దైవసాక్షాత్కారమును పొందుటకు తోడ్పడగల" నని ఆ పరమహంస ప్రత్యుత్తర మొసంగెను. నరేంద్రుఁడు సన్యసించి వివేకానందుఁడనబరగెను. ఆనందుఁడు బుద్ధునకు ముఖ్యశిష్యుఁడైనట్లు వివేకానందుఁడు రామకృష్ణునకు ముఖ్య శిష్యుఁడయ్యెను.

"నీ జీవితాశయ మేమ"ని యొకనాఁడు పరమహంస వివేకానందు నడిగెను. "ధ్యాన నిమగ్నుఁడనై సమాధినిష్ఠ సాధించుటయే" అని శిష్యుఁడు బదులు పలికెను. "నీవంతటి స్వార్థపరుఁడవు, అల్పుఁడవని నే నను కొనను. లోకము నుద్ధరించుటే శ్రేయము. మానవసేవయే మాధవసేవ. "విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి కావింపు" మని గురువు శిష్యునకు బోధించెను. గురువుగారి బోధనల గ్రహించి భారతదేశమెల్లెడల పర్యటించి భారతమాత నిజస్వరూపమును మొదట కనుగొనెను.

అయితే భగవంతుని స్వరూప మెట్టిది? ఏ స్వరూపములో వివేకానందుఁడు భగవంతుని చూడఁ గలిగెను?

భగవంతుఁడనిన వివేకానందునకొక

ప్రత్యేక దృక్పథము కలదు. "సమాజమే భగవంతుడు. సోదర మానవసేవయే ముక్తికి త్రోవ" కావుననే వివేకా నందుఁడిట్లు బోధించెను. దేవుని వెదకుటకు ఎచ్చటికి వెళ్లుచున్నారు? కోట్ల కొలది ఉన్న ఈ ప్రజలు దేవులుకారా? గంగానదీ తటము నందు బావి త్రవ్వదలచు చున్నారా? ఈ ప్రజలను ప్రేమించండి; ఆరాధించండి. నిరుపేదల కష్టములను చూచి వలవల విలపించు వాఁడే మహాత్ముఁడు. లేని యెడల వాఁడు దురాత్ముఁడే. నిజమైన జాతి గుడిసెలలో నివసించు నని జ్ఞాపకముంచు కొనండి. భారతదేశములో ఒకకుక్క యైనను ఆకలి బాధతో అలమటించ కుండునంత వరకు ఈ భారత భూమిపై మరల మరల వేయి మార్లైనను జన్మించి సమాజోద్ధరణకు శ్రమ పడెదను. స్వీయముక్తిని కోరను. నా జాతిలో ఒక్క శునకమైనను ఆకలితో అల్లాడు చున్నచో నేను స్వర్గమునకు కూడా వెళ్లుటకు ఇష్టపడను. ఒక సామాన్య కుటుంబములో జన్మించి, తండ్రి విశ్వనాథ దత్తు 1884 సం॥ లో మరణించిన పిదప దారిద్ర్యము ననుభవించిన నరేంద్రుడే వివేకానందుడై 'దరిద్రనారాయణ' (నారాయణుఁడు దరిద్రునిలో నున్నాడు. వానిని దర్శించుఁడు) అను పదమును వ్యాపింపఁ జేసెను.

శ్లో॥ "విద్యా వినయ సంపన్నే
బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకే చ
పండితా స్సమదర్శినః"
—గీత—5-18

శ్లో॥ "సర్వ భూతస్థ మాత్మానం
సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శయః."
—గీత—6-24

శ్లో॥ "సమం సర్వేషుభూతేషు
తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్య త్స్వవినశ్యంతం
యఃపశ్యతి సపశ్యతి"
—గీత—13-27

చాలకాలము అజ్ఞాత సన్యాసిగా గడపిన వివేకానందుఁడు 1893 సం॥ ములో అమెరికాలో చికాగోపట్టణమున జరిగిన సర్వమత సమావేశములో హిందూమత ప్రాశస్త్యమును ఎల్లర కెఱుకపఱచిన తరువాత ప్రపంచ మతప్రవక్త లందఱిలో ప్రసిద్ధుఁడుగా కీర్తింపబడెను. ఆసభకు హాజరైన శ్రోతలలో చాలామంది ప్రమోదభరితులై ఆతని శ్లాఘించిరి. ఆతనియెడల తమకుగల గౌరవార్ధముగా ఆతని పవిత్ర పటములు కొనుటయేగాక ఇంకను ఆతని ఉపన్యాసములు వినవలెనని ఆత్రతతోనుండిరి. ఆ మత సభాధ్యక్షుఁడు డా॥ జె. హెచ్. బేరోస్ "ఈ మతసభలో వివేకానందుఁడే నిజముగా మిక్కిలి మాన్యత గడించినవాఁడు; ప్రతిభావంతుఁడనుట నిర్వివాదాంశము" అని పేర్కొనెను. అమెరికా దేశమునందలి వార్తా పత్రికలన్నియు వివేకానందుని వ్యక్తిత్వమును ఉపన్యాసపటిమను వేనోళ్ళఁ బొగడిరి. న్యూయార్కు హెరాల్డు అనునొక ముఖ్యమైన పత్రిక స్వామినిగురించి "నిస్సంశయముగా ఈ మహాసభలో వివేకానందుడే అందఱికన్న గొప్పవాఁడు" అని ప్రకటించెను.

ప్రాక్పశ్చిమ మేధావులు వివేకానందున కొసంగిన జోహారులే ఆయన విశ్వమానవతను చాటుచున్నవి. సుప్రసిద్ధ తత్త్వవేత్తయైన మేక్సుమూల్లర్‌కు ఆయనయెడ చాల భక్తిగౌరవములు కలవు .ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత రోమేరోలా ఆయనను శ్లాఘించుచు నొక పెద్ద గ్రంథమును వ్రాసెను. డా. ఏనిబిసెంట్ "మహాయోధునివంటి యోగి"యని ఆయనకు జోహారులొసంగెను. అరవింద యోగి "మానవులలో సింహమువంటి వ్యక్తి యెవరైన నున్నచో నట్టివ్యక్తి వివేకానందుఁడే. ఆయన మనల నింకను ప్రభావితులను చేయుచున్నార"ని శ్లాఘించిరి. సర్దార్ ఫణిక్కర్ "ఆయన కృషివలన భారతీయులు హిందూమతమును గూర్చి న్యూనత పడవలసిన దేమియు లేదనువిషయము తొల్దొల్త గ్రహించి" రని 'భారతదేశ చరితాసమీక్ష' అను గ్రంథములో పేర్కొనిరి.

స్వామి వివేకానంద అమెరికాకు రెండు మారులు వెళ్ళెను. పైన చెప్పినట్లు 1893 సం॥లో సెప్టెంబరు నెలలో చికాగో పట్టణమున జరిగిన మత సభకు మొదటిమారు, 1896 సం॥న రెండవమారు.

1893 సం॥లో మత సభ ముగిసిన తరువాత వివేకానందుఁడు అమెరికా ఖండ మంతటిలో పర్యటించెను. హిందూమతమును గూర్చి పలుపట్టణములందు పెక్కుమంది శ్రోతలుగల సభలలో ఉపన్యసించెను. ఈ పర్యటనలో పలుసంస్థలు,వ్యవస్థలు, ప్రజలతో సన్నిహితముకలిగెను. అట్టి ప్రజలలో కొంత మంది ఆయనకు శిష్యులైరి. అమెరికానుండి తిరిగి వచ్చిన తరువాత అమెరికా దేశపు శిష్యులతో అతివైభవముగా అమెరికా స్వాతంత్ర్య దినోత్సవ మొనర్చెను.

1896 సం॥లో స్వామి రెండవమారు అమెరికాను సందర్శించినపుడు న్యూయార్కు పట్టణమున 'వేదాంత సమాజము'ను స్థాపించెను. సహనము, విశ్వమానవత్వము దీని ముఖ్యాశయములు. ప్రాక్పశ్చిమ భూభాగముల కీ సంస్థ సాంస్కృతిక సంబంధము కల్గజేయునని ఆయన ఉద్దేశించెను. ప్రాక్పశ్చిమములకు అమెరికాయొక వంతెన కాగలదని ఆయన యోచించెను.

మానవ సేవనుమించు పరమార్ధములేదను మంత్రరాజమొడిఁబెట్టి, ప్రజలను సహోదరులవలె భావించి, విశ్వమానవ సౌభ్రాత్రతను ప్రపంచమునకు చాటిన మహనీయుఁడు వివేకానందుఁడు. సన్యాసియైనను 'నరసేవయే నారాయణసేవ' యను దృఢవిశ్వాసముతో మానవసేవ యొనరించిన కర్మయోగి, ఆయన చెప్పినట్లు, మఱల భారతగడ్డపై ఆయన అవతరించునెన్నడో!

శ్లో. "యదా యదాహిధర్మస్య గ్లా
నిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం
సృజామ్యహమ్.
భగవద్గీత

—o—

# వనితాలోకం



# స్త్రీల సారస్వతము

ఆకుండి రామశర్మ

సారస్వతం అనేది స్త్రీ పురుష విచక్షణ లేకుండా అందరి సొత్తు అనే మాట వాస్తవమే. కాని స్త్రీల అభిరుచులకు, ఆశయాలకు, అంతస్థులకు తగినట్లుగా కొన్ని పాటలు పూర్వం వారికోసమే ప్రత్యేకంగా వ్రాయబడి వనితాలోకంలో మంచిప్రచారంలో ఉండేవి. ఆ పాటల్లో మన ప్రాచీనుల జీవిత విధానం, ఆచారాలు, సంప్రదాయాలు కొంత వరకు వర్ణించబడ్డాయి. ఆ కారణంగా ఇంపైన ఆ పాటలను 'స్త్రీల సారస్వతం' అనే పేరుతో పిలవడం సాహసం కానేరదు.

ఈ మనోహరములైన పాటలు కొంత కాలం వరకు మన ఇళ్ళలో వయసు మళ్ళిన తల్లుల, బామ్మల, జిహ్వారంగమున నెలకొనియుండి రూపురేఖలు చెడకుండ వెలయుచుండెడివి. కాలప్రభావంలో వచ్చిన మార్పులతోపాటు స్త్రీల సారస్వతంలోకూడా గొప్ప పరిణామాలు వచ్చాయి. వారి దృక్పథంలో మార్పుల కనుగుణంగా వారి సారస్వతమే మారింది. ఆధునిక స్త్రీలు పురుషులతోబాటు సమానంగా అందుబాటులో ఉన్న అన్ని సారస్వతాలను అనర్గళంగా ఆకళించుకోగల్గుతున్నారు. నేడు ప్రత్యేకంగా వారి కొరకు సారస్వత సృష్టి జరుగవలసిన అగత్యం అంతగా కనిపించదు. లోగడ జరిగిన సారస్వత సృష్టిలోని కొన్ని పాటలు చిన్న చిన్న పుస్తకరూపమున వెలువడి కులగోత్రాదులు గోల్పోయిన భ్రష్ట వ్యక్తివలె సమగ్రముగా రూపు చెడి లోకమున చెలామణి యగుచున్నవి. నన్నయకు పూర్వమునగల శాసనాదుల నైన చదువుకొని విషయగ్రహణం చేయుట సులభము కాని, పై నుదహరింపబడిన పుస్తకములలోని విషయం తెలిసికొనుటకు తగుమాత్రమేనా అవకాశము లేకపోవుట శోచనీయం. అయినా భాషాభిమానంతో ఈ పాటలను సవిమర్శకంగా చదువువారికి కొంత గుణం కనుగొనే అవకాశం వుంది. అయితే యిట్టి పరిశీలనమువల్ల కలిగే ప్రయోజన మేమిటి? తరతరాలనుండి మన కనుశ్రుతంగా వస్తూన్న ఈ పాటలను భద్రపరచుటకేనని సమాధానము. నామమాత్రావశిష్టము లైన వామనగుంటలు, గొబ్బెళ్లు మున్నగు బాల్యక్రీడలవలె నీ పాటలుకూడా అడుగంటగల వను భీతి లేకపోలేదు.

ప్రస్తుతం ప్రచారంలోనున్న పాటలన్నీ ఇంచుమించుగా భారత, భాగవత, రామాయణములలోని కథలనే యితివృత్తముగా కలిగియున్నవి. వానిలోని భాష సర్వసాధారణమైన వ్యావహారిక శిష్టజన భాష. ఛందో విషయకంగా పరిశీలిస్తే తగుమాత్రం తేడాలో ద్విపదవలె నడచు పద్యరూపంలో ఉన్నాయి. దేశీయవృత్తాలైన సీసం, గీతం, అక్కర, మంజరి, మున్నగున వన్నీ అతి ప్రాచీనములైన ఈ పాటలనుండి ఆవిర్భావం పొందినట్లు కనబడుతోంది. ఈ పాటలలో సర్వసాధారణముగా గణనియమమే కానవచ్చును. కాని యతిప్రాస నియమ మంతగా కానరాదు. వీనిలో కొన్ని అనగా 1. ధర్మరాజు జూదం 2. ఊర్మిళాదేవి నిద్ర 3. అధ్యాత్మ రామాయణం 4. లంకాయాగం 5. కాళీయమర్దనం - అను మొదలైనవి ప్రశస్తములై అధిక జనాదరం కలగిఉన్నాయి. ఈపాటలు ఎవరు ఎప్పుడు రచించిరో తెలియ రాకున్నది. కాని యివి ఆకస్మికముగా వెలువడిన వెంతమాత్రం కాజాలవు. వీటి రచనకు తగిన కారణ ముండుట చేతనే తరములవెంబడి సంఘమున మంచిప్రచారము కల్గి నేటికిని లభ్యములై యున్నవి. ఒకానొక ఆంగ్లపండిత

విమర్శకుడు ఈజాతి వాఙ్మయాన్ని గూర్చి అన్న మాటలివి :—

**"———Though a man, not a people, has composed them, still the author counts for nothing, and it is not by mere accident, but with the best reasons that they have come down to us anonymous."(The Balled in Literature by T. F. Henderson)**

1. ధర్మరాజు జూదం :— ఇది ప్రసిద్ధ మైన భారతకథ. సభాపర్వమునుండి సంగ్రహింపబడింది. దుర్యోధనుడు ధర్మరాజుతో జూదమాడి మొదట వోడిపోయినట్లు, పిదప అతడు జ్యేష్ఠాదేవి నుపాసించి, ఆమె దయకు పాత్రుడై పాండవుల సంపద తొలగించినట్లును, ఒక విచిత్రకల్పన ఈ పాటయందు చేయబడినది. దీని నాధారముగా కొన్ని సంప్రదాయములు అమలులోనికి వచ్చేయిమనలో. సాధారణముగా మన ఇళ్ళలో ముగ్గు పెట్టని అలికిన గుమ్మమును దాటరా దనియు, మునిమాపు వేళ ముంజూరు ముట్టరా దనియు, పువ్వులు ఒడిలో కొయ్యరాదనియు, కాళ్లు కడుగుకొనునపుడు పొడి యుండరాదనియు మొదలగు నాచారములను మిక్కిలి పట్టుదలతో ఇప్పటికిని పాటిస్తూ వాటి నాచరణ పెట్టుచుండుట మన కనుభవవేద్యమైన విషయమే. అట్టి వ్రైదానియం దుగ్గడింపబడినవి.

"అలికి విడచిన గడప దాటడే రాజు
ఇంట ముగ్గులులేక నడవడే రాజు
మునిమాపు ముంజూరు దూయడే రాజు"

ఇంక ధర్మరాజు జూదములో ఓడిపోయాక ద్రౌపతి తెరచాటున నుండి దుర్యోధనునితో జూదమాడి జయించినట్లు మరియొక వింతకల్పనగలదు. ఈ యాటలో దుర్యోధనుడు చేతితో వేయు పాచికలను ద్రౌపది కాలితో త్రోచుచువచ్చెనని చెప్పబడింది :—

"ఆరాజు తనచేత వేసె పాచికలు
పాంచాలి తన కాళ్ళ ద్రోచె పాచికలు"

ఈ తీరున ఆడి ద్రౌపది గెలుపొందుట చూచి దృతరాష్ట్రుడు తన కుమారుడు పొందిన పరాజయ పరాభవములకు మిగుల వగచి, కోడలికి వరము లిత్తునని పిలిచి పాండవాగ్రజు డోడిన సర్వస్వమును తిరుగ ఇచ్చివేసినట్లుగా కథ ముగింపబడింది. గ్రంథమంతా మంజరీ ద్విపదలో వ్రాయబడింది.

"అల్లంత తమయక్క రాకను జూచి
ఎదురులేచీ వెళ్ళె మహలక్ష్మి యపుడు
వలగొని ముమ్మారు ప్రణతులు చేసి
ఏమియో యక్క నీ వచ్చిన పనులు."

2. ఊర్మిళా దేవినిద్ర:— ఇది మరియొక మనోహరమైన పాట. లక్ష్మణుడు సీతా రాములవెంట నరణ్యములకు బోయినది మొదలు, తిరుగ రావణ వధానంతరము అతడు వచ్చినదాకా అతనిభార్య ఊర్మిళా దేవినిద్రావస్థలో నున్నట్టుగా లోకములో ప్రచారంలోనున్న వింతకథయే యీ పాటలో చిత్రించబడినది. శ్రుతిపేయంగా గానం చేసి వినేవారి వీనులకు విందొనరింపగల్గు ఫక్కిలో కూర్చబడింది. బహుశా ఇట్టి పాటలే అక్కర లను వృత్తాలకు బ్రాతిపదికలై యుండవచ్చును. సర్వసాధారణముగా ఇట్టి పాటలలో కానవచ్చు వ్యావహారిక భాషలోనే యిదికూడ ఉన్నది. వాక్యముల యందలి భావములు చదివిన వెంటనే హృదయమునకు దాకి యానందమును గూర్చుటయే ఈ రచనలయందలి విశిష్టత. కేవలం నిద్రావస్థ లోనుగాక, జాగ్రదవస్థ లోనుగాక, మధ్యస్థితిలో నున్న ఊర్మిళాదేవి నోటినుండి పరకాంతాగమనేచ్ఛ యెంత చక్కగా వర్ణించబడిందో ఈ దిగువ పరికించండి :—

"ఒకడాలి కోరిగాదా
ఇంద్రునికి నొడలెల్ల హీనమాయె ;
పరసతిని కోరిగాదా
రావణుడు మూలతో హతమాయెను ;
ఒకడాలి కోరిగాదా, కీచకుడు
ప్రాణాలు గోల్పోయెను."

ఇట్టి ద్రోహములు మీరు, యెరుగుండి యింతద్రోహం చేతు రా ఆడతోడున బుట్ట రా మావంటి తల్లి లేదా మీకు అనే భావం ద్యోతక మౌతోంది.

3. అధ్యాత్మరామాయణ కీర్తనలు :— రామాయణకథ సంపూర్ణంగా కీర్తనల రూపంలో వ్రాయబడి ఆంధ్రమహిళా ప్రపంచంలో బహుళప్రచారం పొందింది. సంగీతం సాహిత్యం ఏకీభవించిన ఈపాటలు ఆపాత మధురవాహినులై అనాదిగా అనుశ్రుతంగా అందరి నోటంట వినవస్తున్నాయి. కీర్తనలన్నీ రాగయుక్త సమ్మేళనంతో సమకూర్చబడినవే! సంగీతంలో అభిరుచి, సహజంగా శ్రావ్యమైన కంఠం ఉన్నవారు ఈ కీర్తనలను పాడినప్పుడు కలిగే సంతోష పారవశ్యాని కవధులు నిర్ణయించలేము. కీర్తనలలో వాడినభాష చాలా పటిష్ఠమైనదే కాని నోరు పల్కలేనంత క్లిష్టంగా వుండదు. ఉదాహరణకు—

"వినీలవేణి వినుత గుణశ్రేణి
వినవేళర్వాణి॥

ఘనాఘనాంగుడో రా
మునిచే నమ్మజ్ఞగొని గౌతమ,
మునియొద్దకు జనె నహల్యా
మునీంద్రు డా రాముని జూచి పలికె
ఘనంబుగను మిథిలాపురంబునను

(మిగతా 71 వ పేజీలో)



## ఆదిలాబాదు

*రోడ్డు నిర్మాణం :*

కేసలాపూర్‌నుంచి నుత్నూర్ గ్రామానికి 4 మైళ్ళ రోడ్డు నిర్మాణం పనికి నవంబరు 25వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది. యీ రోడ్డు నిర్మాణానికి రు 23,000లు ఖర్చు అవుతాయి.

## అనంతపురం

*పునశ్చరణ సదస్సు :*

అనంతపురం రాష్ట్ర విద్యాసంస్థ వారం రోజులపాటు నిర్వహించే పునశ్చరణ సదస్సుకు, నవంబరు 16వ తేదీన జిల్లాపరిషత్తు అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు.

## చిత్తూరు

*పాఠశాలా భవనం :*

కెనబాల కోటలో ఉన్నత పాఠశాల భవనం నిర్మాణానికి రాష్ట్ర పంచాయితీ రాజ్ మంత్రి నవంబరు 20వ తేదీన పునాది రాయి వేశారు.

## కడప

*ఆరోగ్య కేంద్రానికి విరాళం :*

జమ్ములమడుగు పంచాయతీ సమితి లోని రాజుపాలెం గ్రామవాస్తవ్యులు శ్రీ బూతూరు పెద్ద వీరారెడ్డి, ఆరోగ్యకేంద్రం ప్రారంభించడానికి రు 10,000ల రొక్కం స్థలాన్ని విరాళంగా ఇచ్చారు.

## తూర్పు గోదావరి

*శ్రమదానం :*

64 నవంబరులో అంగార, పశ్చిమ ఖండ్రిక గ్రామాల ప్రజలు 6 ఫర్లాంగుల రెండు రోడ్లను శ్రమదానంతో నిర్మించారు.

*పాఠశాలా భవనానికి విరాళం :*

శంకవరం పంచాయతీ సమితిలోని ఏలేశ్వరంలో శ్రీ ఆలమంద వీరరాఘవస్వామి ప్రాథమిక పాఠశాలను ఏర్పాటు చేయడానికి రు 10,000ల విలువచేసే భవనాన్ని విరాళంగా ఇచ్చారు.

## గుంటూరు

*జొన్న విత్తనాలు :*

ఈపూరు పంచాయతీ సమితిలో 1964 నవంబరులో రాబీసేద్యానికై 122 మణుగుల మేలిరకం జొన్న విత్తనాలను పంపిణీ చేశారు. 36 ఆధునిక వ్యవసాయ పరికరాలను సరఫరా చేశారు. అదే కాలంలో ఒక మంచినీటి బావిని త్రవ్వడం జరిగింది.

*వ్యవసాయోత్పత్తి :*

సంతమాగులూరు పంచాయతీ సమితిలో రైతులకు రుణాలు, సబ్సిడీలు మంజూరుచేసి వ్యవసాయాభివృద్ధిని తీవ్రతరం చేయాలని కృషిచేస్తున్నారు. కొత్త బావుల త్రవ్వకం పథకం క్రింద పత్తేపురం, 'కొప్పారం, వెల్లాలచర్వు, గురిజేపల్లి గ్రామాలలో 4 బావులను మంజూరు చేశారు. పయిలెట్ పథకం క్రింద గుంటుపల్లిలో 3 బావులను మంజూరు చేశారు.

## హైదరాబాదు

*అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ ప్రారంభోత్సవం :*

తాండూరులో వేంకటేశ్వర అగ్గిపెట్టెల పారిశ్రామిక సహకార సంఘానికి ఆర్థిక మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

*సమన్వయ సంఘం :*

హైదరాబాదు జిల్లా సమన్వయ సంఘం సమావేశం డిసెంబరు 10వ తేదీన జరిగింది. కలెక్టరు యీ సమావేశానికి అధ్యక్షత వహించారు.

## కరీం నగరం

*ఆటలపోటీలు :*

1964 డిసెంబరు 9వ తేదీన కలెక్టరు జిల్లాఆటలపోటీలకు ప్రారంభోత్సవంచేశారు.

## ఖమ్మం

*గ్రామపంచాయతీ భవనం :*

తల్లంపాడు గ్రామపంచాయతీ క్రొత్త భవనానికి జిల్లాపరిషత్తు అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు.

*ప్రాథమిక పాఠశాలా భవనం:*

తిరుమలాయిపాలెం బ్లాకులోని పొన్నేకల్లు గ్రామం ప్రాథమిక పాఠశాల భవనానికి పంచాయతీ సమితి అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు.

*కుట్టుపనికేంద్రం :*

ఇల్లెందు పంచాయతీసమితిలోని పెరుపల్లి గ్రామంలో నవంబరు 24వ తేదీన మహిళామండలి కుట్టుపని కేంద్రానికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

*ఉత్తమ గ్రామస్థుల రేడియోగోష్ఠి :*

నవంబరు 23వ తేదీన పెరువంచ



గ్రామస్థుల రేడియోగోష్ఠి సమావేశకర్తకు బహుమతిగా రెండు ఆధునిక వ్యవసాయ స్ప్రేయర్లను ఇచ్చారు.

## మహబూబునగర్

*విజ్ఞానశాస్త్ర ప్రదర్శన :*

డిసెంబరు 8వ తేదీన మహబూబునగర్‌లో విజ్ఞానశాస్త్ర ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరిగింది. జిల్లాలోని 13 ఉన్నత పాఠశాలలకు చెందిన 400 ప్రదర్శనావస్తువులను అందులో ఉంచారు.

## మెదకు

*బోధనాభవనం :*

జహీరాబాదులో నవంబరు 22వ తేదీన మునిసిపల్ పరిపాలనా శాఖ మంత్రి నెహ్రూ స్మారక బోధన భవనానికి పునాదిరాయి వేశారు.

## నల్లగొండ

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం :*

మునుగోడు పంచాయతీ సమితిలోని వరిమడ్ల గ్రామంలో నవంబరు 25వ తేదీ నుంచి మూడు రోజులపాటు వ్యవసాయ విషయంలో గ్రామ సహాయకుల ప్రత్యేక శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు.

*జిల్లా ఆటల పోటీలు :*

డిసెంబరు 6వ తేదీన నల్లగొండలో పోలీసు పరేడుమైదానంలో జిల్లా ఆటలపోటీలకు కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

## నెల్లూరు

*శిక్షణ శిబిరం :*

నవంబరు 27వ తేదీన ఇసుకపల్లి గ్రామంలో మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు.

*బాలవాడికేంద్రం :*

బుచిరెడ్డిపాలెం గ్రామంలో బాలవాడి కేంద్రాన్ని ప్రారంభించారు.

## నిజామాబాదు

*పంచాయతీఘర్ :*

బన్స్వాడ పంచాయతీ సమితిలోని హసనపల్లి గ్రామంలో క్రొత్తగా నిర్మించబడిన పంచాయతీ గృహానికి డిసెంబరు 7వ తేదీన జిల్లా పరిషత్తు అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు.

*పశుప్రదర్శన :*

ఎల్లారెడ్డి పంచాయతీ సమితిలోని గాంధారీ గ్రామంలో పశుప్రదర్శనను ఏర్పాటు చేశారు.

*వి. యల్. టి. శిబిరం :*

ఎల్లారెడ్డి పంచాయతీ సమితిలోని సేత పూర్ · సంగారెడ్డి గ్రామంలో మహిళా వి. యల్. టి. శిబిరానికి జిల్లా కలెక్టర్ ప్రారంభోత్సవం చేశారు.

*యువజనక్లబ్బు :*

బన్స్వాడ పంచాయతీ సమితిలోని కోనాపూర్ గ్రామంలో నవంబరు 15వ తేదీన యువజన క్లబ్బుకు ప్రారంభోత్సవం జరిగింది.

## వరంగల్లు

*శిక్షణశిబిరం :*

పర్కాల పంచాయతీ సమితిలోని రేపల్లె గ్రామంలో నవంబరు 17వ తేదీ నుంచి 19 తేదీ వరకు గ్రామనాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఆధునికవ్యవసాయ పద్ధతులలో వీరికి శిక్షణ ఇవ్వడం జరిగింది.

*రసాయనిక ఎరువుల పంపిణీ :*

పానకల్లు పంచాయతీ సమతిలో నవంబరు నెలలో 248 మణుగుల అమోనియంసల్ఫేటు, 405 మణుగుల సూపర్ ఫాస్ఫేటు, 1108 మణుగుల యితర రసాయనిక ఎరువులను రైతులకు పంపిణీ చేశారు.

# సంగ్రహ ప్రకటనలు

ప్రత్యేకస్టాంపుల అమ్మకం

చీఫ్ కంట్రోలింగ్ రెవిన్యూ అథార్టీ ఆదేశాలను అనుసరించి ప్రత్యేక విడిస్టాంపుల విలువను మనియార్డర్లద్వారా స్వీకరించే పద్ధతిని నిలిపివేయడం జరిగింది.

హైద్రాబాదులోని జనరల్ స్టాంపుల ఆఫీసు నుండి విడిస్టాంపు అంటించిన దస్తావేజు (భారతస్టాంపు చట్టంలోని ఎపెండిక్స్ ii, iii లలో పేర్కొన్న)ను పొందదల్చిన వ్యక్తులు, స్టాంపుల విలువమొత్తాన్ని ప్రభుత్వ ట్రజరీలో దిగువతెల్పిన పద్దులో జమచేసి, చలాను దస్తావేజుతో జతచేయాలి, లేదా విలువమొత్తం రొక్కాన్ని దస్తావేజుతో పాటు కౌంటరువద్ద చెల్లించాలి. మేజరుపద్దు:- xiv - స్టాంపులు - ఎ. నాన్ - జుడీషియల్; మైనర్ పద్దు :- (అ) స్టాంపుల అమ్మకం; డిటేల్డ్ పద్దు : (iii) ఇతర స్టాంపులు.

చెరకు సలహాసంఘం

చెరకు విషయాల సలహాసంఘంలో సభ్యుడుగాఉన్న శ్రీ సి. బంగారరాజు రాజీనామాచేసిన కారణంగా ఏర్పడిన ఖాళీలో విశాఖపట్నం జిల్లా, అనకాపల్లి గ్రామానికి చెందిన శ్రీ వి. చిరంజీవిని చెరకు ఉత్పత్తిదారుల ప్రతినిధిగా ప్రభుత్వం నామినేటు చేసింది.

ఆహారధాన్యాల రవాణా

ఆహారధాన్యాల రవాణాను క్రమబద్ధం చేయడానికై రాష్ట్రంలో దిగువవిధంగా మూడు మండలాలను నెలకొల్పడానికి ప్రభుత్వం నిశ్చయించింది. 1. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలు, 2. గుంటూరు, నెల్లూరు జిల్లాలు, 3. రాష్ట్రంలోని మిగతా జిల్లాలు. ఒక మండలంనుంచి మరో మండలానికి బియ్యం, వరిధాన్యాలను తరలించడాన్ని పర్మిట్లద్వారా క్రమబద్ధం చేస్తారు. ఆయా మండలాలలోని లైసెన్సులు గల వర్తకులు బియ్యం, వరిధాన్యాలను కానీ తమ మండలంలో ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి రవాణా చేసుకోవడానికి స్వంత ఏర్పాట్లు చేసుకోవచ్చు. ఈ ధాన్యాన్ని వారు కంట్రోలుధరలకు విక్రయించాలి. వ్యవసాయదార్లుకూడా తాముపండించిన వరిధాన్యాన్ని, బియ్యాన్ని తమ మండలంలో ఒకచోటునుంచి మరోచోటుకురవాణాచేసుకోవచ్చు. వారుపీటినికంట్రోలుధరలకుఅమ్మాలి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గిడ్డంగుల సంస్థ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గిడ్డంగుల సంస్థ డైరెక్టర్ల మండలి సభ్యులుగా దిగువ పేర్కొన్నవారిని కేంద్ర గిడ్డంగుల సంస్థ నామినేటు చేసింది. వీరి సభ్యత్వ గడువు 1964 ఆగష్టు 5వ తేదీ నుంచి మూడు సంవత్సరాలు: చీఫ్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మద్రాసు స్థానిక హెడ్డాఫీసు, మద్రాసు; డిప్యూటీ చీఫ్ ఆఫీసరు, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, వ్యవసాయ పరపతిశాఖ, మద్రాసు; శ్రీ ఇ. బాలవీరరాఘవయ్య, అధ్యక్షుడు, సహకార కేంద్ర బ్యాంకు, విజయవాడ; ప్రాంతీయ డైరెక్టరు (ఆహారం), దక్షిణ మండలం, ఆహార, వ్యవసాయ మంత్రిత్వశాఖ, ఆహార విభాగం, మద్రాసు; శ్రీ పి.వెంకటసుబ్బయ్య, ఎం. పి., 25, కానింగ్‌లేన్, న్యూఢిల్లీ.

వక్ఫ్‌ల సర్వే

వివాదగ్రస్తమైన కేసుల విషయంలో చేసుకున్న విజ్ఞాపనలను తత్సంబంధికుల నుంచి వాఙ్మూలం తీసుకొనకుండానే పరిష్కరిస్తారనే అపోహ కొందరికి ఉన్నట్లు వక్ఫ్‌ల కమీషనరుకు తెలియవచ్చింది. కనుక, వివాదగ్రస్తమైన అన్ని కేసుల విషయంలోనూ వాటి వ్యవహారంలో అంతిమంగా ఉత్తర్వులు చేయడానికి పూర్వం తత్సంబంధీకులనుంచి వాఙ్మూలం తీసుకోవడం జరుగుతుందని ప్రజల సమాచారార్థం ప్రకటించబడుతున్నది.

కృష్ణా, గోదావరి జిల్లాలలో రెండవ పంట

కృష్ణా డెల్టా :

1965 జనవరినుంచి మే వరకు, రెండవ పంటక్రింద నాలుగు లక్షల ఎకరాలకు నీటి పారుదల చేయడానికి నిశ్చయించారు.

వరి రెండవపంట వేయడానికి దిగువ పేర్కొన్న ప్రాంతాలను ఇదివరకే ప్రకటించడం జరిగింది.

(1) కృష్ణా పశ్చిమడివిజను, గుంటూరు జిల్లా : 97,706 ఎకరాలు; (2) కృష్ణా కేంద్రడివిజను, కృష్ణా జిల్లా : 17,802 ఎకరాలు; (3) కృష్ణా తూర్పు డివిజను, కృష్ణాజిల్లా: 1,93,318 ఎకరాలు; (4) కృష్ణా తూర్పు డివిజను, పశ్చిమ గోదావరి జిల్లా: 10,635 ఎకరాలు. మొత్తం 3,19,461 ఎకరాలు.

కృష్ణా జిల్లాలోని కృష్ణాకేంద్ర, కృష్ణా తూర్పు డివిజన్లలో 23,700 ఎకరాలవిస్తీర్ణంలో చెరకుపైరు వుంది.

(1) గుంటూరు జిల్లా కృష్ణా పశ్చిమ డివిజనులో 20,000 ఎకరాలలోనూ, (2) కృష్ణాజిల్లాలో 15,000 ఎకరాలలోనూ ప్రత్తి వేయడానికి అనుమతించారు.

పూర్తిపంట విస్తీర్ణాన్ని నాలుగు లక్షల ఎకరాలకు హెచ్చించేందుకై వరి రెండవ పంట క్రింద దిగువ విధంగా అదనపు విస్తీర్ణాలను అనుమతించారు : (1) కృష్ణా పశ్చిమ డివిజను, గుంటూరుజిల్లా: 10,000 ఎకరాలు; (2) కృష్ణా కేంద్ర డివిజను, కృష్ణా తూర్పు

డివిజను : 7000 ఎకరాలు; (3) పశ్చిమ గోదావరిజిల్లా, కృష్ణా - ఏలూరు కాలువ నుంచి - 5000 ఎకరాలు. మొత్తం 22,000 ఎకరాలు.

## గోదావరి డెల్టా

### రెండవ పంట తొలిసేద్యం

గోదావరి డెల్టాలో, దిగువ పేర్కొన్న షరతులకు లోబడి వరి రెండవ పంట తొలిసేద్యాన్ని అనుమతించడానికి నిశ్చయించారు :-

అన్ని మూసివున్న కాలువలు లేదా తెరిచి వున్న నిర్ణీతమైన కొన్ని కాలువల క్రింద నీటిపారుదలను అనుమతించవచ్చు. అయితే బ్లాకులో నీటిపారుదలకు అనుమతించబడిన భూముల యజమానులలో కనీసం 75 శాతం మంది, దిగువ షరతులకు లోబడి, వరి నాట్లను శీఘ్రంగా చేపట్టడానికి సమ్మతిస్తూ వ్రాసిఇవ్వాల్సివుంటుంది :-

(1) నాట్లు జనవరి 15 వ తేదీ లోగా పూర్తికావాలి; (2) జనవరి 15 వ తేదీ తరువాత నాట్లు వేయడం జరిగినట్లయితే అది అక్రమమైన చర్యగా పరిగణించబడుతుంది. ఈ చర్య శిక్షార్హమైనది కూడా (3) మార్చి 15 వ తేదీ తరువాత నీటి సరఫరా జరుగదు. (4) ఒకవేళ మార్చి 15 వ తేదీ తరువాత ఏదైనా కారణంగా నీటి సరఫరా పొందినట్లయితే అది అక్రమ చర్యగా పరిగణించబడుతుంది. ఈచర్య కూడా శిక్షార్హమైనదే.

ప్రస్తుత ఋతువులో లోకలైజేషన్ పథకం క్రింద, తెరిచివున్న కాలువ దిగువ భాగంలో రెండవ పంటకు నీటి పారుదల జరుగవలసివున్నట్లయితే ఈ పథకం క్రింద ఏ విస్తీర్ణాల్లో కూడా నీటి పారుదలను అనుమతించరు.

రెండవ పంట తొలిసేద్యం నిమిత్తం భూమి విస్తీర్ణాలను ఇదివరకే స్థిరపరిచారు : (1) గోదావరి పశ్చిమ డెల్టా - 15,000 ఎకరాలు; (2) గోదావరి కేంద్ర డెల్టా - 968 ఎకరాలు; (3) గోదావరి తూర్పు డెల్టా 2,133 ఎకరాలు.

పైన ఒకటవ పేరాలో నిర్దేశించబడిన షరతులను పూర్తిచేసేవరకు, ఆచరణీయమైన నీటి క్రమబద్ధపు ఏర్పాట్లకు లోబడి, రెండవపంట తొలిసేద్యం కొరకు నీటి పారుదలను మరికొన్ని సంవత్సరాలవరకు అనుమతించడానికి నిశ్చయించారు. ఇప్పటి వరకు చేరిన దరఖాస్తులను పరిశీలించి వాటి అర్హతల ప్రాతిపదికపై అనుమతులివ్వడం జరుగుతుంది.

భూములు నీట మునిగిన కారణంగా మొదటిపంట పూర్తిగా, విలఫమైన సందర్భాలలో రెండవపంట తొలిపైరు వేయడానికి అనుమతించేందుకు పశ్చిమ గోదావరి జిల్లాకలెక్టరుకు, ధవళేశ్వరం సర్కిలు సూపరింటెండింగ్ ఇంజనీరుకు విచక్షణాధికారాలు ఇవ్వబడినవి. అయితే పై మొదటి పేరాలో నిర్దేశించబడిన అంశం సంతృప్తి కలిగించకపోయినప్పటికీ నీటి సరఫరాను క్రమబద్ధం చేయటం సంతృప్తికరంగా జరగాలి.

### అదనపు రెండవ పంట ప్రాంతాలు

లోకలైజేషన్ పథకం క్రింద రెండవ పంటకు అర్హతగల మామూలు ప్రాంతాలతో పాటుగా, భారీవరదల మూలంగా కలిగే నష్టాలను పూరించ గలగడానికి అదనపు విస్తీర్ణాలలో వరి రెండవ పంటను అనుమతించడానికి కూడా నిశ్చయించారు. అనేక ఎకరాల విస్తీర్ణం గల భూమి నీట మునిగింది. ఎంత విస్తీర్ణంలో పంటకు పూర్తిగా నష్టం కలిగినదీ అంచనావేస్తున్నారు. ఇలాంటి ప్రదేశాలలో అదనపు విస్తీర్ణాల క్రింద, గోదావరి పశ్చిమ డెల్టాలో 20,000 ఎకరాలు, గోదావరి తూర్పు డెల్టాలో 3,000 ఎకరాలు, గోదావరి కేంద్ర డెల్టాలో 2,000 ఎకరాల మేరకు రెండవ పంటను అనుమతించడానికి నిశ్చయించారు. ఈ ప్రాంతాలను స్థిరీకరించి ప్రకటిస్తారు.

## అనౌపచారిక సలహాసంఘం పునర్నిర్మాణం

పంచాయతీరాజ్, సమాజాభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం ప్రభుత్వం రాష్ట్ర శాసన సంస్థల అనౌపచారిక సలహా సంఘాన్ని దిగువ పేర్కొన్న సభ్యులతో పునర్నిర్మించింది.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, ముఖ్యమంత్రి, (అధ్యక్షుడు); డాక్టర్ ఎం. ఎస్. లక్ష్మీనరసయ్య, పంచాయతీ రాజ్‌శాఖ మంత్రి, (ఉపాధ్యక్షుడు), డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, ఆర్థికశాఖమంత్రి; శ్రీ బి. ఎస్. మూర్తి, కేంద్ర ఉపమంత్రి; శ్రీమతి వి. విమలాదేవి, ఎం. పి.; శ్రీ జె. బి. ముత్యాలరావు ఎం. పి.; శ్రీ వి. వెంకట సుబ్బయ్య, ఎం. పి. శ్రీ యం. అంకినీడు, ఎం. పి.; శ్రీ కె. వెంగళరెడ్డి, ఎం. పి.; శ్రీ మహమ్మద్ అతిఫ్ ఖాన్, ఎం. ఎల్. సి.; శ్రీ డి. నారాయణ రెడ్డి, ఎం. ఎల్. సి.; శ్రీ కె. సుబ్రహ్మణ్యం, ఎం. ఎల్. సి.; శ్రీ ఐ. సదాశివన్, ఎం. ఎల్. సి.; శ్రీ టి. హయగ్రీవాచారి, ఎం. ఎల్. ఎ.; శ్రీ పి. తిమ్మారెడ్డి, ఎం. ఎల్. ఎ.; శ్రీ కె. అప్పలనాయుడు, ఎం. ఎల్. ఎ.; శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ఎం. ఎల్. ఎ.; శ్రీ ఎల్. చిన్నపరెడ్డి, ఎం. ఎల్. ఎ. శ్రీ జె. వెంగళరావు, ఎం. ఎల్. ఎ.; శ్రీ జి. బాపనయ్య, ఎం. ఎల్. ఎ.; శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు, ఎం. ఎల్. ఎ.; శ్రీ పి. రాజగోపాలనాయుడు, ఎం.ఎల్.ఎ.; శ్రీ కె. లక్ష్మీనరసింహారావు, ఎం. ఎల్. ఎ.; శ్రీ వి. ముత్యాలరావు, ఎం. ఎల్. ఎ.; శ్రీ జి. సి. కొండయ్య, ఎం.ఎల్.ఎ.; శ్రీ ఎం. బాగారెడ్డి, ఎం. ఎల్. ఎ.; శ్రీ జి. రాజారామ్, ఎం.ఎల్.ఎ.; శ్రీ జి. వెంకటేశ్వర్లు, ఎం. ఎల్. ఎ.; శ్రీ ఏ. లక్ష్మణనాయుడు, ఎం. ఎల్. ఎ.; శ్రీ జి. గంగరాజు, ఎం. ఎల్. ఏ.

ఈ సంఘం రాష్ట్రంలో పంచాయతీ రాజ్, సమాజాభివృద్ధి కార్యక్రమాల పూర్తి పురోగతిని మధ్య మధ్య పరిశీలించి, సమీక్షిస్తుంది.



# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

నవంబరు 22 : హైదరాబాదులో మూడు రోజులపాటు జరిగే పంచాయతీరాజ్ సమ్మేళనానికి రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

విజయవాడలో పారిశ్రామిక ప్రదర్శనకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

నవంబరు 25 : ఆంధ్రప్రదేశ్ శాసనసభ శీతాకాలం సమావేశం ప్రారంభమయింది.

శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు, హైదరాబాదులో మృతిజెందారు.

నవంబరు 29 : యు. ఎ. ఆర్. ప్రభుత్వ అశ్వన్ హైడాం శాఖమంత్రి శ్రీ యం. సిద్కి సాలిమన్ హైదరాబాదు వచ్చారు.

డిసెంబరు 3 : శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి నాయకత్వానగల ప్రభుత్వంపై ప్రతిపక్షంపార్టీలు సంయుక్తంగా ప్రవేశపెట్టిన "అవిశ్వాస" తీర్మానం వీగిపోయింది.

డిసెంబరు 4 : రెండు రోజులపాటు జరిగే ఆంధ్రప్రదేశ్ కుటుంబనియంత్రణ సమావేశానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

డిసెంబర్ 11: ఆంధ్ర ప్రదేశ్ శాసనసభా శీతాకాలం సమావేశాన్ని నిరవధికంగా వాయిదా వేశారు.

అనంతపురంలో మధ్య పెన్నార్ దక్షిణకాలువకు రాష్ట్ర పబ్లిక్‌వర్క్సు శాఖమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

డిసెంబరు 12 : ముఖ్యమంత్రి, వాల్తేరులో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేశారు.

డిసెంబరు 13 : హైదరాబాదు – మన్ననూర్ రహదారిపై మన్ననూరును శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు స్థలాన్నికలిపే 36 మైళ్ళరోడ్డుకు రాష్ట్ర పబ్లిక్‌వర్క్సు శాఖమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## భారతదేశంలో

నవంబరు 17 : కువాయత్ యువరాజు, ప్రధానమంత్రి, షేక్‌సభాఅల్ సలీం అల్‌సభా, రెండువారాల అధికార పర్యటనపై క్రొత్తఢిల్లీ వచ్చారు.

ఆహారపరిస్థితిని పరిశీలించడానికి న్యూఢిల్లీలో రాష్ట్ర ముఖ్యమంత్రుల సమావేశం జరిగింది.

నవంబరు 21 : అంతర్జాతీయ మహిళా లాయర్ల ఫెడరేషన్ సమావేశానికి క్రొత్తఢిల్లీలో ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ జస్టిస్ పి. చంద్రారెడ్డిని మద్రాసుహైకోర్టు ప్రధానన్యాయమూర్తిగా బదిలీచేశారు.

నవంబరు 23 : శ్రీ జస్టిస్ పి. యస్. రాజును ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమించారు.

నవంబరు 24 : రెండురోజులపాటు జరిగే రాష్ట్రగవర్నర్ల వార్షిక సమావేశానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

నవంబరు 26 : జాతీయ పుస్తకాల ప్రథమ ప్రదర్శనానికి క్రొత్తఢిల్లీలో రాష్ట్రపతి ప్రారంభోత్సవంచేశారు.

నవంబరు 28 : బొంబాయిలో 38 వ అంతర్జాతీయ క్రైస్తవమహాసభలు ప్రారంభమయ్యాయి.

నవంబరు 29 : ప్రపంచ బౌద్ధమత 7 వ సాధారణ మహాసభకు సారానాథ్‌లో రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

డిసెంబరు 1: ఆచార్య జె. బి. యస్. హాల్డెన్, భువనేశ్వర్‌లో మరణించారు.

అహమ్మదాబాదులో ఆంధ్రప్రదేశ్ కళాకారుల పెయింటింగ్సు ప్రదర్శనకు గుజరాత్ గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

డిసెంబరు 2 : 6 వ పోప్ పాల్ బొంబాయి వచ్చారు.

డిసెంబరు 8: యు. యస్. కంబోడియాల మధ్య చర్చలు న్యూఢిల్లీలో ప్రారంభించారు.

గోవా, డయ్యూ, డామన్‌ల లెఫ్టినెంట్ గవర్నరు శ్రీ యం. ఆర్. సచిదేవ్ పాంజిమ్‌లో మృతిజెందారు.

డిసెంబరు 12: భారతీయులు నిర్మించిన ప్రథమ బేసిక్‌జెట్ శిక్షణ విమానం గగన

విహారానికి బెంగుళూరులో ప్రారంభో త్సవం జరిగింది.

డిసెంబరు 13 : క్రొత్తఢిల్లీలో రెండు రోజులపాటు జరిగే రాష్ట్ర ముఖ్య మంత్రుల సమావేశం ప్రారంభ మయింది.

## విదేశాలలో

నవంబరు 18 : 22 రాజ్యాల కొలంబో ప్రణాళిక సలహాసంఘం 16వ మంత్రుల స్థాయీ సమావేశానికి బ్రిటిష్ ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

నవంబరు 21: అనిగ్లోహంవద్ద స్వీడిష్ ప్రయాణీకుల విమానం ప్రమాదానికి గురిఅయ్యి కూలిపోయిన కారణంగా 31 మంది మరణించారు.

తూర్పుబెర్లిన్‌లో "ఇండియా"నాడు-నేడు" అనే భారత ప్రదర్శనకు తూర్పు జర్మనీ ఉపప్రధాని ప్రారంభోత్సవం చేశారు.

నవంబరు 23 : ట్రాన్స్ వరల్డ్ ఏర్‌లైన్స్‌కు చెందిన జెట్ విమానం రోమ్‌లోని ఫిమిసినో విమానాశ్రయంలో అగ్ని ప్రమాదానికి గురిఅయింది.

డిసెంబరు 1: ఐక్యరాజ్యసమితి 19వ సమావేశం న్యూయార్క్‌లో ప్రారంభ మయింది. శ్రీ అల్జెక్స్వాయిసన్ - సాకీ. యు. యన్. జనరల్ అసెంబ్లీ అధ్యక్షులుగా ఎన్నికయినారు.

డిసెంబరు 3: ప్రధానమంత్రి లాల్ బహద్దుర్ శాస్త్రి మూడురోజుల పర్యటనపై లండన్ వెళ్ళారు.

శ్రీమతి సిరిమావో బండారునాయకే నాయకత్వాన లంక ప్రభుత్వం, ప్రతి నిధులసభలో ఒక ఓటుతో ఓడించ బడింది.

డిసెంబరు 10 : శ్రీ హన్స్ - పీటర్‌చుడి, స్విడ్జర్‌లాండ్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయ్యారు.

డిసెంబరు 11 : కీన్యా రిపబ్లిక్‌గా అవత రించింది.

---

(65 వ పేజీ తరువాయి)

క్రతుపరంబు మహేశ్వరాచాపము
కనుంగొని యనంతరం బయోధ్యకు
జనెదమనన్ వినమ్రుడయ్యెను హరి॥

4. లంకాయాగము :— ఇది బహు జనాదరము గల చక్కనిపాట. రామా యణకథ యితివృత్తముగా గొని అల్ల బడినది. చక్కటి వ్యావహారిక భాషలో వ్రాయబడినది. ఈ పాటలో అచ్చటచ్చట మనోహరములైన కల్పనలు, కవిత యను టకు అర్హమైన పదవిన్యాసములు కనపడు చున్నవి :—

"మ్రానుపారిన తీగె మ్రానుదప్పిన
వెనుక మరి యెట్లు నిల్వగలదు....
....ఎలుకలు పిల్లితో నెదురాడ
వచ్చునా ? నరుడు నాతో గెలుచునా ?
ఉప్పుకోసము వచ్చి సుగ్రీవుడా !
నేను కప్పురము గోల్పోతిని."

ఇంకను ఈ పాటలోని ప్రతిపాదము కొంచెము కొఱతగా సీసపద్యపాదమునకు సరిపోవుచున్నది. యతి నియమము పాటించి కొంచెముగా పెంచిన సీస మగును.

"శ్రీరాముఁ దండ్రిగా సీతమ్మ
తల్లిగా భావించు లక్షుమన్నా !
ప్రొద్దున్న పోదురూ మాపటికి
వత్తురూ, మరి దిక్కు లేదురన్నా !"

ఈ విధంగా స్త్రీల సారస్వతాన్ని శ్రద్ధగా తరచి తరచి పరిశీలి స్తే ఈపాటలే తెనుగులోని దేశీయ వృత్తాలైన సీసం, ద్విపద, మున్నగువానికి మాతృక లని యూహించుట కనేక అవకాశములున్నవి. ఏలయందురా? పద్యకవిత్వమునకు ముందు గేయ కవిత్వమే వెలసెనని భాషాతత్త్వ వేత్తల సిద్ధాంతమై యున్న కారణమున. పై నుదహరించినవి కాక అధికంగా ప్రజా బాహుళ్యంలో పేరుప్రఖ్యాతు లార్జించు కొన్నవి — అష్టపదులు, తరంగాలు. ఆంధ్రదేశంలో అష్టపదులు, తరంగాలు రాని సంగీతజ్ఞులు లేరనడం అతిశయోక్తి కాదు. భక్తి శృంగార రసప్రతిపాదకా లైనవాటిని గానం చేయకుండా ఆంధ్ర దేశంలో ఏ గానసభ ముగియ దనటం అత్యుక్తి కానేరదు. ఇవి స్త్రీలకే పరిమిత మైలేవు. ప్రతీగాయకుడు వీనిని సాధన చేస్తాడు. స్త్రీల సారస్వతంలో ఇలా అన్వేషించినకొద్దీ మనకు అమూల్య రత్నాలు అనేకంగా లభిస్తాయి.

తప్పక చూడండి!



రిపబ్లిక్ ప్రొడక్షన్స్

# బొబ్బిలి యుద్ధం

సంగీతం
S.రాజేశ్వరరావు

నిర్మాత దర్శకుడు సీతారామ్

నవయుగ

VIJAYA PUBLICITIES

(8 వ పేజి తరువాయి)

నాగార్జునసాగర్ ప్రాజెక్టులకయ్యే వ్యయాన్ని భరించడానికి కేంద్రం సమ్మతించగలదనే విశ్వాసంతో ప్రభుత్వం ఈ రెండు ప్రాజెక్టులను ప్రణాళికేతర పథకాలుగా పరిగణిస్తున్నది. నాలుగవ ప్రణాళికా కాలంలో శ్రీశైలం, నాగార్జునసాగర్ ప్రాజెక్టులకు బహుశా రూ. 80 కోట్లు మేరకు ఖర్చవుతుంది. నాలుగవ ప్రణాళికలో ప్రతిపాదించిన రూ. 700 కోట్ల వ్యయం కాక ఇది అదనం.

### కేంద్రం నుంచి రూ. 242 కోట్లు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, నాలుగవ ఆర్థిక సంఘానికి సమర్పించిన విజ్ఞాపనా పత్రంలో వచ్చే అయిదు సంవత్సరాలకు రూ. 242 కోట్ల మేరకు వాటా లభింపజేయాలని కోరింది. ఈ మొత్తంలో, 1971 వ సంవత్సరంలో ముగిసే అయిదవ ప్రణాళికాకాలంలో ఆర్థిక వనరులలో వచ్చేలోటుపాట్లను సర్దుబాటు చేయడానికి గాను అవసరమైన రూ.55.63కోట్లు కూడా చేరి వున్నాయి.

కేంద్ర ఆదాయాల పంపిణీ కొరకు రాష్ట్రప్రభుత్వం తన విజ్ఞాపనా పత్రంలో దిగువ పేర్కొన్న ప్రాతిపదికను సూచించింది: అదాయపు పన్ను ద్వారా లభించే నికర మొత్తాన్నివివిధ రాష్ట్రాల మధ్య వసూళ్ళ ప్రాతిపదికపైగాక జనాభా ప్రాతిపదికపై పంపిణీ చేయాలి. పత్యేక ఎక్సైజు డ్యూటీలతో సహాఅన్ని ఎక్సైజు డ్యూటీల ద్వారా లభించే మొత్తంలో కనీసం 50 శాతం మొత్తాన్ని జనాభా ప్రాతిపదిక పై పంపణీ చేయాలి. రైల్వేల ద్వారా లభించే ఆదాయంలో కొంత శాతాన్ని రాష్ట్రాలకు ఇవ్వాలి. అదనపు ఎక్సైజు డ్యూటీ విధించబడిన కారణంగా రాష్ట్రాలు కొన్ని వస్తువులపై అమ్మకంపన్ను విధించడానికి వీలులేకపోయినందువల్ల కలిగిన నష్టాన్ని పూరించడానికి, 1956 – 57 వ సంవత్సరపు వాస్తవ ఆదాయాన్నికాక, రాష్ట్రంలో ఏఏటా అమ్మకం పన్నుద్వారా పెరిగేఅదాయపు దామాషాలో ఈవస్తువులద్వారా లభించగలఅంచనా ఆదాయాన్ని పరిగణనలోనికి తీసుకోవాలి.

గత పది సంవత్సరాల కాలంలో రాష్ట్రంలో అమ్మకంపన్ను ద్వారా లభించిన ఆదాయం రెట్టింపు కంటే ఎక్కువైనప్పటికీ ఈకాలంలో నష్టాన్ని పూరించడానికి వెచ్చించిన మొత్తం చెప్పకోదగినంతగా లేదని పై అంశాన్ని సమర్థిస్తూ ఈ విజ్ఞాపనా పత్రంలో వివరించబడింది.

ఆర్థిక సంఘం సిఫార్సు చేసే కేంద్ర సహాయ పథకం, ప్రస్తుతపు సహాయక గ్రాంటు ఏర్పాట్ల క్రింద తలపెట్టిన దానికంటే అధిక ఆదాయాల పంపిణీకి వీలు కలిగించాలనే మరో ముఖ్య సూచన కూడా ఈ విజ్ఞాపనాపత్రంలోచేయబడింది.రాష్ట్రాలు అభివృద్ధికార్యకలాపాల స్థాయిని పరిపోషించడానికి ఆదాయ, వ్యయాల మధ్య పెంపొందే వ్యత్యాసాలను సర్దుబాటు చేసుకోవడానికీ అవి ఆర్థిక పరిపుష్టిని కలిగి ఉండడానికీ రాష్ట్రాలకు పెరుగుతున్న బాధ్యతల దృష్ట్యా ఇది అవసరం.

1966–67 వ సంవత్సరం నుంచి గడిచే అయిదు సంవత్సరాల కాలంలో రెవెన్యూ పద్దుపై రెవెన్యూ ఆదాయ వ్యయాల అంచనాల ననుసరించి (కేంద్ర పన్నులలో రాష్ట్రవాటా, తృతీయ ఆర్థిక సంఘం నిర్ణయం ప్రాతిపదికపై కేంద్రం నుంచి లభించే సహాయక గ్రాంట్ల మినహా) ఆంధ్రప్రదేశ్ రెవెన్యూ పద్దులో మొత్తంమీద రూ. 180 కోట్లవరకు లోటువుండవచ్చు నని భావించ బడుతున్నది. కనుక రాష్ట్రం, కేంద్ర ప్రభుత్వనుంచి ఆదాయాలలో అధిక వాటా రూపంలో ఆర్థిక సహాయం పొందడంపైనా, ఎక్కువగా సహాయక గ్రాంట్లు పొందడంపైనా పూర్తిగా ఆధారపడివుంది.

రాష్ట్రాలు విద్య,రాకపోకలసౌకర్యాలు,నిమ్నజాతులు, నిమ్నతెగల సంక్షేమం, పంచాయతీ రాజ్ రంగాలలో ప్రత్యేకావసరాలను తీర్చుకోగలగడానికి వీలుగా వాటికి ప్రత్యేక గ్రాంట్లు సిఫార్సు చేయడానికి గల అవకాశాలను పరిశీలించవలసిందిగా ప్రభ్వుత్వం ఈ విజ్ఞాపనా పత్రంలో ఆర్థిక సంఘాన్ని అభ్యర్థించింది.

### జనాభా పెరుగుదల ప్రమాదాలు

డిసెంబరు 4,5 తేదీలలో రాష్ట్రస్థాయిలో ఉస్మానియా వైద్యకళాశాలలో రెండు రోజులు జరిగిన కుటుంబనియంత్రణ సంఘం సమావేశంలో కుటుంబనియంత్రణ ఉద్యమాన్ని తీవ్రతరం చేయాల్సిన అవసరాన్ని గూర్చి ప్రసంగాలు జరిగాయి. గవర్నరు యీ సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ కేరళలో జనాభాపెరుగుదల అధికంగా ఉన్న కారణంగా ఆహార కొరత ఏర్పడిందనీ, పుష్టికరమైన ఆహారం దొరకడం లేదనీ, భూమిపై వత్తిడి ఎక్కువై నిరుద్యోగసమస్య ఏర్పడిందనీ, తలసరి ఆదాయం తగ్గిపోయిందనీ ఉదహరిస్తూ నియంత్రణ లేని జనాభా పెరుగుదలగూర్చి ఆయన హెచ్చరిక చేశారు.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ ప్రపంచం ముఖ్యంగా బడుగు దేశాలాలో జనాభా పరిమితం చేయాలంటే కుటుంబ నియంత్రణను వ్యాపారసరళిలో చేపట్టాలని ఆయన అన్నారు. యీ శతాబ్దం ఆఖరు వరకు ఇక్కడి జనాభా 80 కోట్లకు పెరిగినప్పుడు, భారతదేశం పరిస్థితి ఏ విధంగా ఉంటుందో ఆలోచించుకోవాలని ఆయన చెప్పారు.

ఇప్పటివరకూ అమలు జరిపిన కార్యక్రమాలవల్ల ఆశించిన ఫలితాలు కల్గలేదు.

అందువల్ల యీ కార్యక్రమాన్ని మరింత పటిష్ఠంగా అమలు జరపడానికి కృషి చేయాలి. కొన్ని లోపాలు, అజ్ఞానం ప్రబలి ఉన్నప్పటికీ కుటుంబనియంత్రణ భావనకు వ్యతిరేకత లేకపోవడం ప్రోత్సాహకరమైన విషయం. గ్రామీణ ప్రాంతాల ప్రజలు కూడా కుటుంబ నియంత్రణ వల్ల కలిగే ఫలితాలను హర్షిస్తున్నారు. "అందువల్ల ప్రజలు దీనిని ఆచరించడానికి వీలుగా గ్రామీణప్రాంతాలలో అవకాశాలను కల్పించడం చాలాముఖ్యం," అని ఆయనఅన్నారు.

అయితే గర్భస్రావంపై శాసనం చేయడానికి ఆయన సుముఖత చూపలేదు. ఆయన ఇలా అన్నారు: "మనం తొందర పడరాదు, అవసరమైతే వివాహవయః పరిమితిని మనం పెంచవచ్చు. యీ సమస్య తీవ్రతను ప్రతి ఒకరు గుర్తించడం చాలా ముఖ్యం. యీ విషయంలో మనకు విజయం లభిస్తే చాలా ముందుకు పోవచ్చు."

వార్తలు, ప్రత్యేక గ్రామస్థుల కార్యక్రమాలకన్నా సినిమా, సంగీతం, వినోద కార్యక్రమాలపై గ్రామీణ ప్రజలు ఎక్కువ ఆసక్తిని చూపుతున్నారు. గ్రామస్థులపై, రేడియోల ప్రభావం అనే విషయంపై ఉస్మానియా విశ్వవిద్యాలయం జర్నలిజం శాఖ విద్యార్థులు నిర్వహించిన పరిశీలనలో వెల్లడయిన ఆసక్తికరమైన అంశం యిది. అయితే అధికాదాయం గల విద్యాధికులైన రైతులు వార్తలు, గ్రామస్థుల కార్యక్రమాలను వింటున్నారని యీ పరిశీలనలో తెలిసింది.

యీ పరిశీలనకై హైదరాబాదు నగరానికి 20 మైళ్ళ దూరములో ఉన్న రెండు గ్రామాలను ఎన్నుకున్నారు. యీ పరిశీలనా కార్యక్రమంలో జర్నలిజం శాఖ సిబ్బందీ, పూర్వ విద్యార్థులు కూడా పాల్గొన్నారు. గ్రామంలో జనాభాలోని ప్రతి మూడవవాడు క్రమం తప్పకుండా రేడియో వింటారని కూడా యీ పరిశీలనలో తెలిసింది. సాంఘికవ్యవస్థ, సాంఘిక కట్టుబాట్లు కారణంగా జనాభాలోని అధిక భాగం రేడియో వల్ల లాభం పొందలేక పోతున్నారు. యీ విషయంలో హరిజనులు, స్త్రీలు ఎక్కువగా నష్టం పొందుతున్నారు. వినోదానికి, సమాచారాన్ని పొందడానికి సాధనగా కాక రేడియో ఉండడం ప్రతిష్ఠగా భావించడం కొనసాగు తున్నది.

నగరానికి అమెరికా జర్నలిస్టు రాక.

ప్రఖ్యాత అమెరికా జర్నలిస్టు శ్రీకెన్నెత్ క్రాఫోర్డ్ డిశంబరు మొదటి వారంలో హైదరాబాదు వచ్చారు. నగరంలోని అమెరికన్ సాంస్కృతిక కేంద్రంలోనూ, ఇతర ప్రదేశాలలోనూ శ్రీ క్రాఫర్డ్ అనేక మందిని కలిశారు.

శ్రీ క్రాఫోర్డ్ యీ సంవత్సరం తన నాలుగు వారాల విహారయాత్రలో మూడు వారాలు భారతదేశంలో గడిపాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం జర్నలిజం శాఖలోని విద్యార్థుల ఉపయోగార్థం జర్నలిస్టులకు "వర్క్‌షాప్"ను నిర్వహించడమే హైదరాబాదులో ఆయన ముఖ్యమైనపని. ఆధునిక జర్నలిజానికి ప్రత్యేక విజ్ఞానం అవసరమని ఆయన జర్నలిస్టు విద్యార్థులతో అన్నారు. నేటి జర్నలిస్టులు ప్రజలకు మార్గదర్శకులుగా ఉండడం, సమాచారం అందజేయడమేగాక ఆరోగ్యకరమైన వినోదాన్నికూడా కల్పించాల్సిఉంది. భారతదేశంలోని పత్రికలు ప్రత్యేకించి రాజకీయ వార్తా సేకరణలో ఉన్నత ప్రమాణాలను పాటించడముపట్ల ఆయన తన ప్రసంగాలలోను, చర్చలలోను సంతృప్తిని ప్రకటించారు. రాజకీయ వార్తా సేకరణలో ముఖ్యంగా చరిత్ర రాజకీయ విజ్ఞాన శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, సాహిత్య విషయాలలో మంచి పరిజ్ఞానం ఉండడం ఎంతో అవసరం.

విశ్వవిద్యాలయం పట్టభద్రులకై ఐ. ఎ. యస్; ఐ. యఫ్. యస్; ఐ. పి. యస్. కు చెందిన యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషన్ పరీక్షల నిమిత్తం బోధనా తరగతులను నిర్వహించాలని ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సు, సైన్సు కళాశాల నిశ్చయించింది. అఖిల భారత సర్వీసులలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన యువకుల సంఖ్య చాలా తక్కువగా ఉన్న దృష్ట్యా విశ్వవిద్యాలయం నిర్ణయానికి అన్ని వర్గాల వారు హర్షం వెలిబుచ్చారు.

నగరంలోని అనేక విద్యా సంస్థలలో చదువుతున్న కీన్యాదేశపు విద్యార్థులు, డిసెంబరు 12వ తేదీన ఆఫ్రికాదేశపు రిపబ్లిక్ అవతరణ దినోత్సవం జరిపారు. యీ సందర్భంలో వై. యం. సి. ఎ. లో వారు విందు కూడ ఏర్పాటు చేశారు. హోంశాఖ కార్యదర్శి శ్రీ యస్. ఎ. అయ్యంగార్ ముఖ్య అతిథిగా ఉన్నారు. శ్రీ అయ్యంగార్ తన ప్రసంగంలో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, జోమోకిన్యాటా అధ్యక్షుడుగా కీన్యా రిపబ్లిక్‌గా అవతరించడంపట్ల హర్షం తెల్పుతూ స్వతంత్ర దేశంగా కీన్యా సాధించే అభివృద్ధిని భారత దేశం ఎంతో ఆసక్తితో చూస్తున్నదని ఆయన అన్నారు. భవిష్యత్తులో కీన్యా భారత దేశాలమధ్య స్నేహసంబంధాలు మరింత పటిష్ఠవంతం అవుతాయనే ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు. యీ సందర్భంలో కీన్యాదేశంలోని జీవన విధానాలకు సంబంధించిన అనేక అంశాలనుగూర్చి కీన్యా విద్యార్థులు తమ ప్రసంగాలలో వివరించారు. యీ ఉత్సవం ముగింపులో కీన్యా దేశపు జానపదనృత్యాలను కూడా ప్రదర్శించారు. ✻

---


Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at YUVA PRESS, Public Garden Road, Hyderabad.

# "ఆంధ్రప్రదేశ్" క్యాలెండర్ 1965

| | జనవరి | | | | | ఫిబ్రవరి | | | | | మార్చ్ | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | 31 | 3 | 10 | 17 | 24 | | 7 | 14 | 21 | 28 | | 7 | 14 | 21 | 28 |
| సోమ | | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | | 1 | 8 | 15 | 22 | 29 |
| మంగళ | | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | | 2 | 9 | 16 | 23 | 30 |
| బుధ | | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | | 3 | 10 | 17 | 24 | 31 |
| గురు | | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | | 4 | 11 | 18 | 25 | |
| శుక్ర | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | | 5 | 12 | 19 | 26 | |
| శని | 2 | 9 | 16 | 23 | 30 | 6 | 13 | 20 | 27 | | 6 | 13 | 20 | 27 | |

| | ఏప్రిల్ | | | | | మే | | | | | జూన్ | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | | 4 | 11 | 18 | 25 | 30 | 2 | 9 | 16 | 23 | | 6 | 13 | 20 | 27 |
| సోమ | | 5 | 12 | 19 | 26 | 31 | 3 | 10 | 17 | 24 | | 7 | 14 | 21 | [illegible] |
| మంగళ | | 6 | 13 | 20 | 27 | | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | 29 |
| బుధ | | 7 | 14 | 21 | 28 | | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | [illegible] |
| గురు | 1 | 8 | 15 | 22 | 29 | | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | |
| శుక్ర | 2 | 9 | 16 | 23 | 30 | | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | [illegible] | |
| శని | 3 | 10 | 17 | 24 | | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | |

| | జూలై | | | | | ఆగస్ట్ | | | | | సెప్టెంబర్ | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | 29 | | 5 | 12 | 19 | 26 |
| సోమ | | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | 30 | | 6 | 13 | 20 | 27 |
| మంగళ | | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | 31 | | 7 | 14 | 21 | 28 |
| బుధ | | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | | 1 | 8 | 15 | 22 | 29 |
| గురు | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | | 2 | 9 | 16 | 23 | 30 |
| శుక్ర | 2 | 9 | 16 | 23 | 30 | 6 | 13 | 20 | 27 | | 3 | 10 | 17 | 24 | |
| శని | 3 | 10 | 17 | 24 | 31 | 7 | 14 | 21 | 28 | | 4 | 11 | 18 | 25 | |

| | అక్టోబర్ | | | | | నవంబర్ | | | | | డిసెంబర్ | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | 31 | 3 | 10 | 17 | 24 | | 7 | 14 | 21 | 28 | | 5 | 12 | 19 | 26 |
| సోమ | | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | 29 | | 6 | 13 | 20 | 27 |
| మంగళ | | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | 30 | | 7 | 14 | 21 | 28 |
| బుధ | | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | | 1 | 8 | 15 | 22 | 29 |
| గురు | | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | | 2 | 9 | 16 | 23 | 30 |
| శుక్ర | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | | 3 | 10 | 17 | 24 | 31 |
| శని | 2 | 9 | 16 | 23 | 30 | 6 | 13 | 20 | 27 | | 4 | 11 | 18 | 25 | |

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టరు, హైదరాబాద్ వారి అభినందనములతో.

